# ఉత్తరాలు

## "ముఖచిత్రం"

కను బొమల నడుమ
సింధూర తిలకం
కొలకళ్ళ చూపులో
మెరుపు దీపం
మధురాధరములపై
మృదుదరహాసం
పచ్చని చేతిలో
విరిసిన మందారం
నగు మోములో తొణికిసలాడే
నిండైన తెలుగుదనం
వెరసి రమ్యకృష్ణ ముఖ చిత్రమై
ఆంధ్ర సచిత్రవార పత్రిక పాఠకులను
అలరించిన తీరు అత్యద్భుతం.

–మంతెన విజయలక్ష్మి, విజయవాడ.

## సీరియల్స్

"ఆరోహణ" సీరియల్ చాలా రసవత్తరముగా నడుస్తున్నది. రచయిత శైలకుమార్ గార్కి ధన్య వాదాలు.

–జి. కృష్ణుడు, తాడిపత్రి

★ ★ ★

"రసరాగ వాహిని" ప్రారంభ సంచికనుంచి చదువుతున్నాను. ప్రస్తుత సాహిత్య వ్యవస్థకు భిన్నముగా సంగీతమే ప్రధానముగా రచించిన కె. నాగేశ్వరిగార్కి ఇవే నా అభినందనలు.

గణపతి చౌదరి, కృష్ణ, పెద కాకాని

★ ★ ★

"ఒడిలో చెలిమోహన రాగం" చాలా ఆసక్తికరంగా నడుస్తూంది. పాపారావు పాపాలు చాలా చక్కగా వివరిస్తున్నారు.

పోలోజు వెంకటాచారి, హైదరాబాదు

★ ★ ★

9–15 జనవరి'87 సంచికలో 'రసరాగ వాహిని' సీరియల్ ముగింపు బాగుంది.

యన్. కనకారావు, పర్లాకిమిడి

★ ★ ★

కె. నాగేశ్వరిగారి 'రసరాగవాహిని' సీరియల్ అనుకోని విధంగా ముగించటం నాకు బాధవేసింది.

చెంగల కృష్ణమూర్తి, లింగన్నపాలెం

## కథలు

నటి"రమ్యకృష్ణ" ముఖచిత్రముతో విడుదలైన సంచికలోని కథల్లో "ఓ అమ్మాయి కథ", "ప్రతీకారం" చాలా బాగున్నాయి.

కొమరువోలు శైలజ,
రాధాకృష్ణ, మోదుకూరు

★ ★ ★

నటి రమ్యకృష్ణ ముఖచిత్రం చాలా అందంగా ఉంది. "ప్రతీకారం", "పుత్రభిక్ష", "మమకారం" కథలు చాలా బావున్నాయి.

–డి. సుశీలకుమారి,
డి. పద్మజకుమారి, ఇచ్ఛాపురం

★ ★ ★

నటి "రమ్యకృష్ణ" ముఖచిత్రంతో వెలువడిన 9–15 జనవరి 1987 సంచిక చాలా ఆకర్షణీయముగా యుండి "పేవ్ మెంట్", "ప్రతీకారం", కథలు చాలా బాగున్నాయి.

"ఓ అమ్మాయి కథ" మా ఇంటిల్లిపాది మనస్సులను ఆకట్టుకుంది.

–సి. హెచ్. శారద, తగరపువలస

★ ★ ★

రమ్యకృష్ణ ముఖపత్రం కల పత్రికలో "ఓ అమ్మాయి కథ" చదివిన తర్వాత హృదయం ద్రవించి పోయింది. ఆ కథలో ఎంతో వాస్తవికత ప్రతిబింబించింది. కావేరి లాంటి "కన్య"లు ఈ సమాజంలో ఎంత మంది ఉన్నారో?

–సాయినిరాజా, నేలకొండపల్లి

## వ్యాసాలు

9–15 జనవరి,87 సంచికలో "పోలియో వ్యాధికి ఆయుర్వేద చికిత్స" గురించి బహుచక్కగ వివరించి చెప్పారు డా. గోగుల లక్ష్మణ రాజుగారు. ఆయుర్వేదములో ఆరితేరిన వారై భావి పౌరులయిన శిశువులను పోలియో వ్యాధి నుండి రక్షిస్తున్నందుకు కృతజ్ఞతాభి వందనములు.

–ఊపిగారి బాలరాజు,
గంభీరావుపేట

## శీర్షికలు

గర్భస్థ శిశువు చెప్పిన కథలు ఎంతో ఆసక్తి కరముగా ఆలోచనను రేకెత్తించేవిగా ఉన్నవి.

–ఎస్. ఎల్. వి. ఎస్. శాస్త్రి, స్వర్ణ

★ ★ ★

లతగారు వ్రాస్తున్న "దూరదర్శనం" కార్యక్రమాల విమర్శలు అర్థవంతంగా ఉన్నవి. 'గర్భస్థ శిశువు చెప్పిన కథలు' చాలా ఆకర్షణీయంగా ఉన్నవి.

–జె. సుబ్రహ్మణ్య శాస్త్రి,
జక్కరసకుప్పం (కర్నాటక)

★ ★ ★

9–15 జనవరి సంచికలో మీరు ప్రచురించిన "భారత దేశంలోని ప్రవేటు రంగంలో మొదటి అయిదు పెద్ద కంపెనీలు" శీర్షిక చాల బాగుంది. మొన్న మొన్నటివరకు బాగా డబ్బున్న వాళ్ళకే పరిమితమైన షేరు మార్కెటు నేడు సామాన్య ప్రజల వరకు విస్తరించినది, మధ్య తరగతి ప్రజలు సహితం మంచి కంపెనీలలోని వాటాలను, డిబెంచర్స్‌ను కొనుగోలు చేయుచున్నారు. కనుక ఇకనుండి వీలైనప్పుడల్లా కంపెనీల గురించి ఇటువంటి ఉపయోగమైన శీర్షికను మా అభిమాన పత్రికలో ప్రచురిస్తే అది అందరికి విజ్ఞాన దాయకముగాను, ఉపయోగపడేదిగాను ఉంటుంది.

కె. సాంబశివరావు, బాపట్ల □


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)
6-12, ఫిబ్రవరి '87
శ్రీ అక్షయ నామ సం. మాఘ శు. అష్టమి.
సంపుటము 79: సంచిక 23
ముఖ్య సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు :
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2.75 |
| పోస్టులో 6నెలల చందా | రు. 80.60 |
| పోస్టులో 12నెలల చందా | రు. 161.20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి : ఫారా
(ఫొటో : జగ్ మోహన్)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :

# సమసి పోతున్న తేడాలు

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

దేశాన్ని ముక్కలు వేయనున్నాయని చెప్పబడుతున్న విచ్ఛిన్నకర శక్తుల గురించి మనం ఎక్కువగా ఆలోచిస్తున్నామేమో నని నాకు తరచుగా అనుమానం కలుగుతున్నది. విచ్ఛిన్న కర శక్తులు ఉన్నాయనే దానిలో – షహబుద్దీన్ లాంటివాళ్ళు నిజంగానే ప్రమాదకర శక్తులనడంలో– ఏమీ సందేహం లేదు. కాని దేశవ్యాప్తంగా పర్యటించిన తర్వాత నా అభిప్రాయమేమంటే ఈ శక్తులు చావో రేవో తేలిపోయే పోరాటంలో ఉన్నాయి గనుకనే ఇలా విరుచుకు పడుతున్నట్టు కనబడుతున్నాయి. దేశాన్ని సమైక్యం చేస్తున్న ఐక్యతా శక్తుల నుంచి ఈ విభజన శక్తులు విపరీతమైన వ్యతిరేకతను ఎదుర్కొంటున్నాయి. ఇలా నానాటికీ పెరుగుతున్న వ్యతిరేకత ఒకవైపునా, అందుకు సమానమైన ప్రతిక్రియ మరో వైపునా ఉండడమే ప్రస్తుత స్థితికి కారణం.

చాలా కాలం క్రితం కానప్పటికీ, గతంలో భారతీయుల లోనే ఒక రాష్ట్రానికి చెందిన వారికీ, మరో రాష్ట్రానికి చెందిన వారికీ మధ్య తేడా గుర్తించడం సాధ్యమయ్యేది. ఢిల్లీలో పంజాబీలు, హరియాణ్వీలు, బొంబాయిలో మహారాష్ట్రియన్‌లు, గుజరాతీలు కొన్ని శతాబ్దాలుగా కాక పోయినా కొన్ని దశాబ్దాలుగా నైనా కలిసి జీవిస్తున్నారు. ఇరవై సంవత్సరాల క్రితం వారి మధ్య తేడా గుర్తించడం వీలయ్యేది. ఇప్పుడది సాధ్యం కాదు. పేర్లు వేర్వేరుగా ఉన్నా, కొన్ని సందర్భాలలో నివాస ప్రాంతాలు వేర్వేరుగా ఉన్నా మీరు వారిని వీధిలో నో, కార్యాలయాల్లోనో చూస్తే వారి మధ్య తేడాలు అంత పెద్దవిగా కనబడవు. ఇదివరకున్నంత విభిన్నంగా వారి వేష భాషలు ప్రస్తుతం లేవు. బొంబాయిలో గానీ, ఢిల్లీలో గానీ వాళ్ళు ఒక రకమైన హిందీ మాట్లాడతారు. దాన్ని బట్టి ఎవరు ఎవరో తెలుసుకోవడం నిజంగా సాధ్యం కాదు. వృత్తి పరంగా వేర్వేరుగా ఉన్న వృత్తులను కూడ వాళ్ళు చేపట్టడం లేదు. బొంబాయిలో గుజరాతీలు, మహారాష్ట్రియన్లు ఇతర వర్గాలవారిలాగానే దాదాపు ఒకే రకమైన పనినే చేస్తుంటారు. ఇతర స్థాయిలలో భేదాలుండవచ్చును గాని మధ్య తరగతిని పరిగణిస్తే మాత్రం భేదాలు పూర్తిగా లేవనే చెప్పాలి.

గతవారం నేను విజయవాడలో మూడు రోజులు గడిపాను. అలాంటి పట్టణాలలో నేను మామూలుగా గడిపే సమయం కన్న ఇది ఎక్కువ. పూనా ఎంతగా మరాఠీ నగరమో, విజయవాడ కూడా అలాగే తెలుగు నగరం అనుకోండి, కాని తెలుగు గానీ, దక్షిణ భారతీయ భాషల్లో ఏ ఒక్కటి గానీ రాని వ్యక్తికి అది పరాయి నగరమని నాకనిపించలేదు. పట్టణాలు వేరు వేరుగా కనబడిన కాలం ఒకటి ఉండేది. మీరు పూనాలో ఉన్నట్టయితే అక్కడి భవనాలనూ, రహదార్లనూ బట్టే అది పూనా నగరమని చెప్పగలిగే పరిస్థితి ఉండేది. ఉత్తరాన గుర్‌గాంవ్ కంటే దక్షిణాన మదురై ఎంతో భిన్నంగా ఉండేది. కాని విజయవాడ అంత భిన్నంగా కనిపించలేదు. భవనాలు భారతీయంగా ఉన్నాయి. జమ్ము నుంచి ఎర్నాకుళం దాకా ఎక్కడ చూసినా కనబడే భవనాలలాంటివే అవి. చాలా మంది, ముఖ్యంగా యువతరం, దాదాపు ఇతర చోట్లలా గనే, ప్యాంటు, చొక్కా, చీర ధరించారు, దేశంలోని ఇతర ప్రాంతాల యువత కన్నా భిన్నంగా ఏమీ ప్రవర్తించలేదు. పత్రికలు కూడా దాదాపు మిగిలిన చోట్లలాగే, అటువంటి కూర్పులతో నే, అవే వార్తలతో, అవే ఉత్పత్తుల అవే ప్రకటనలతో, అవే బొమ్మలతో – ఉన్నాయి. మీరు ఉదయం లేచి నాలాగే హోటల్ గదిలో నుంచి చూస్తే ఎక్కడున్నానని ఒకటి రెండు సార్లు ఆలోచించుకోవలసి వచ్చేది. ఎందుకంటే ఆహారం, ముఖ్యంగా రెస్టారెంట్లలో, ఏమాత్రం వేరుగా లేదు. నేను ఆ నగరమంతా అసలైన ఆంధ్రా భోజనం కోసం కలియదిరిగాను గాని నాకు దొరికిన భోజనం దేశంలోని ఇతర నగరాలలో దొరికే దానికన్న, ఉత్తర భారత నగరాల్లోని దక్షిణ భారత రెస్టారెంట్లలో దొరికేదానికన్న భిన్నంగా ఏమీ లేదు.

నేను– యువకులూ, వృద్ధులూ, చిన్న చిన్న గుంపులలో నిలబడ్డ వారూ మొదలైన ప్రజల్ని కలిశాను. వాళ్ళలో చాల మందికి దేశంలోని ఇతర ప్రాంతాల ప్రజలకున్న బాధలే, సమస్యలే ఉన్నాయని గుర్తించాను. ధరలు పెరుగుతున్నాయి. ఉద్యోగాలు సులభంగా రావడం లేదు. అడ్మిషన్లు కష్టంగా దొరుకుతున్నాయి. కాని దేశంలోని ఇతర ప్రజల లాగానే బతుకు లాగిస్తున్నారు. కొన్ని విషయాలు భిన్నంగా కనబడతాయి. ఉదాహరణకు సూర్యుడు ఉత్తర భారతంలో కన్న ఇక్కడ మరింత గుండ్రంగా కనబడతాడు. కాని లండన్‌లో కూడ సూర్య చంద్రులు భిన్నంగా కనబడతారు. నాకేమనిపిస్తున్నదంటే మనం క్రమక్రమంగా దగ్గరవుతున్నామని, మెల్లగా ఒక జాతిగా ఎదుగుతున్నామని. ఉత్తర దక్షిణ



భారతీయుల మధ్య వివాహాలు దానిని మరింత త్వరితం చేసాయి.

మనం వదిలేయ వలసిందల్లా మన దురాక్రమణ పూరితమైన భాషా దురహంకారాన్ని – నా భాష నీ భాషకన్నా గొప్పది– అనే భావాన్ని వదుల్చుకోవాలి. దీని నుంచి ఆవిర్భవించే సాంస్కృతిక దురహంకారాన్ని కూడా మనం వదులుకోవాలి. ఇది సులభమేమీ కాదు. కాని మనం మెల్ల మెల్లగా ఒకరితో ఒకరం కలిసి జీవించడం నేర్చుకుంటున్నామని నాకు అనిపిస్తున్నది. వేరు వేరు దేశాల నుంచి వచ్చిన అమెరికన్లు కూడ చేసిందదే. అమెరికన్లలో అత్యధిక సంఖ్యాకులు ఒకటి రెండు తరాల కిందట వారి పూర్వీకులు వేరే దేశాల నుంచి ఆదేశాని కొచ్చి స్థిరపడగా పుట్టినవారే. కాని వాళ్ళు ఇతరులతో కలిసి పోగలుగుతారు. అంతరంగిక, వ్యక్తిగత సందర్భాలలో ఎలా ఉన్నా బహిరంగంగా మాత్రం వాళ్ళు కలిసే ఉంటారు. తాను ప్రస్తుతం ఇటాలియన్‌ని కాబట్టి లేదా గతంలో ఇటాలియన్‌ను కనుక, లేదా జర్మన్‌ని కనుక గొప్ప వాణ్ణని ఎవరూ అనరు. ఒక ఉమ్మడి భాష గొప్ప ఐక్యతా శక్తిగా పని చేస్తుందనే మాట నిజమే, మనం కూడ మెల్ల మెల్లగా ఆవైపే పయనిస్తున్నాం. మనకు ఇష్టం ఉన్నా, లేక పోయినా మనకు ఒకటో, రెండో ఉమ్మడి భాషలు ఉండక తప్పదని, తద్వారానే మనం కలిసి జీవించ గలమని మనకు అర్థమవుతున్నది.

నాకు తెలుగు తెలియదు. ఇంగ్లీషు, హిందీల సాయంతో, ఎక్కువభాగం హిందీసాయంతో- నాకా భాష చాలా బాగా రాక పోయినా- నేనక్కడ గడపగలిగాను. ఎవరిమీద నైనా ఏ భాష నైనా రుద్దడానికి నేను వ్యతిరేకం. విషయాన్ని దాని కదిగా వదిలేస్తే మనదైన ఉమ్మడి భాష ఒకటి రూపొందుతుందని నేననుకుంటాను. అలా ఏర్పడే భాష ఒక రకమైన హిందీగా ఉండి దక్షిణాన వాడకానికి వీలుగా చాలా దక్షిణ భారత భాషల పదాలు, ఉత్తరంలో వాడకానికి వీలుగా చాలా బెంగాలీ తదితర పదాలు కలిసి ఉంటుందని నేననుకుంటాను. మన ఆహారంలో ఇప్పటికే ఆ మార్పు జరుగుతున్నది. చాలా శాకాహార భోజన పదార్థాలు దక్షిణాది నించి వచ్చిన వంట వారు వండినట్టుగా కనబడుతున్నాయి. చాలా మాంసాహార భోజన పదార్థాలు ఉత్తరాది వంట వారు వండినట్టుగా కనబడుతున్నాయి. తీపి పదార్థాలు కూడా ఎంత ఎక్కువగా ఉమ్మడిగా మారి పోతున్నాయంటే జిలేబి ఉత్తరాదిదని ఎవరూ అనుకోరు. దోశ దక్షిణాది ఆహార పదార్థమనీ ఎవరూ అనుకోరు. ఇప్పటి నుంచి ఇరవై ఐదు సంవత్సరాల తర్వాత- బహుశా ఇంకా ముందే కావచ్చు- ఉత్తరాది, దక్షిణాది అనే మాటలు కేవలం భౌగోళికమైన తేడాను సూచించేవి గానే మారిపోవచ్చు. అప్పుడు మనం– లేదా మన పిల్లలు– నా కుటుంబం ఉత్తరాదికి చెందినది, కాని నేను నూటికి నూరు పాళ్ళూ భారతీయుణ్ణి, ఉత్తరాదికి చెందిన వాడినో, దక్షిణాదికి చెందిన వాడినో కాను, కేవలం భారతీయుణ్ణి అంటాము. □

సీరియల్

ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

కా రోజే బారసాల

అందర్నీ భోజనాలకు పిలిచారు మంజీర మేనమామలు పింతల్లులు ౦నత్తలు మొదలైన బంధువర్గమంతా వచ్చేశారు ఊరంతా సందడిగా ంది బజారు మొత్తం పందిరేశారు ప్రత్యేకమయిన బ్యాండు మేళం ంస్కృతిక కార్యక్రమాలు అట్టహాసంగా ఏర్పాటుచెయ్యబడ్డాయి బజార్లో ంచి పట్టుచీరలు గరగరలాడించుకుంటూ అంతా తన పుట్టింటికి పేరంటానికీ భోజనానికీ వెళ్లటం వాకిట్లో నిలబడి చూస్తూనే ఉంది మంజీర

ంధువులతో తమ ఇల్లు నిండిపోయి ఉంటుంది వాళ్లంతా తనను బుచుకోరా? నాన్నకు తనంటే ప్రేమలేదా? తమనూ పిలవగూడదా?

వాళ్లంతా అక్కడ సరదాగా, సంతోషంగా ఉంటే . తనొక్కతే వాళ్ల నుంచి విడేయబడి ఇలా దూరంగా బిక్కుబిక్కుమంటూ ఉండి పోవాల్సొచ్చింది

తను చెప్పినట్టు తండ్రివేపు రాకుండా ఉండిపోయిన ప్రణీత్ ంండితనానికి కోపమొస్తోంది

ఉక్రోషంగా ఏడుస్తూ లోపలికొచ్చిన మంజీరను చూస్తుంటే కామేశ్వరి నసు జాలితో నిండిపోయింది ఇంకా పసితనం వీడని ఆ అమ్మాయి మనసుని ధను అర్థం చేసుకుని అక్కున చేర్చుకుంది .

అత్తయ్యా! నేను నేను అమ్మ దగ్గర కెడతాను ' కన్నీళ్లతో అన్నది ంజీర

ప్రణీత్ వచ్చాక అడిగి వెడుదువుగానిలే ఏడవకు.' అన్నది కామేశ్వరి


రిగిన కథ –13 : బాబూరావును ఎదిరించి వివాహం చేసుకున్న మంజీర, ణీత్‌లకు రాజకుమార్ సాయంగా ఉంటాడు. ప్రణీత్ మీద బాబూరావుకు ,షాన్ని పెంచుతుంటాడు పాపారావు. శార్వాణి మళ్ళీ గర్భవతయిందని తెలిసి ల్లని చూడాలని మంజీర ప్రాణం కొట్టుకులాడుతుంది గూడెం వ్యవహారాల్లో ఒకలు తేవాలని పాపారావు చేసిన ప్రయత్నాలను ప్రణీత్ భగ్నం చేస్తాడు బూరావు. శార్వాణిల కొడుకు బారసాలకు కూడ కూతురికి ఆహ్వానం పంపరు ంబం మనసులో విషం చిలకడానికి పాపారావు ప్రయత్నిస్తుంటాడు



అంతకన్నా ఎం చెప్పాలో ఆ అమ్మాయికెలా నచ్చజెప్పాలో అర్థంకాలేదామెకు

ప్రణీత్ రాకకోసం ఎదురుచూస్తూ ఇంట్లోకీ బయటకీ తిరుగుతోంది మంజీర

వాకిట్లో మోటార్ సైకిల్ శబ్దం వినగానే దాదాపు పరుగెడుతున్నట్టుగా ప్రణీత్‌కి ఎదురెళ్లింది మంజీర అప్పటికే ఆమె రెడీ అయి వుంది

"రాణీగారెక్కడికో బయలుదేరినట్టున్నారే" ఆమె భుజంమీద చెయ్యేస్తూ అన్నాడు ప్రణీత్

'గదిలోకి పదండి చెపుతాను" అంటూ అతన్ని లోపలికి లాక్కుపోయింది మంజీర.

ఇహ చెప్పు! ఏమిటి? అన్నాడు ప్రణీత్ నవ్వుతూ

మీకు కోపం వస్తుందేమో!" సందేహంగా అన్నది మంజీర ఇందాకట్నుంచీ ఉన్న ధైర్యం దిగజారిపోయిందామెలో

నాకేం కోపం రాదు చెప్పు' అన్నాడతను

"కోపమొచ్చినా . నన్ను తిట్టకూడదు " చిన్నపిల్లలా అన్నదామె

నేను నిన్ను ఎప్పుడయినా తిట్టానా? తిట్టగలనా?!"

"నేను నేను మా తమ్ముడి బారసాలకెడతానండీ! ఒక్కసారి '

ఆమెమీద జాలి పొంగుకొచ్చింది ప్రణీత్‌కి

"వాళ్ళు నిన్ను పిలవలేదుగా" అన్నాడు ఆర్ద్రంగా

"పిలవకపోతే ఏం? అది నాకు పరాయి ఇల్లా? నే వెడితే అమ్మానాన్నా కాదంటారా?"

మీ అమ్మగారి సంగతి ఒదిలెయ్యి అంతమందిలో మీ నాన్నగారు నిన్ను "

ఏమీ అనరు నేనాయన కూతుర్ని కాదా??' అతన్ని మధ్యలో నే ఆపుతూ అన్నదామె

"అతని చేతులామె ముంగురుల్ని ఆప్యాయంగా స్పృశించాయి

"మంజూ! నీకు దక్షప్రజాపతి కథ తెలుసా? "

'తెలీదు'

నేను చెప్పనా?"

ఆ కథ వింటే మరి నన్ను పంపిస్తారా?"

'అది విన్నాక కూడా నువ్వు వెడతాననే అంటే నేనే స్వయంగా తీసికెళ్లి అక్కడ దింపి వస్తాను "

త్వరగా చెప్పండయితే"

"దక్ష ప్రజాపతికి తన కూతురు శివుడిని పెళ్లి చేసుకోటం ఇష్టంలేదు. ఆవిడ పేరు సతీదేవి. నీలాగే తండ్రి నెదిరించి శివుణ్ని పెళ్లాడింది ...

ఒక రోజు సతీదేవి తలంటుపోసుకుని బయట నిలబడి తలారబెట్టుకుంటోంది ...

దేవతలు ... మునులు .... గంధర్వులు మొదలయినవాళ్లంతా ఆకాశమార్గాన వెడుతుంటే కుతూహలంగా ఆపి, సంగతేమిటని అడిగింది. వాళ్ల ద్వారా ... తన తండ్రి గొప్ప యజ్ఞం చేస్తున్నాడని విన్నది. తన అక్కలంతా కూడా వచ్చేశారని ... ఆ యజ్ఞం కన్నులపండగ్గాఉన్నదనీ చెప్పారు వాళ్లు.

స్త్రీ సహజమయిన కుతూహలం ... పుట్టింటి మీద మమకారం ఆమెను నిలవనివ్వలేదు. అనుజ్ఞ ఇమ్మని భర్తనడిగింది.

"పిలవనిదే పుట్టింటికయినాసరే వెళ్లటం మంచిదికాదు" అని శివుడెంత నచ్చచెప్పినా వినలేదు.

చివరకు వినాయకుడిని తోడిచ్చి ఆమెను పుట్టింటికి పంపాడు శివుడు ...

విఘ్నాలు కలుగుతాయని వినాయకుడిని మాత్రం లోపలికి తీసికెళ్లి ఉండ్రాళ్లూ వగైరాలు పెట్టారు. సతి నెవరూ పలకరించలేదు. యాగశాలలో కెళ్లి నిలబడింది. ఎవరూ ఆమెను కన్నెత్తి చూడలేదు.

అవమానంతో తల దించుకుని కాలిబొటన వేలితో నేలను రాస్తూ నిలబడిందామె. ఆమె కళ్ల నుంచి అశ్రుకణాలు జాలువారుతున్నాయి ...

కాలు రాసిన చోట పుట్టిన ఆ అవమానాగ్నిలో సతీదేవి దహించుకుపోయి బూడిదలా మారింది ...

శివుడు శోకావేశంతో పిచ్చివాడయిపోయాడు ...

ఆ తరువాత కథ మనకవసరంలేదుగానీ ... పార్వతి వియోగం శివుడిని కుంగదీసింది. సతీదేవి తిరిగి ... గిరిరాజపుత్రికగా మరోజన్మ ఎత్తి తనను చేరేవరకూ ఆయనలో ఆ జడత్వం వదలలేదు ...

కానీ ... మంజూ! నాకు శివుడికున్నంత ఓర్పులేదు ... నువ్వు లేవని తెలిసిన మరుక్షణమే ... నీ ప్రణీత్ కూడా ఉండడు ..." అతని స్వరంలో హఠాత్తుగా దొర్లిన విషాదానికామె చలించిపోయింది.

"నేను వెళ్లను ప్రణీత్. మిమ్మల్ని వదలి ఎక్కడికీ వెళ్లను" ఒంగి అతని నుదుటిని చుంబిస్తూ అన్నది మంజీర.

ఆమెలో ఇంతకుముందున్న దిగులు ఇప్పుడు మచ్చుకు కూడాలేదు.

సంతోషంతో కూడిన ప్రణీత్ లాలనలో ఆమె అన్నీ మర్చిపోయింది ...

* * * * * * * * * * *

వీలయినప్పుడల్లా పాపారావు ఆ ఇంటికి రాకపోకలు సాగిస్తూనే ఉన్నాడు...

తను చెపితే మంజు వినటంలేదు. ప్రణీత్‌కి చెపుదామంటే ... తనమీద నేరాలు చెపుతోందని ఆ పిల్ల ఫీలవుతుందేమో ... ఆ భావంతో తనమీద మనసు విరిచేసుకుని ఇంకా పెంకెగా ప్రవర్తిస్తుందేమో ... ఏం కలతలు వస్తాయో అనే భయంతో కామేశ్వరి మౌనం వహిస్తోంది.

* * * * * * * * * * *

"పిల్లలు పెద్దవాళ్లవుతున్నారు. మీరీ తాగుడు మానెయ్యండింక. ఉదయం మన పెద్దవాడు నేను చూడకుండా గ్లాసులో నీళ్లు పోసుకొచ్చి, అందులో బ్రాందీ ఒంపి తాగబోయాడు ... మగపిల్లలు తండ్రిని ఆదర్శంగా తీసుకుంటారు. వాడు మీలాగే తాగుబోతుగా మారటానికి ప్రయత్నిస్తున్నాడు. అది తప్పని వాడికి తోచటంలేదు. నేను చెప్పబోతే ...

"తప్పయితే నాన్నెందుకు తాగుతున్నాడు?" అని అడిగాడు. వాడికేం చెప్పను?

నేనేమయిపోయినా ఫర్లేదు. కానీ ... నా బిడ్డలు తాగుబోతులుగా ... ముండల మురికోర్లుగా ... నీచులుగా తయారవటాన్ని నేను సహించను. మీకన్నాకూడా వాళ్లూ ... వాళ్ల భవిష్యత్తే నాకెక్కువ. మిమ్మల్ని పెళ్లి చేసుకుని నేను సుఖపడి చచ్చిందేంలేదు. ఎప్పుడూ నరకమే. ఆశాతే!

నా పిల్లడు మరో పాపారావుగా మారి ఇంకో హరిణి కిలాంటి నికృష్టమైన జీవితాన్నివ్వటాన్ని నేను సహించను.

మీరు మరోసారి ఆ సీసా ముట్టుకున్నారా... జాగ్రత్త" పూనకం వచ్చిన దానిలా ఉంది హరిణి. ఉదయం తన కొడుకు చెయ్యబోయిన పని ఆమెను



# రచయిత్రి జవాబులు

**చాత్రాతి సత్యనారాయణ, బొర్రంపాలెం**

ప్ర: పాఠకులతో ముఖాముఖీ ప్రారంభించటంలో గల ఉద్దేశ్యమేమిటి?

జ: పాఠకులకూ రచయిత(త్రు)లకూ మధ్య దూరం తగ్గి సదవగాహన ఏర్పడేందుకు పాఠకులు తమ అభిప్రాయాలూ, సూచనలూ, సద్విమర్శలూ తెలియజేసేందుకు ఏర్పరచబడ్డ వేదిక ఇది

**కె. లీలాకుమారి, ఏలూరు**

ప్ర స్త్రీలు అన్ని రంగాలలోనూ ఎంత ముందడుగు వేస్తున్నా. ఎంత విజ్ఞానాన్ని ఆకళింపు చేసుకుంటున్నా వాళ్ళ మనస్తత్వాలలోనూ చేతలలోనూ మార్పు రావటం లేదు కారణం ఏమిటంటారు?

జ.కొన్ని కొన్ని సహజగుణాలు అంత తేలికగా పోవు

**కె. భువనసుందరి, నెల్లూరు**

ప్ర సావిత్రిగారూ! మీ ఒడిలో చెలిమోహనరాగం సీరియల్ చాలా బావుంది. మీరు సద్విమర్శలకు జవాబు లిస్తారా లేక బాగా పొగిడిన వాళ్ళకి జవాబు లిస్తారా?

జ. ఇది కూడా తెలీదా భువనసుందరిగారూ! ఇంత పబ్లిక్‌గా అడిగితే విమర్శలకని చెప్పక పొగడ్తలకని చెపుతారా ఎవరైనా?!

**సి. ప్రణీత్‌కుమార్, హైదరాబాద్**

ప్ర మీ హీరోకి పెట్టింది నా పేరో

జ మరో

**ఆర్. శ్యామలగౌరి, పెద్దాపురం**

ప్ర మీకు పెద్దాపురం పట్టు చీరలంటే ఇష్టమేనా?

జ. పెద్దాపురం శ్యామల గౌరంటే ఇష్టం.

**కె. రాజశేఖర్, చీరాల**

ప్ర: మీతో కలం స్నేహం చెయ్యాలనుంది. ప్లీజ్, మీ ఫోటో పంపరూ?

జ: సారీ! ఫోటోలు ఎవరికీ పర్సనల్‌గా పంపటం లేదు



## ఉత్తమప్రశ్న

**బి. బాలాజీ, ఖరగ్‌పూర్**

ప్ర : ఒక రచయిత్రి తను ఎక్స్‌పెక్ట్ చెయ్యనంత గొప్ప నవల రాయగలిగితే ఎక్కువ సంతోష పడుతుందా... లేక తన మనసుకేమాత్రం తృప్తి నివ్వని రచన మార్కెట్‌లో బాగా పాపులరయితే ఎక్కువ సంతోషిస్తుందా?

జ : అది ఆ రచయిత్రి మానసిక స్థాయిని బట్టి ఉంటుంది.

**జి. రమేష్‌బాబు, ఏలూరు**

ప్ర సావిత్రిగారూ! 'మనిషికి నీతి – నిజాయితీలు ముఖ్యమని.. ప్రేమించిన అమ్మాయిని మోసం చెయ్యగూడదని. డబ్బుకోసం ఆశించక ఎన్ని అవాంతరాలనైనా ఎదుర్కొని ప్రేమను పెళ్ళిగా మార్చుకోవాలని... కానీ ఈ ప్రయత్నంలో వీలైనంత వరకూ పెద్దలను హర్ట్ చెయ్యకుండా చూడాలని" యువకుడైన ప్రణీత్ పాత్ర ద్వారా మీరు యువతరాన్ని ప్రబోధిస్తున్నారు స్త్రీని గౌరవించి తీరాలని నూరిపోస్తున్నారు మీ ప్రయత్నం వృథా కాకూడదని కోరుకుంటున్నాను

జ: థాంక్సండీ, చక్కగా అర్థం చేసుకున్నారు.

**సీ. హెచ్. లలితాదేవి, అమలాపురం**

ప్ర సావిత్రిగారూ! మీరు కథను బట్టి టైటిల్ ఎన్నుకుంటారా లేకె టైటిల్‌ని బట్టి కథను మలుస్తారా?

జ చాలాసార్లు నవల పూర్తయేవరకూ టైటిల్ గురించి ఆలోచించను

**కె. లీలాకుమారి, కర్నూలు**

ప్ర "పడమట సంధ్యారాగం ఒడిలో చెలి మోహనరాగం జీవితమే రంగులవలయం ఇలా మీ ప్రతి నవలా ఏదో ఒక పాటలో చరణం అయిఉంటోంది. ('టైటిల్' గురించి నేను చెప్పేది) మీరలా పెట్టటం వెనుక ఏదయినా కారణం ఉందా?

జ ప్రత్యేకించి ఏ కారణమూ లేదు నా ప్రతి నవలా అలాలేదు. ఉదాహరణకి.. ఈ దేశంలో ఓ ఆడపిల్ల" 'కాలం కాటేసిన మనుషులు' వగైరా వగైరా.

**సి. హెచ్. సత్యనారాయణ, మంటాడ**

ప్ర సావిత్రిగారూ! ఈనాడు రచయిత(త్రు)లు సినిమాకోసం నవలలురాస్తూ, సినిమాలకోసం కాదు అని ప్రకటన లిస్తున్నారు దీని మీద మీ అభిప్రాయం ఏమిటి?

జ అలాంటి ప్రకటన నేనూ చూడటం తటస్థిస్తే తప్పక మీ ప్రశ్నకు జవాబు చెపుతాను

**కె. రాజశేఖర్, కడప**

ప్ర . నా ప్రశ్నలకు మీరు జవాబు లివ్వరా? ఎన్నో ఉత్తరాలు రాశాను గదండీ!

జ · సారీ! పర్సనల్ విషయాల గురించి అడిగితే జవాబు లివ్వబడవు

## ఒడిలో చెలి మోహనరాగం

తలకిందులు చేసింది

"ఎమేవ్! ఇండియాకు ప్రెసిడెంటు హోదాలో మాట్లాడేస్తున్నావ్! నువ్వు నా పెళ్ళానివనే సంగతి మర్చిపోయావా!" నా ఇష్టమొచ్చినట్లు తాగుతాను నువ్వెవరివే నన్నడగటానికి!" ఇంకో పెగ్గేసుకుంటాను పట్రా బాటిల్ పట్రా! నువ్వే కలిపివ్వు అన్నాడు పాపారావు అప్పటికే అతను తాగి ఉన్నాడు

ఉదయం నుంచీ అణచి ఉంచుకున్న ఆవేశం తాగి తూలుతూ ఇంటి కొచ్చిన పాపారావుని చూడగానే అంచులు దాటింది హరిణిలో

ఇంట్లో బాటిల్స్ లేవు అన్నది హరిణి స్థిరంగా

లేవూ" బీరువాలో ఫుల్ బాటిల్స్ రెండు పెట్టాను చూడవే

లేవు వాటిని బయట పారేశాను

పారేశావా! లంజాముండా! ఎంత ధైర్యమే నీకు!? అంటూ హరిణి జుట్టు పట్టుకున్నాడు పాపారావు

నాన్నా! అమ్మను కొట్టావో జాగ్రత్త" ఎనిమిదేళ్ళ పెద్ద కొడుకు అడ్డం వస్తూ అన్నాడు

ఏడకావ్ లెరా వెధవా! ఇది నీక్కూడా నూరి పోస్తోందా నా మీద తిరగబడమని" అంటూ వాడ నొక్క తోపు తోశాడు పాపారావు

వాడా వూపుకు తూలి టేబులుమీద పడ్డాడు టేబులు అంచు నుదుటికి పొడుచుకుని ఎర్రగా మారింది

ఈనిన ఆడపులిలా లేచింది హరిణి

చీ! పశువునయం మీకన్నా కన్నబిడ్డలనే మమకారం కూడా లేదు మీలాంటి దరిద్రులకి పెళ్ళెందుకు పిల్లలెందుకు? తెగతాగి, కనపడ్డ ఆడదానివెంట కుక్కలా పడుతూ ఎందరి జీవితాల్లోనో నిప్పులు పోస్తూ నీచాతి నీచమైన జీవితాన్ని గడిపే మీలాంటి దౌర్భాగ్యులకి సంసారాలూ.. బంధాలు అనేవి అనవసరం నేను నా పిల్లల్ని తీసుకుని ఎటయినా వెళ్ళిపోతాను నాలుగిళ్ళలో పంట చేసుకుంటే ఇంతకన్నా సుఖంగా గౌరవప్రదంగా గడపొచ్చు పిల్లాడని దగ్గరకు తీసుకుని గాయం తుడిచి మందేస్తూ తిరస్కారంగా అన్నది హరిణి

ఆమె మాటల్ని లెక్క చెయ్యకుండా తూలుతూ తనే బరువా దగ్గర కెళ్ళి వెతికాడు పాపారావు నిజంగానే అక్కడ బాటిల్స్ లేవు ఊరికేఅలా బెదిరిస్తోంది గానీ హరిణి కంత ధైర్యం లేదని అతని అభిప్రాయం

చెప్పు!! వాటి నెక్కడ దాచావ్" అన్నాడు మళ్ళీ

**పెద్దేటి రామ్మోహన్, తిరుపతి**

ప్ర : "ఒడిలో చెలి మోహన రాగం" సీరియల్ అద్భుతంగా ఉంది. కొటేషన్స్ అందంగా అమిరాయి.

జ : థాంక్స్!

**రాజా ప్రణయప్రకాష్, గుడిపాటిగడ్డ**

ప్ర : మంజీరా ప్రణీత్‌ల వివాహాన్ని ఎందుకు వాయిదా వేశారు?

జ : ఆదర్శాల గురించి ఉత్తర మంతా నింపేసిన మీకు ఇంత చిన్న ఆదర్శం అర్థంకాలేదా?! ఆర్థిక స్వాతంత్ర్యం లేని ప్రణీత్ దాన్ని సంపాయించుకునేంత వరకూ వివాహాన్ని వాయిదా వెయ్యక ఏం చేస్తాడు?

**యస్. విజయ, గుంతకల్**

ప్ర : "ఒడిలో చెలిమోహనరాగం" నవలలోని పాత్రలు, పల్లెలోని రాజకీయాలకు మీకు ప్రేరణ ఎలా కలిగింది?

జ : నా నవలలోని ప్రతి పాత్రా నేటి సమాజంలో సజీవంగా కళ్ళెదుట నిలిచేవే. అలాగే... సంఘటనలు కూడా. వాటి నుంచే ప్రేరణ పొందగలుగుతాను.

మంచిని చెడు డామినేట్ చేస్తూ ఉండటం కూడా నిత్యం మనం చూస్తునే ఉన్నాం.

**బీసా మురళీకృష్ణ, మార్కాపురం**

ప్ర : మీరే యమునయితే?

జ : వెళ్ళి, సముద్రంలో కలుస్తాను. (నదీనాం సాగరో గతిః....)

**యన్. రవి, సత్తుపల్లి**

ప్ర : ఒకస్త్రీ గతిలేని పరిస్థితుల్లో వ్యభిచారానికి పాల్పడితే మన చట్టాలు ఆమెనేవిధంగా కాపాడగలుగుతున్నాయి?

జ : మనుషుల మనస్తత్వాల్లో మార్పు రానంత వరకూ చట్టాలు ఎవర్నీ ఏవిధంగానూ కాపాడలేవు. వరకట్నం.... వ్యభిచార నిర్మూలన లాంటి సున్నితమైన సమస్యలు కేవలం చట్టాల ద్వారా పరిష్కరింపబడవు. □

# యువతలో ఉగ్రవాద ఉన్మాదం!

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో దక్షిణాదికి చెందిన యువతరం భిన్న భిన్న వర్గాలుగా ఏర్పడి హింస, దౌర్జన్యం వంటి చర్యలకు పాల్పడుతూ ప్రశాంత పౌర జీవనానికి తీవ్ర విఘాతం కల్పిస్తున్నట్లు వార్తలు అందుతున్నాయి. హత్యలు, మాన భంగాలు వంటి నేరాలు పదే పదే పునరావృతం కావటం పట్ల ప్రజలు భయాందోళనలను వ్యక్తం చేస్తున్నారు.

"స్కూబాయిస్" అనే వర్గానికి చెందిన వార్రెన్ ట్రిప్లెట్ అనే పదహారేళ్ల కుర్రవాడిని గుర్తు తెలియని కొందరు –"వైట్ లార్డ్స్" వర్గానికి చెందిన వారు కాల్చి చంపారు. విన్సెంట్ బైలీ అనే పద్దెనిమిదేళ్ల కుర్రవాడిని కూడా ఎవరో కాల్చి వేశారు. ఈ కుర్రవాడికి ఒక ఉగ్రవాద సంస్థలో సభ్యత్వం ఉన్నట్లు తెలుస్తోంది. "డవున్ బై లా" అనే ఉగ్రవాద సంస్థకు చెందిన పంతొమ్మిదేళ్ల తిమోతి హారిస్‌కు ఒక హత్యతో సంబంధం ఉన్నట్లు దర్యాప్తులో తేలింది.

ఇలాగ ఉగ్రవాద సంస్థలు విచ్చలవిడిగా రకరకాల నేరాలకు పాల్పడటం ఉత్తరాదికి చెందిన చికాగో, లాస్ ఏంజిల్స్, న్యూయార్క్ వంటి ప్రాంతాల్లో సాధారణమైన విషయం కాగా, ఇటీవల కొన్ని సంవత్సరాలుగా ఈ ఉగ్రవాద సంస్థల పైశాచిక కృత్యాలు జాక్సన్, మిసిసిపి, చట్టానూగా, అట్లాంటా వంటి దక్షిణాది ప్రాంతాలలోకి కూడా బాగా చొచ్చుకొని పోవటం దురదృష్టమని వాపోయే వారు ఎంతో మంది ఉన్నారు. 1979 నుంచి ఈ సంస్థల అకృత్యాలు మితిమీరుతున్నట్లు నివేదికలు వెల్లడిస్తున్నాయి.

"డవున్ బైలా" అనే ఉగ్రవాద యువకుల సంస్థ అట్లాంటా ప్రాంతంలో అనూహ్యమైన బీభత్సాన్ని సృష్టిస్తున్నట్లు పోలీసు వారి భోగట్టా. 'ది వారియర్స్', "బ్లాక్ ఏంజిల్స్" – వంటివి మరికొన్ని ఉగ్రవాద సంస్థలు. ఇందులో "బ్లాక్ ఏంజిల్స్"లోని సభ్యులంతా అమ్మాయిలేనని వింటుంటే మరింత ఆశ్చర్యం వేస్తుంది.

ఉగ్రవాద పైత్యం ఉత్తర రాష్ట్రాల నుంచే దక్షిణాది రాష్ట్రాలకు సోకినట్లు చెబుతారు. ఈ



"డవున్ బై లా" ఉగ్రవాద సంస్థకు చెందిన చీఫ్ బర్గర్, పోలో మాక్‌లు!

సామాజిక జాడ్యాన్ని ఎదుర్కోక పోతే జాతి మొత్తం నష్టపోవలసి వస్తుంది. అనారోగ్యకరమైన ఈ ధోరణులు మిగతా దేశాలకు వ్యాపించకుండా జాగ్రత్త పడటం ఎంతైనా అవసరం. ఇప్పటికే ప్రపంచ వ్యాప్తంగా హింస పెచ్చరిల్లుతోంది. శ్రుతి మించక ముందే మేలుకొని జాతిని రక్షించుకోవటం కనీస కర్తవ్యంగా భావించాలి. (ఓ.వి.) □

"పారేశానని చెప్పానా? వినపడ్డం లేదా?" నిర్లక్ష్యంగా అన్నది హరిణి. ఆమె నిజంగానే పారేసిందనే నమ్మకం కుదిరాక ఇహ పాపారావుకి ఒళ్ళు తెలీలేదు.

"ఆ బాటిల్స్ ఎక్కడి వనుకున్నావే? నిఖార్సయిన ఫారిన్ సరుకది. ఎక్కడంటే అక్కడ దొరుకుతాయను కున్నావా? వాటి ఖరీ దెంతనుకొన్నావు? బాబూరావు ప్రత్యేకంగా నా కోసం తెప్పించి ఇచ్చాడు. వాటిని పారేస్తావా! నిన్ను...."

"ఎందుకు తెప్పించివ్వడు? ఆయన ఎవరి కొంపకో నిప్పెట్టాలని ప్లానేస్తే... దాన్ని అమలు జరపాల్సింది మీరేగదా! అందుకని బాగనే తెప్పించిస్తాడు. ఇద్దరికిద్దరే! ఈ వూరిని పట్టి పీడిస్తున్న పిశాచాలు..." అన్నది హరిణి.

ఆమె మాటలు... ఆ నిర్లక్ష్యం చూస్తుంటే మండిపోతోంది పాపారావుకు. హరిణిని చంపెయ్యా లన్నంత కసిగా ఉంది.

అసలే పాపారావు క్రూరుడు. తాగిన నిషాకి తోడు హరిణి నిర్లక్ష్యం అతన్నింకా రెచ్చగొడుతోంది.

ఆ రోజు దాక్షాయణి పారిపోవటానికి హరిణి సాయపడిందని... హరిణే ఆ పిల్లను ప్రణీత్ ఇంట్లో దాచిందనీ అతని కాపూటే తెలిసింది. హరిణి, పని పట్టాలని వీరావేశంతో ఇంటికొచ్చిన పాపారావును ఇంట్లో ఆమె ప్రవర్తన ఇంకా రెచ్చగొట్టింది. హరిణి ఇంతకు ముందెప్పుడూ అంత సాహసానికి పూనుకోలేదు. ఒక్కసారిగా ఆమెలో వచ్చిన ఈ తెగింపు అతనిలో వివేకాన్ని తట్టి లేపటానికిబదులు అహంభావాన్ని ఇంకారెచ్చగొట్టింది.

"అంత ఖరీదైన బాటిల్స్ పారేసినందుకు భయంతో ఒణికి చావక ఎదురు నీలుగుతున్నావా! పైగా.... పిల్లలతో సహా వెళ్ళిపోయి ఎవడింట్లోనో వంటకు కుదురుతానని బెదిరిస్తావా! ఎందుకే నీకా కష్టం? నేనే రోజుకు నలుగుర్ని పట్టుకొస్తాను. వాళ్ళతో నులుకు. నువ్వూ స్వతంత్రంగా డబ్బు సంపాయించుకోవచ్చు... నేనూ స్వతంత్రంగా తాగొచ్చు." వెటకారంగా అన్నాడు పాపారావు.

"నోరు సంబాళించుకుని మాట్లాడండి. భార్యను పట్టుకుని అలా అనటానికి సిగ్గులేదూ?" రోషంగా అన్నది హరిణి.

"నువ్వు పెళ్ళానివా! నీలో ఎక్కడయినా ఆ లక్షణాలున్నాయా? మొగుడకన్నా పరాయి మగాడెక్కువయ్యాడు నీకు. నీ వేషాలు నాకు తెలీవనుకోకు.

ఎవడింట్లో వంటకు చేరతావే?? ప్రణీత్‌గాడింట్లోనేనా?"

"అలాంటి వాళ్ళ ఇంట్లో వంట మనిషి కూడా గౌరవంగానే బ్రతక గలదు. అతన్నేదయినా అంటే... పురుగులు పడి చస్తారు. ఆడదాన్ని గౌరవించటం చేతగాని ప్రతి వెధవా అతన్ని ఆడి పోసుకునేవాడే...!" భర్త తనమీద అంతంత ఘోరమైన నిందలేసి... నలుగురితో పొమ్మని ఈసడించటం గంగ వెర్రు లెత్తిస్తోంది హరిణిని...

## ఒడిలో చెలి మోహన రాగం

"ఆ రోజు దాక్షాయణిని ప్రణీత్ గాడింటికి పంపింది నువ్వేనని తెలిసింది నాకు నువ్వు వాడితో రంకుతనం సాగిస్తూ వెరైటీగా ఉంటుందని దాన్నికూడా వాడికి తార్చావు రంకుముండా! నీ వేషాలు నా దగ్గరా.' అంటూ హరిణిమీద కొచ్చాడు పాపారావు

ఉక్రోషం . కోపం.. దుఃఖం ఒక్కసారిగా చుట్టు ముట్టాయామెను భరించలేని ఆవేశంతో పాపారావు జుట్టు పట్టుకు ఒంచి, దవడపగిలేలా, లాగి రెండంటించింది హరిణి ఉద్రేకంతో రొప్పుతోందామె .

దిమ్మెర పోయాడు పాపారావు

తన పెళ్ళాం తనను కొట్టింది! ఆ ప్రణీత్‌గాడి అండ చూసుకునే దీని కింత ధైర్యం ఒచ్చింది దీన్నిలా చెలరేగనివ్వకూడదు చెప్పుకింద తేల్లా గాసి పారెయ్యాలి

ఆ క్షణంలో మృగంలా మారాడు పాపారావు అతని దృష్టి తలుపుకు అడ్డంగాపెట్టటం కోసం మూలఉంచిన రోకలిమీద పడింది

ఏం జరుగుతోందో తెలుసుకునే వ్యవధి కూడా హరిణికి దొరక లేదు పాపారావు చేతిలో ఉన్న రోకలి మెరుపులా ఆమె మాడును తాకింది కుప్పగా కూలి పోయింది హరిణి ఒంగి ఆమె ముక్కుదగ్గర వేలు పెట్టాడతను శ్వాస ఆడటం లేదు ముచ్చెమటలు పోశాయి పాపారావుకి మత్తు సగం దిగినట్లయింది

ఆమె చనిపోయిందనే దుఃఖం కన్నా తానీ గండాన్ని ఎలా దాటాలన్న తపనే అతనిలో ఎక్కువవుతోంది

'అమ్మా. అమ్మా .." అని ఏడుస్తూన్న పిల్లల్ని ఈడ్చుకెళ్ళి ఒక గదిలో పారేసి బయటకొచ్చి తలుపు తాళం వేసి, సైకి లేసుకుని రివ్వున బయట కెళ్ళాడు పాపారావు

పైడిపల్లె మంచి నిద్రలో నిశ్శబ్దంగా లీనమయిన వేళ పాపారావు సైకిలు రంగనాథం ఇంటివేపు దూసుకు పోతోంది రంగనాథం లాయరు పాపారావు వర్గానికి చెందినవాడు లాయరు వృత్తికే కళంకం తెచ్చే క్షుద్రమైన మనస్తత్వం కలవాడు డబ్బు కోసం, ఏ గడ్డి కరవమన్నా సిద్ధమే!

దబదబా వాకిటి తలుపులు బాదుతున్న శబ్దానికి కళ్ళు తెరిచి వాచీవేపు చూశాడు రంగనాథం

రెండు ముళ్ళూ పన్నెండు దగ్గర కలుసుకుని విడిపోతున్నాయి రంగనాథం కనుబొమలు ముడిపడ్డాయి

'కొంపతీసి దొంగలు కాదుగదా?" అనుకుంటూ జాగ్రత్తగా చెవి ఒగ్గి విన్నాడు తలుపులు కొట్టటంలో భయం . ఆతృత స్పష్టంగా తెలుస్తోంది

దొంగలు కాదు ఏ ఖూనీ కేసు బాపతో అయిఉంటుంది

"ఎవరూ" అన్నాడు లేచి తలుపుదగ్గర కొచ్చి

'తొందరగా తలుపు తియ్యి ' అది పాపారావు కంఠం

కుతూహలం, సంతోషం పెనవేసుకున్నాయి రంగనాథంలో

కేసేమిటి అనేది కుతూహలమైతే . వచ్చింది పాపారావు గనక డబ్బు దండిగా ముడుతుందనేది సంతోషం

గతంలో పాపారావుకు సంబంధించిన కేసులెన్నో పరిష్కరించి డబ్బు చేసుకున్నాడు రంగనాథం

తన వాదనా పటిమతో ఎదురుగా ఉన్నది తెల్లటి నంది అయినా అది నల్లటి పంది అని ఒప్పించగలడు రంగనాథం తన మేధాశక్తిని ఎప్పుడూ అన్యాయాన్ని నెగ్గించటానికే ఉపయోగిస్తూ ఉంటాడు

ఈ రోజుల్లో డబ్బే అన్నిటికన్నా ప్రదానం దానిముందు అన్నీ బలాదూరే నేనొక్కడిని మడి గట్టుకు కూర్చున్నంత మాత్రాన ఈ న్యాయ వ్యవస్థ బాగుపడుతుందా? ఈ కేసు నేనొదిలేస్తే ఇంకోరు టేకప్ చెయ్యరా?' అని తనకు తనే సర్ది చెప్పుకుంటూ ఉంటాడు.

సాధారణంగా అతను పట్టిన కేసు ఓడిపోవటమంటూ జరగదు

నేరస్థుడికి అతను మిత్రుడు నిర్దోషికి అతను శత్రువు తలుపు తీసి, 'ఏమిటింత అర్ధరాత్రి వచ్చారు? ముందిలా వచ్చి కూర్చోండి ఎందుకంతలా ఒణికి పోతున్నారు?" అంటూ పాపారావు నాహ్వానించాడు రంగనాథం

లోపలికొచ్చి, జరిగిందంతా చెప్పి, "అది చచ్చి పోయింది నేను చంపాలను కోలేదు. ఎప్పటిలాగే కొట్టాను మొదటి దెబ్బకే చచ్చూరుకుంది ఇప్పుడు నేనేం చెయ్యాలి?" అన్నాడు పాపారావు

'ఈ సంగతెవరికయినా తెలుసా? ఆమె పెట్టిన కేక లెవరయినా వినే అవకాశముందా?' నిదానంగా సిగరెట్టు తీసి వెలిగించుకుంటూ, ఇంకో సిగరెట్టు పాపారావుకు ఆఫర్ చేసి అన్నాడు రంగనాథం

ఒళ్ళంతా చెమటలు పదుతున్నాయి పాపారావుకి

అంతవరకూ హత్యలు చేయించటమేగానీ స్వయంగా చేసి ఎరుగడు.

"ముందు మీరలా భయపడటం తడబడటం మానెయ్యండి ఇది చాలా ముఖ్యం. నేను అడిగిందానికి సమాధానం చెప్పండి." అనునయంగా అన్నాడు రంగనాథం.

"పిల్లలు చూశారు చుట్టూరా పెద్ద వాకిలి ఉండటం, రాత్రి సమయం కావటం పెద్దగా అరవకుండా ఒక్క దెబ్బకే అది కూలిపోవటంతో ఇరుక్కు

## గడుసులోకం —బాబు






When it comes to choosing an iron – they all speak the same language·

# Vijay

# விஜய் വിജയ്

# విజయ్ ವಿಜಯ್

# विजय

## VA-52

## The iron that everybody prefers.






a friend of your family



**Associated Marketing Agencies**
Madras ● Bangalore ● Hyderabad ● Ernakulam

# ఒడిలో చలి మోహన రాగం

పొరుక్కు ఇదంతా తెలిసే అవకాశం లేదు." అన్నాడు పాపారావు.

"ఇది హత్య. అలా అని ప్రత్యక్షంగా తెలిసి పోతోంది. దీన్ని మనం ఆత్మహత్యగా నిరూపించాలి."

"అలా ఎలా కుదురుతుంది?" ఆత్రంగా అన్నాడు పాపారావు.

"దానంతటది కుదరదు. మనమే... కుదిరేలా చెయ్యాలి." అన్నాడు రంగనాథం.

"అదే, ఎలా?"

"పోలీసులకు డబ్బుపడేసి, ముందుగా వాళ్ళ నోళ్ళు మూయించాలి..."

"ఆ ప్రణీత్‌గాడు రేచుకుక్క లాంటివాడు. ఇలాంటివి సాగనివ్వడు. వాడితో రాయబారం నడపటమంటే... మన మెడకు మనమే ఉరి తగిలించుకున్నట్లు."

"వాడుకాకపోతే.. వాడి పై అధికారులు లేరా?? బాబూరావుగారు ఉండనే ఉన్నారు గదా. అంతగా వ్యవహారం బెడిసికొడితే ఆయన చూసుకుంటారు.

మీరిప్పుడు ఇంటి కెళ్ళండి: ఆవిడ శవాన్ని వంట గది వరండాలోకి తీసికెళ్ళి మీద కిరసనాయిలు పోసి, అంటించెయ్యండి. స్టౌమీద కాఫీ పెడుతుంటే పొరపాటున చీర చెంగు అంటుకుందని, ఆమె కేకలకు మెలకువ వచ్చి మీరు అక్కడికి పరుగెట్టేసరికే అంతా అయిపోయిందనీ బావురుమనండి. అందుకు అనుగుణంగా స్టౌ వగైరా సరంజామా అంతా అక్కడ సర్దండి.

ఈ కార్యక్రమం తెల్లవారు జామున మొదలెట్టండి. లేకుంటే... అర్ధరాత్రి కాఫీ ఏమిటని అనుమానం రావచ్చు...."

"మరి... పోస్ట్‌మార్టం జరిపినప్పుడు డాక్టర్...."

"డాక్టరా పాడా! ఆ మాత్రం మన కనుకూలంగా సర్టిఫికెట్ తెచ్చుకోలేమా? అరు కూడా సామాన్యుల్లా మాట్లాడతా రేమిటి? ఇంతక్రితం ఎంతమందిని లాంటి కేసుల్లో నుంచి మనం తప్పించ లేదు?"

"పోనీ! ఓ పని చేస్తే?"

"ఏమిటది?"

"శవాన్ని తీసికెళ్ళి చెరువులో పారేసి, గట్టుమీద బిందె పెట్టి, కాలు జారి డిందని ప్రచారం చేస్తే?"

"ఒద్దు. ఆవిడకి తెల్లవారు జామున నీళ్ళకెళ్ళే అలవాటు లేదు. ఒంటరిగా డవాళ్ళు ఆ టైంలో అక్కడి కెళ్ళరు. అందరూ వెళ్ళే టైంలో అయితే... అప్పుడక్కడ మనుషులు తిరుగు తుంటారు. ఇదంత మంచి పద్ధతి కాదు. నేను చెప్పినట్లు ఇంట్లోనే పని పూర్తి కానివ్వండి మీరు."

"సరే! కానీ.... నాకు భయంగా ఉంది. నువ్వు తోడు రాకూడదూ?"

"ఇంకానయం. నేనాటైంలో అక్కడెందు కున్నాను? ఏనాడూ అలవాటు లేని నేను ఆ రాత్రి మీ ఇంట్లో ఎందుకున్నాను? అనే అనుమానం అందరికీ వస్తుంది. పోనీ... కేకలు విని వచ్చానా అంటే... మీ ఇంటికీ మా ఇంటికీ చాలా దూరం. ఇదంతా అసహజంగా ఉంటుంది. అసలు మీకు నేనిలాంటి సలహా ఇవ్వటమే నేరం."

"నీ కష్టం నేను ఉంచుకోను. ఎంత డబ్బయినా ఇస్తాను."

"ఉంచుకోరని నాకు తెలుసు. నేను రావటం నాకే కాదు మీకే మంచిది కాదు. అయినా... చచ్చిన శవం మీద కిరసనాయిలేసి అంటించటానికంత భయ మెందుకు? అదేమన్నా బ్రతికున్న మనిషా? అనవసరంగా భయపడి రసాభాస చెయ్యకండి." అని నచ్చ చెప్పాడు రంగనాథం.

పాపారావు తిరిగి ఇంటికి బయల్దేరాడు...

రంగనాథానికి గొప్ప ఎగ్జయిటింగ్‌గా ఉంది. కనీసం... యాభైవేలు లాగొచ్చు. ఇంతకన్నా ఆసక్తి కరమైన విషయ మేమిటంటే.. ఇహ ఎప్పటికీ ఈ పాపారావు తనకు భయపడుతునే ఉంటాడు.

అయితే తనంత నమ్మకద్రోహి కాదు. తన డబ్బు తనకు చేరిన మరుక్షణం ఇహ ఈ విషయం మర్చిపోతాడు. తడవ తడవకీ బ్లాక్‌మెయిల్ చెయ్యడు.. దుప్పటిలాగి కప్పుకుని, తెల్లారటం కోసం ఎదురు చూస్తూ పడుకున్నాడు రంగనాథం.

తాళం తీసి, లోపలికెళ్ళి తలుపు గడియ వేసుకున్నాడు పాపారావు.

ఏడ్చి ఏడ్చి భయంతో ఒకరి నొకరు కావలించుకుని ఓ మూల పడున్నారు పిల్లలు.

నాలుగు గంటల వరకూ భార్య శవం ముందు దెయ్యంలా కూర్చున్నాడు పాపారావు...

ఇన్నాళ్ళు తనతో కాపురం చేసిన మనిషి... తన బిడ్డలకు తల్లి... తన అధికారానికి కేంద్రబిందువయిన భార్య చనిపోతే దుఃఖించి పశ్చాత్తాప పడాల్సింది పోయి, "నేను చంపాలని చంపానా? రోజూలాగే రెండు తన్నాను. అంతలోకే అది చస్తుందని నాకేం తెలుసు? ఇంతకూ దాని చావిలా రాసి పెట్టి ఉంది..." అని ఆత్మవంచన చేసుకుంటున్నాడు పాపారావు.

ఈ దేశంలో ఇలాంటి నర రూప రాక్షసులు కోకొల్లలు.

నాలుగు గంటలకు హరిణి శవాన్ని వంట గది వసారాలోకి తీసి కెళ్ళాడు పాపారావు. ఆ వరండాలోనే ఉదయంపూట కాఫీ పెడుతుంది హరిణి...

కిరసనాయిల్ డబ్బా తెచ్చి ఆమె మీద చల్లి నిప్పంటించాడు పాపారావు... ఆమెలో ఎక్కడో ఓ చిన్న కదలిక ఆ వేడితో మేల్కొంది.

ఊహించని విధంగా... కెవ్వున కేక పెట్టింది హరిణి. తాగిన మైకంలో... కొన ఊపిరితో స్పృహతప్పిఉన్న భార్యను చూసి ఖంగారుపడి ఆమె చనిపోయిందను కున్నాడు పాపారావు.

తల్లికేక విని ఉలిక్కిపడి లేచారు పిల్లలు. పెద్ద పిల్లాడు గదిలో నుంచి "అమ్మా" అంటూ దొడ్లోకి ఉరికాడు. వాడిపేరు గోపీ.

ఈపరిణామానికి అదిరిపోయాడు పాపారావు. తను ఆమెను చంపబోయాడని ఆమె ఎవరికయినా చెపుతుందేమో... తను జైలుపాలవాలిసొస్తుందనే భయం అతన్ని నిలవ నివ్వలేదు... అక్కడున్న పచ్చడి బండ తీసుకుని దబదబా ఆమె నెత్తిమీద ఖంగారుగా బాదేశాడు పాపారావు. ఆమె చనిపోయిందనే నమ్మకం కలిగేవరకూ పిచ్చెక్కిన వాడిలా అలా బాదుతునే ఉన్నాడు. హరిణి శాశ్వతంగా ఈ లోకం నుంచి నిష్క్రమించింది... ఒంటి నుంచి ధారాపాతంగా కారుతున్న చెమటను తుడుచుకుంటున్న పాపారావు పచ్చి నెత్తురు తాగే రాక్షసుడిలా ఉన్నాడు. మంటలలో ఆర్తనాదం చేస్తూ నిలువునా కాలిపోతున్న తల్లిని... శివమెత్తిన వాడిలా కర్రతో బాదుతున్న తండ్రినీ భయ విహ్వలులై చూశారు పిల్లలు...

(ఇంకాఉంది)

ఈ మధ్య ఆంధ్ర ఫిలిం సొసైటీ వారు (ఢిల్లీ) నిర్వహించిన నాటకోత్సవాలలో, ఆంధ్ర వనితా మండలివారిచే ప్రదర్శించబడిన "ఇంట్లో పోరు- వీధిలో హోరు" నే నాటికలో శ్రీమతి భారతీరావు, కుమారి సుమణి, కుమారి హైమా గోపాలరావు పాల్గొన్న ఒక దృశ్యం



వేసే వుంటుంది ఇంక ఎత్తడం- వెయ్యడం ప్రాబ్లమ్ వుంతదుగదా?' అంటుంది స్మిత

తర్వాత- ఇది ఇంగ్లండు కాదు మనం ఎప్పుడూ ఒకచోటే పడుకోవాలి చలిగా వుంటే లోపల- కాస్త గాలి కావాలనుకుంటే వరండాలోనూ- ఎండాకాలం ఆరు బయట పడుకుంటాము పక్కలు వేసుకోవాలి- మళ్ళీ తీసుకోవాలి - అంటుంది బామ్మగారు

ఇంకోపని ఇల్లు వూడవడం- గదులు వూడవడమంటే స్మితకి మరీ చిరాకుట మూల మూలలా ప్రతి రోజూ వంగి మరీ వూడవాలి!

అసలు మమ్మీ క్లీనింగు వారానికోసారి చేస్తుంది- అక్కడ కార్పెట్లమీద వాక్యూమ్ క్లీనింగ్‌తో అసలు పని చేస్తున్నట్లే వుండదు అసలక్కడ దుమ్మే వుండదు తుడిచిన వస్తువులు ఎన్నాళ్ళయినా తుడిచినట్లే వుంటాయి ఇక్కడో ? రెండు పూటలా నడుములు విరిగేటట్లు వూడిచినా- దుమ్మూ- ధూళీ- చెత్తా- వూడిచిన కొద్దీ వస్తూ వుంటాయి! ఏం కంట్రీనో -

ఇల్లు వూడిస్తే చాలదు వారానికోసారి నీళ్ళు పోసి కడగాలి దేవుడి దయవల్ల ఆ పని పనిమనిషి చేస్తుందిలే- లేకపోతే నా పని అయిపోయేది '

ఒకసారి పనిమనిషి రాలేదు ఆ రోజు చూడాలి ఆంటీ నా పని బామ్మ నాకారోజు గిన్నెలు కడిగే పని ఇచ్చింది అబ్బ అదెంత న్యూసెన్సనీ? ఇంగ్లండు లోనూ నేను కడిగేదాన్ని కదా? అదెంత సులువనీ- హాయిగా వాషింగ్ సోప్‌తో- గాజు సామాన్లు వంటింటి సింక్‌లోనే కడిగే వాళ్ళం పది నిమిషాల్లో పనయిపోయేది ఇక్కడ- అసలు నీటి కరువు- సింక్‌లు లేనే లేవు. పైగా బయట- పడేసుకుని కూర్చుని- మట్టీ- కొబ్బరి పీచూ- బూడిదా- వీటితో రుద్దాలి అవి వదలవు- జిడ్డు- చేతులు బొబ్బలెత్తాయనుకోండి!"

అట్లాగే గుడ్డలూను- వాషింగ్ మెషీన్‌లో ఎంత బాగా వస్తాయో గుడ్డలక్కడ ఇక్కడ సబ్బులూ అంటే- సబ్బు పట్టిస్తే వదలడానికి నీళ్ళుండవు గదా? పైగా బండ కేసి బాదాలి నిజంగా ఆంటీ పనిమనిషి వుంది కాబట్టి గానీ- లేకపోతేనా- ఈ దేశంలో వుండడం- చాలా కష్టం ఆంటీ-! పైగా బామ్మంటుంది- 'అన్ని పనులూ వచ్చి వుండాలే- రేపు నీ పెళ్ళయ్యాక- ఇవన్నీ అత్తగారింట్లో చెయ్యాల్సి వస్తుంది- అని!'

'ఇంక వంట- గ్రైండరూ- కుక్కరూ- అన్నీ వున్నాయి యింట్లో- కానీ బామ్మ నన్ను- గిన్నెల్లోనే అన్నం పప్పు- వండమంటుంది పచ్చళ్ళు- రోట్లోనే చెయ్యాలి పప్పు రుబ్బాలి- కొన్ని ఏవేవో దంచమంటుంది- విసర మంటుంది- చెరగ మంటుంది- అన్నీ వచ్చి వుండాలిట!-

నవ్వుతూ వింటూండి పోయాను- నేను

ఇంకోటి చెప్పింది స్మిత- "మొగవాళ్ళెవరన్నా వస్తే- లేచి లోపలికి రావాలి ఎంతో అవసరమైతే తప్ప మాట్లాడ కూడదట"-

అక్కడలాగా చెట్టాపట్టా లేసుకుని అసలు తిరగ గూడదు- కబుర్లు- నవ్వులు- ఎక్కువ వుండకూడదు '

పెళ్ళి చూపుల తతంగం ఏకరువు పెడుతుంటే నాక్కూడా చాలా జాలేసింది స్మితని చూస్తే- నా మనసులో ఏవేవో ఆలోచనలు"

★ ★ ★ ★

రామం '- పిలిచాను నేను

'ఏమిటమ్మా - వచ్చాడు వాడు

చక్కటి శరీరచ్ఛాయ- రూపు రేఖలు- ముమ్మూర్తులా తండ్రిని పోలిన- నా కొడుకు రామం అందగాడు- అంతే కాదు- బుద్ధిమంతుడు కూడా ఇప్పటికీ మా మాట జవదాటడు వాళ్ళ నాన్నగానీ- నేనుగానీ- ఈ పని చెయ్యాలీ"- అంటే కాదనడు- సాధారణంగా అట్లాగని మేమూ పిల్లల్ని కట్టడిలో పెట్టేవాళ్ళమూ కాదు మెడిసిన్ పాసయి- ఎమ్ డి అయ్యాక- పల్లెటూళ్ళో ప్రాక్టీసు పెట్టాలని మావాడి నిశ్చయం అందుకు



కావల్సినవి అమర్చుకోవడంలో మునిగి వున్నాడు- వాడు.

"కూచో రామం"- కూచున్నాడు.

నా మనసులోని ఆలోచనలు వాడికి తెలియ పరచాను.

విని ఆశ్చర్య పోయాడు- వాడు.

"అమ్మా.. అదెట్లా కుదురుతుందమ్మా? నా కసలు ఇప్పుడే పెళ్ళిమీద ఆసక్తి లేదు ఒకవేళ చేసుకున్నా- నా అభిరుచులు- ఆదర్శాలూ వేరు. వాటికి తగ్గ అమ్మాయి దొరకాలి. నేను పల్లెటూళ్లో ప్రాక్టీసు పెట్టాలను కుంటున్నాను. అనుకోడమే కాదు- అక్కడే స్థిరపడతానేమో కూడా! మరొక డాక్టరయితే- ఇద్దరం అర్థం చేసుకోడానికి వీలుంటుందేమో! సిటీ లైఫ్‌కి అలవాటు పడ్డ మామూలు వాళ్లకే పల్లెల్లో వుండడం కష్టమను కుంటారు- ఇక ఫారిన్లో పుట్టి- పెరిగి- కనీసం గ్రాడ్యుయేటన్నా కాని- ఈ అమ్మాయి- లాభం లేదమ్మా- నేను అవుననలేనేమో."

నేనాలోచనలో పడిపోయాను

"అమ్మా- నిన్ను కష్టపెట్టాను మన్నించమ్మా"-

"కాదురా- రామం- కల్పన నా స్నేహితురాలు ఈ విధంగా కల్పన మనోవేదన తగ్గించగలనేమో ననుకున్నాను. అంత మాత్రాన నిన్ను బలవంత పెట్టను"

"కాదమ్మా... నువ్వో ఆలోచించు- తను ఆ దేశం నించి వచ్చి ఇక్కడ అడ్జస్టు అవడానికే

# కవిసమ్మేళనం

విభిన్న స్వరాలు వినిపిస్తుంటే
మాటల అట్టహాసం కనిపిస్తుంటే
భావ విహంగం కునుకు తీస్తుంటే
లేనిపోని ఆవేశం పరుగులుతీస్తుంటే
తెలుసుకున్నాను
కవిసమ్మేళనం జరుగుతోందని.

- చల్లా రాధాకృష్ణశర్మ

# స్థానభ్రంశం

కష్టపడుతోంది ఇంక మిగిలినవన్నీ అర్థం చేసుకోడానికి ఎంత కాలం పడుతుందో- ఎంత కష్టపడాలో తను"-

"రామం- నువ్వన్నవన్నీ నిజమేరా.. మనమే నెమ్మదిగా ఆ అమ్మాయికి చేయూతనిచ్చి- మన పంథాలోకి తెచ్చుకోవచ్చు గదా? డాక్టరు గాకపోయినా- నర్సుగా నయినా నీకు ఆ అమ్మాయి సహాయ పడగలదేమో! ఆ దేశాల్లో పెరిగిన తీరు వల్ల అట్లా వుంది- గానీ తొందర్లోనే అన్నీ అడ్జస్టు చేసుకుని మన్తో కలిసి పోగలదని నాకు నమ్మకం నువ్వు సరేనంటే ఒక పని చేద్దాం. ఆ అమ్మాయిని కొన్నాళ్లు మనింట్లో వుంచుకుందాం ఆ తరువాత మిగిలినవి ఆలోచిద్దాం- సరేనా?"-

"సరే- నేనూ ఆ అమ్మాయినంతగా స్టడీ చెయ్యలేదేమో- నీ మాటెందుకు కాదనాలి?"-

లేచాడు రామం

* * * *

అప్పటికి వారం రోజులు గడిచాయి స్మిత మా ఇంట్లో వుంది-

ఒక్కొక్క రోజుకీ నాకు ఆశ సన్నగిల్లి పోతోంది

నా ఎదురుగానే- మాటల సందర్భంలో- నర్సు ట్రైనింగ్ గురించి ప్రసక్తి ఎత్తాడు రామం

నాకు డాక్టర్లన్నా- నర్సులన్నా తగని ఎలర్జీ- మరీ నర్సులంటే- ఛీ అదేం జాబు? నానారోగుల్నీ ముట్టుకోవాలి నానా రకాల సేవలూ చెయ్యాలి అందులో మన దేశంలో మరీను ఆస్పత్రులు ఘోరం- అక్కడ నర్సుగా పని చెయ్యడం కంటే ఘోరాపరాదం మరోటి లేదు నాకు టైపిస్టుగా- రిసెప్షనిస్టుగా- వుండటం- లేదా సేల్స్ గరల్స్- అట్లాంటి జాబులంటే ఇష్టం

ఆ జవాబు విని- రామం ఏమోగాని- నేను నీరుగారి పోయాను

ఒకరోజు వాళ్లిద్దరే పిక్నిక్‌కి వెళ్లినట్లుగా- రామం ప్రాక్టీసు పెట్టబోయే పల్లెటూరికి వెళ్లారు

అది చాలా వెనకబడిన పల్లెటూరు. నీళ్ళూ- కరెంట్‌లు అంతంత మాత్రమే. అసలక్కడ ఆస్పత్రులే లేవు. మా వాడు పెట్టబోయేదే మొదలు.

వాళ్ళు వెళ్ళంగానే వర్షం పట్టుకుందా రోజు. వచ్చినప్పటినించీ ఆ వూరినే విమర్శించడం మొదలు పెట్టింది స్మిత.

"అబ్బబ్బ- ఆ వూళ్ళో జనం ఎట్లా వుంటారో గదా? అసలది ఊరా? మురికి గుంట అంటే బావుంటుంది. వాళ్ళు మనుషులా జంతువు లనాలి. నల్లగా కొరువుల్లాగా- కళాకాంతులు లేక- శుచీ శుభ్రతాలేక- అంతకంటే నరకం వేరే లేదు. సరయిన బాత్‌రూమ్‌లు లేనిచోట అసలు మనం వుండలేము. నీళ్ళు లేవు- కరెంట్ లేదు- రొచ్చు- బురద- పేడ- అక్కడ జనం బ్రతికుండడమే ఆశ్చర్యం!"-

నాకే చికాకనిపించింది. ఇంక రామం వైపు చూడలేక పోయాను.

ఫారిన్లోని పల్లెటూళ్ళలో- మన పల్లెల్ని పోల్చసాగింది.

"వాళ్ళది చిన్న దేశం- జనాభా తక్కువ. మనది పెద్ద దేశం- అధికజనాభా- మన సమస్యలు మనవి. వాళ్ళ సమస్యలు వాళ్ళవి. అయినా పోల్చడానికి తనెవరు? అసలు పోలికెందుకు? మన దేశపు ఔన్నత్యం మనది. దేశం ఎట్లావున్నా- వూరు ఎట్లాంటిదైనా- మన దేశపు అతిథి మర్యాద- ఆత్మీయత- ఆప్యాయతలు ఎక్కడున్నాయి? ఎక్కడ దొరుకుతాయి? వాటి కేవి సాటి? ఇవన్నీ ఆ అమ్మాయి కెట్లా తెలుస్తాయి? ఎవరు చెప్తారు? ఎన్నని చెప్తారు?

మౌనంగా వుండి పోయాను.

మామూలుగా జరిగే మాటల్లో ఎక్కువగా డేటింగ్‌లూ- బాయ్ ఫ్రెండ్స్‌ల గురించి దొర్లేవి. నాకు కాస్త ఇబ్బందిగా వుండేది. పైగా ఇక్కడి పెళ్ళిళ్ళ గురించి- తేలిగ్గా మాట్లాడేది. ఇక్కడ పెళ్ళయ్యాక- ఇష్టం లేకపోయినా కలిసి వుండాలిట. అక్కడయితే వెంటనే విడిపోవచ్చుట! ఒక స్నేజయ్యాక ఆమెతో వాదించడం కూడా కష్టమని పించేది.

మరో వారానికి స్మిత వెళ్ళి పోయింది, వాళ్ళ బామ్మ గారింటికి. ఆ తరువాత నేనూ రామంతో ఏ మాటా కదపలేదు. వాడూ నాతో ఏమీ మాట్లాడ లేదు.

ఇంకో రెండు నెల్ల తరువాత- ఒకరోజు స్మిత మా ఇంటికి వచ్చింది.

"రా స్మితా...." ఆప్యాయంగా పిల్చాను. స్మిత చాలా సంతోషంగా వుందారోజు. ఇంకో విశేషం- ఇన్నాళ్ళూ కష్టపడి మెయిన్‌టెయిన్ చేసిన కట్టూ- బొట్టూలో కొట్టొచ్చిన మార్పు కనబడింది. ఈ స్మిత ఇంగ్లీషు పిల్లే ననిపించింది.

"ఆంటీ- అయామ్ సో హాపీ.... సో వెరీ హాపీ.... ఎందుకో తెలుసా? అయామ్ గోయింగ్ బాక్ టు ఇంగ్లండ్ పర్మనెంట్లీ"- నన్ను కావలించుకుంది. నేను ప్రశ్నార్థకంగా చూశాను. "అమ్మే రమ్మంది ఆంటీ- వచ్చెయ్యమంది"- కాసేపు కూచున్నాక- "థాంక్సలాట్ ఆంటీ- నాస్నేలో మధుర క్షణాలు- మీ

# ఇ·వేమన·పద్యాలు








రవిగననిది కవి యెఱుగును
కవి యెఱుగనిచోటు రవియు గానడు ధరలో
రవికన్న మిగుల నెక్కువ
కవియే విలసిల్లు నీవు గానవ వేమ.

ఇంట్లో వున్న రోజులే"- అంది వెళ్తూ.

ఆ తరువాత రోజే ప్రయాణం- నా ఆలోచనలలో నేనున్నాను- అప్పుడన్నాడు రామం- "అమ్మా- ఒకరకంగా ఇదే మంచిది. ఉత్తర ధృవం- దక్షిణ ధృవం లాంటి మేము ఇప్పుడు ఒకటయినా- తరువాత అభిప్రాయ భేధాల్తో బాధపడవచ్చు- అప్పుడు వేరయే దానికన్నా- ఇప్పుడు కలవక పోవడం మంచిది- ఏమంటావు?"-

ఎంత విజ్ఞానితా మాట్లాడాడు? వాడివైపు విస్ఫారిత నేత్రాలతో చూశాను.

ఆ రోజే కల్పన దగ్గిర్నించి ఉత్తరం వచ్చింది....

"నేన్నెన్నో అనుకున్నాను. కానీ- స్మిత ఉత్తరాలు అన్నీ తారుమారు చేశాయి. స్మిత అక్కడి పరిస్థితులకి అడ్జస్టు కాలేకపోతోంది. పెళ్ళయితే అక్కడింకా కష్టపడుతుందే తప్ప సుఖపడలేదేమో ననిపిస్తోంది. ఏమయినా మన రోజులు వేరు- మన తీరులు వేరు. మారుతున్న కాలంతో మనమూ మారాలి. అందుకే స్మితని వచ్చెయ్య మన్నాను. అదిక్కడ పెరిగిన పిల్ల- ఇక్కడ పెరిగిన అమ్మాయితోనే పెళ్ళయితే మంచిదని పిస్తోంది. నువ్వే మంటావు?"-

"అవును. అదే మంచిది"- అనుకున్నాను- నేను!

## వ్యక్తిగతం





జాతి గర్వించదగ్గ శాస్త్రవేత్త డాక్టర్ పోత రాజు కృష్ణారావు అమెరికాలో ప్రతిష్ఠాకరమైన ఉన్నత స్థానాన్ని అధిరోహించారు ప్రపంచ వాతావరణ శాస్త్ర రంగంలో ఆయన స్వీకరించిన పదవి మకుటాయమానమైనది. యు. ఎస్. నేషనల్ ఎన్విరాన్ మెంటల్ డాటా అండ్ ఇన్‌ఫర్మేషన్ సర్వీస్‌కు చెందిన పరిశోధన, అన్వయ కార్యాలయానికి ఆయన కార్యవాహక డైరెక్టర్‌గా నియమితులయ్యారు ఈ కార్యాలయం అమెరికా వైమానిక, నౌకా దళాల అధికారులకు, జాతీయ వాతావరణ శాఖ అధికారులకు శిక్షణ ఇస్తుంది. వాతావరణ పరిశోధక ఉపగ్రహాల నుంచి సమాచారం ఆయన కార్యాలయానికి అందుతుంది. డా. కృష్ణారావు 1952లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి భూ భౌతిక శాస్త్రంలో పట్టా పొందారు 1956లో అమెరికాలోని ఫ్లారిడా స్టేట్ యూనివర్సిటీ నుంచి వాతావరణ శాస్త్రంలో మాస్టర్స్ డిగ్రీ పొందిన తర్వాత 1968లో అదే రంగంలో న్యూయార్క్ విశ్వవిద్యాలయం నుంచి పి. హెచ్ డి. పొందారు. ఆయన పెక్కు వైజ్ఞానిక పత్రాలు రచించారు. అమెరికన్ మెటియరాలజికల్ సొసైటీ ప్రచురించుచున్న విశిష్టమయిన వాతావరణ శాస్త్ర గ్రంథానికి ఆయన సంపాదకులుగా ఉన్నారు. అమెరికాకు చెందిన న్యూయార్క్ అకాడమీ ఆఫ్ సైన్సెస్, బ్రిటన్‌కు చెందిన రాయల్ మెటియరాలజికల్ సొసైటీ ఆయనను విశిష్ట సభ్యుడిగా గుర్తించాయి. ఆయన అమెరికన్ మెటియరాలజికల్ సొసైటీ సభ్యులుగా కూడా ఉన్నారు ఆయన శ్రీమతి రుక్మిణి శాంతి దళం వలంటీర్లకు ఒక సంవత్సరంపాటు తెలుగు బోధించారు. ప్రస్తుతం ఆమె సంఘసేవా కార్యకలాపాల్లో చురుగ్గా పాల్గొంటున్నారు వారు నివసించే మేరీలాండ్‌లో హిందూ దేవాలయ నిర్మాణం కోసం ఈ దంపతులు యథాశక్తి కృషి చేసారు. అమెరికాలో జరిగిన భారతీయ ఉత్సవాలకి కూడ వీరు సహాయం చేశారు ... 

# వారఫలం

6-2-1987 శుక్రవారం మొదలు
12-2-1987 గురువారం వరకు

★ **మేషం :** ఏదో విధంగా డబ్బుకు యిబ్బంది లేకుండా వారమంతా సాగిపోతుంది. చాలమందికి శుభప్రస్తావనలుంటాయి. ఉద్యోగంలో స్థిరం చిక్కక చాల మంది బాధపడుతారు. స్త్రీలకు : వృత్తి యందు వికాసం కనిపిస్తుంది

★ **వృషభం :** అనుకూల వార్తలు వింటారు ఆదాయమందు అభివృద్ధి చేకూరుతుంది. ఒకానొక విషయంలో నిజమ్మాడి నిష్ఠూరం తెచ్చుకొంటారు ఏమైనా 'సత్యమే పలకాలి' అని గ్రహిస్తారు. స్త్రీలకు : ఉద్యోగ సంబంధంగా చేసిన యత్నాలు ఫలిస్తాయి స్త్రీలకు నూత్న వస్తు సేకరణకు కూడా అవకాశం

★ **మిథునం :** అధిక వ్యయ సూచక దినాలు. పండుగలకనో, పబ్బాలకనో బాగా వ్యయం చేయవలసి రావచ్చు. విద్యాసంస్థలందు పని చేయు వారికి, వైద్య వృత్తి నవలంభించిన స్త్రీ పురుషాదులకు ఉత్తమ వారం స్త్రీలకు : స్థితి యందు పెంపు, గృహ నిర్మాణావకాశాలకు అస్కారమైన వారం

★ **కర్కాటకం :** ఇంట శుభం జరుగుతుంది. కొందరు యాత్రార్థం దూర ప్రాంతాలకు వెళ్ళగల పరిస్థితులుంటాయి. వృత్తిలో పెంపు చేకూరుతుంది. కొందరకు ఋణ వత్తిడి ఏర్పడవచ్చు. 'ఎందుకు చేసామా' ఈ ఋణం అని బాధపడుతారు స్త్రీలకు: నూతన వృత్తి నవలంభించు ఆలోచనలుంటాయి

★ **సింహం :** వ్యవహార రీత్యా యిది ఉత్తమ దినం. స్థిరాస్తిని అభివృద్ధి చేసికొను యత్నాలు జరుగుతాయి. గ్రామాంతర ప్రయాణాలు కొందరి విషయంలో చెప్పవచ్చు. ధనాదాయమున్నా, అంతకుమించి వ్యయం చేయవలసిన పరిస్థితులుంటాయి. అభివృద్ధికరమైన పనులుంటాయి, అందు స్త్రీలకు లాభదాయకావకాశాలుంటాయి.

★ **కన్య :** బంధువర్గం యింటికి రానున్నారు ఒకవేళ వారి రాక శుభకార్య నిమిత్తం కావచ్చు ఆనందంగా వారం గడచిపోతుంది. వింద వినోదాలతో కాలక్షేపం కొందరకు, పత్రికా గౌరవం కొందరకు, సభా గౌరవం కొందరకు చేకూరగల సమయం. స్త్రీలకు : గౌరవ ప్రతిపత్తి, రాజకీయంగా కొంత మేలు చేకూరగల వారంగా గ్రహించాలి.

★ **తుల :** విద్య విధానాన పెంపు గోరు వారికి, ఆటపాటలందు ప్రగతి ఆశించు వారికి, 'రేడియో' 'దూరదర్శను'లందు అవకాశాలు ఆశించు వారికి చక్కని అవకాశాలుంటాయి. స్త్రీలకు : కళారంగావకాశాలు లభ్యమవుతాయి

★ **వృశ్చికం :** ఏమంత ఉపకారం జరిగే సమయం గాదు. ఉద్యోగవృత్తులందు ప్రగతి చెప్పదగిన సమయం. దూర ప్రాంతాల నుండి బంధువులు రానున్నారు. గమనించండి. స్త్రీలకు : కళాసంబంధంగా కొన్ని , అవకాశాలు లభ్యమవుతాయి.

★ **ధనుస్సు :** ఇంట శుభ కార్య ప్రస్తావనలుంటాయి. పుణ్యకార్యాచరణమునకు అవకాశాలుంటాయి. అధికారం బాగా చూపించి, పని పాటల వారిని లాలించి పనులు సాంగం చేసికోండి. స్త్రీలకు : అప్రయత్న ధన లబ్ధి వృత్తి యందు వృద్ధి.

★ **మకరం :** శుభ కార్యాచరణమునకు మంచి బలం చేకూర్చగల సమయం అయిన వారి సంబంధమే నిశ్చితమవుతుంది. ప్రజారంగాన కూడ ప్రసిద్ధి ఏర్పడుటకు అవకాశమున్నది. ఏదైనా సమస్య పరిష్కారం కావాలంటే ఉత్తమ వారమని గ్రహించాలి. స్త్రీలకు : ఉద్యోగ రీత్యా పోయిన అవకాశాలు లభ్యమవుతాయి.

★ **కుంభం :** మీ వ్యాపారం యిటీవల దెబ్బతిన్నది గదా! ఈ వారం బాగా పుంజుకొనే అవకాశమున్నది. కళారంగాన సదవకాశాలు లభ్యమవుతాయి ఆదాయాన్ని గూర్చి ఏ విధమైన యిబ్బంది రాదు. స్త్రీలకు : నూతనోద్యోగ యత్నాలు చాల వరకు అనుకూలమే.

★ **మీనం :** చాల వారాలుగా ఏదో చేయాలని సంకల్పించారుగా! ఈ వారం నెరవేరుటకు, లాభదాయకమగుటకు ఆక్షేపణ లేదు, బంధు మిత్రులు యింటికి రావచ్చు. ఉద్యోగ రీత్యా పడిన బాధ చాలుననుకొంటారు. ఆలోచనారహితమైన పనులు కష్టదాయకాలు. స్త్రీలకు : నూతన మిత్ర సాంగత్యం వృత్తి యందు వృద్ధి, స్థితి యందు పెంపు.

-విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి



Nestlé
Nestum
baby cereal
Rice




(గత సంచిక తరువాయి)

"సుమతీ... సుమతీ"

"ఎవరూ?"

"నేను నర్మదను"

"నువ్వా వదినా రా కూర్చో. ఏమిటీవేళప్పుడొచ్చావు?"

"ఏమిటా? ఈ రోజు మీ అన్నయ్య వస్తున్నాడు కదా? స్టేషన్‌కు రావా?"

"ఓహో మా అన్నయ్య వస్తున్నాడన్న విషయం మా కన్నా నీకే బాగా గుర్తుందే. అయినా ఇక్కడిదాకా వచ్చినవాడు ఇంటిదాకా రాడా ఏమిటి?" అంది సుమతి.

"అలా కాదులే? పద స్టేషన్‌కు వెళదాం."

"అబ్బ ఈ ఎండలో నేను రాలేను బాబూ"

'ఎండా, గిండా నోర్మూసుకొని పద. కారు తెచ్చానులే'.

"కారు తెచ్చినా, విమానం తెచ్చినా నేను రానంటే రాను?"

"బాబ్బాబు నాకోసం రావే నీకు ఐస్‌క్రీం ఇప్పిస్తానుగా రావే"

'లంచమియ్యాలని చూస్తున్నావా' అన్నయ్యను రానీ లంచం ఇవ్వజూపిన నేరానికి నిన్ను అరెస్ట్ చేయిస్తాను'

చాల్లేవే బెట్టు చూపిస్తున్నావు నేను బ్రతిమలాడుతున్నాననేగా?

'చూడండి వదినగారూ ఆడబిడ్డ అర్ధమొగుడంటారు గుర్తుంచుకొని మసులుకో?

అర్ధ మొగుడుగారు మిమ్మల్ని బ్రతిమలాడుకొంటున్నాము మీరు స్టేషన్ దాకా తోడు రావాలి'

అయితే వస్తున్నాం పద'

నర్మద, సుమతి ఇద్దరూ కలిసి కారులో రైల్వే స్టేషన్‌కు వెళ్ళారు

* * * * * *

ట్రింగ్ ట్రింగ్ ఫోను మ్రోగింది

సలీమ్, జావేద్‌లు ఇద్దరే ఉన్నారు ఆ రూమ్‌లో అది వారిద్దరి పర్సనల్ రూమ్ వారి అనుమతిలేకుండా ఎవ్వరూ, చివరికి పురుగైనా రాలేదు ఆ రూమ్‌లోకి. అంత పటిష్టంగా నిర్మించబడింది ఆ గది

**జరిగిన కథ –3 :** సలీం, జావేద్ అనే ఆగంతకులు గణేశ్ ఇంట్లో జొరబడి ఆయనను చంపేస్తారు విజయ్‌కి ఎస్.ఐ ఉద్యోగం వచ్చి ట్రెయినింగ్‌కి వెళ్తాడు. విజయ్ తమ్ముడు రాజేష్ సహ విద్యార్థుల బలవంతం మీద కాలేజి ఎన్నికల్లో పేరు మోసిన రౌడీ రంగాపై పోటీకి నిలబడతాడు. ఎన్నికల ముందురోజు రాజేష్‌ను రంగా కొట్టిస్తాడు. రాజేష్ గెలుస్తాడు. సలీం, జావేద్‌లు ఆనంద్ అనే వజ్రాల స్మగ్లర్ వెంటబడి భంగపడతారు. విజయ్ తిరిగి వస్తున్నానని నర్మదకు తెలియజేస్తాడు. విజయ్‌కు ప్రమాదం జరిగినట్టు నర్మదకు పీడకల వస్తుంది.

గది మొత్తం ఏర్‌కండిషన్డ్ చేయబడి, సౌండ్ ప్రూఫ్ చేయబడింది.

సలీమ్, జావేద్‌లు అనవసరంగా బయట తిరగరు. ఏదైనా ముఖ్యమైన పనుండి బాస్ దగ్గర నుంచి ఆర్డర్స్ వస్తే తప్ప వారు బయటకు రారు. వారు రూమ్‌లో ఉండే అన్ని సౌకర్యాలు పొందేందుకు తగిన ఏర్పాట్లు చేశాడు బాస్.

ఫోన్ చేస్తే చాలు అన్నీ... అంటే మందూ.... మగువ వెంటనే లభ్యమవుతాయి వారికి.

ప్రస్తుతం...

రూమ్‌లో సలీమ్, జావేద్‌లు ఫుల్‌గా మందుకొట్టి ఉన్నారు. అప్పుడే వచ్చింది ఫోన్.

"హల్లో" అంటూ రిసీవరెత్తాడు సలీమ్.

"హల్లో సలీమ్."

"బాస్" అన్నాడు గొంతు గుర్తుపట్టి సలీమ్.

"యస్ బాస్‌నే మాట్లాడుతున్నాను. అర్జంటుగా మీరు డెన్‌కి రావాలి".

"ఐదు నిముషాల్లో వస్తాం బాస్" అన్నాడు సలీం రిసీవర్ క్రెడిల్ చేస్తూ.

"జావేద్ కమాన్" పిలిచాడు సలీమ్.

ఎందుకు, ఎక్కడికి అని అడిగే అలవాటులేదు జావేద్‌కి.

అనుసరించాడు సలీమ్‌ని జావేద్.

సలీమ్ గారేజ్‌లోంచి కారు డోరు తీసి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. జావేద్ అతని ప్రక్కనే కూర్చున్నాడు.

కారు బయలు దేరింది.

ఊరి చివర ఉన్న ఒక పాడుబడిన బిల్డింగ్ ముందు ఆగింది కారు.

ప్రక్కనే ఉన్న పొదల చాటున కారును ఆపి సలీమ్, జావేద్‌లు దిగారు.

ప్రక్కనే ఉన్న పాడుబడ్డ బిల్డింగ్ లోనికి నడిచారు వారిద్దరూ.

ఆ బిల్డింగ్ ఎప్పుడో దాదాపు కాకతీయుల కాలంనాడు నిర్మించబడింది. ప్రస్తుతం పాడుబడి పాములతో, తేళ్లతో నిండి, చెట్లు, పుట్టలు పెరిగి ఎవ్వరికీ నివాసయోగ్యం కానట్లుగా ఉంది.

సలీం నేరుగా ముందుకు వెళ్ళి గోడపై ఒకచోట ఉన్న బుడిపెను గట్టిగా నొక్కాడు

"సర్ర్" మంటూ గోడలో అంతర్గతంగా ఉన్న ద్వారం ప్రక్కకు జరిగింది.

సన్నగా ఒక మనిషి పట్టేంత ద్వారం ఏర్పడింది గోడలో.

ఆ దారి వెంట కరెక్ట్‌గా పది అడుగులు వేశారు సలీమ్, జావేద్‌లు

టక్కున ఒక చోట ఆగి క్రింద చేత్తో తడిమి పలక లాంటి దాన్ని ప్రక్కకు లాగాడు సలీమ్

క్రిందకు ఒక సొరంగం లాంటి మార్గం బయటపడింది అక్కడ.

క్రిందకు మెట్లు కనిపించాయి

ఆ మెట్ల వెంట క్రిందకు దిగారు సలీమ్, జావేద్‌లు

క్రింద విశాలమైన వరండా కన్పించింది

ఆ వరండా వెంట నడిచారు ఇద్దరూ.

కొంత దూరం వెళ్ళి వరండాలో కుడి వైపుకు తిరిగారు అక్కడ దాదాపు చాలా గదులు వరుసగా ఉన్నాయి

మూడో నంబర్ గది ముందు ఆగారు

కాలింగ్‌బెల్ ప్రెస్ చేశాడు సలీమ్.

వెంటనే తలుపు తెరుచుకొంది

ఇద్దరు వ్యక్తులు మెషిన్ గన్‌లు గురిపెట్టి నిలబడి ఉన్నారు.

"హేండ్సప్"

చేతులు పైకెత్తారు సలీమ్, జావేద్‌లు.

"మీ ఐడెంటిఫికేషన్ కార్డులివ్వండి."

సలీమ్ పాకెట్‌లో నుంచి తన ఐడెంటిఫికేషన్ కార్డు తీసిచ్చాడు.

చెక్‌చేసి తిరిగిచ్చాడు గార్డు

తర్వాత జావేద్ ఐడెంటిఫికేషన్ కార్డు కూడా చెక్ చేసి "నౌయువార్ వెల్‌కమ్" అన్నాడు గార్డు గన్ క్రిందకు దించుతూ.

"థాంక్యూ" అంటూ లోపలికి ప్రవేశించారు సలీమ్, జావేద్‌లు.

డెన్‌లో అంతా కట్టు దిట్టమైన ఏర్పాట్లు చేశాడు బాస్. తన మనుషులైనా

సరే అందర్ని చెక్‌చేసి పంపించాల్సిందే. ఎక్కడైనా పొరపాటు జరిగిందో, పొరపాటు చేసినవాడు మళ్ళీ సూర్యోదయాన్ని చూడలేడు.

రూమ్‌లో నికి వచ్చి ఎదురుగా ఉన్న ఒక స్విచ్ నొక్కాడు సలీం.

అక్కడున్న ద్వారం తెరచుకొంది.

ఎదురుగా. ..

విశాలమైన గది.

ఆ గదిలో దాదాపు నలభై కుర్చీలు వేసి ఉన్నాయి 4 వరుసలలో.

వాటికి ఎదురుగా ఒక డయాస్. ఆ డయాస్ పై నున్న చైర్‌లో ముసుగు మనిషి కూర్చొని ఉన్నాడు. నిలువెల్లా ముసుగు ధరించి ఉన్నాడు. కళ్ళు ఉన్న చోట మాత్రం రెండు కంతలున్నాయి.

ముసుగు మనిషి చుట్టూ బుల్లెట్ ప్రూఫ్ గాజు కవచం ఏర్పాటు చేయబడి ఉంది.

బయట వేసిన ప్రతి కుర్చీకి ఒక స్పీకర్ అమర్చబడి ఉంది. అనుచరులు బాస్‌తో మాట్లాడాలన్నా, బాస్ అనుచరులతో మాట్లాడాలన్నా ఆ స్పీకర్ ద్వారానే.

కుర్చీలలో అప్పటికే దాదాపు 20 మంది అనుచరులు కూర్చొని ఉన్నారు.

సలీమ్, జావేద్‌లు రాగానే బాస్‌కు విష్ చేశారు.

తల పంకించాడు బాస్.

సలీమ్, జావేద్‌లు తమ తమ కుర్చీల్లో కూర్చున్నారు.

"గుడ్ఈవినింగ్ బాస్" అన్నాడు సలీం.

"యస్ గుడ్ఈవినింగ్"

"నౌ అందరి స్పీకర్లు స్టార్టయ్యాయి.

బాస్ ఒక్కసారే చెబుతాడు ఏ విషయాన్నైనా. పదే పదే చెప్పడు. అందుకనే అందరూ జాగ్రత్తగా వింటారు బాస్ ఏ విషయమైనా చెప్పేటప్పుడు

పిన్ డ్రాప్ సైలెన్స్ అలుముకొంది రూమ్‌లో.

"నౌ కమ్‌టు పాయింట్. ఈ రోజు సలీమ్, జావేద్ నాయకత్వాన మారుతీ బాంక్‌ను గోపిడీ చేయాలి. అందుకు తగిన ప్లాన్‌ను, బాంక్ ప్లానుతో సహా సలీం, జావేద్‌లకు చెబుతాను. మీరంతా సహకరించి విజయం చేసుకరండి" ముగించాడు బాస్.

"యస్ బాస్" అన్నాడు సలీం.

"సలీం, జావేద్ తప్ప అందరూ వెళ్ళండి" ఆజ్ఞాపించాడు బాస్.

క్షణంలో సలీం జావేద్‌లు తప్ప రూమంతా ఖాళీ అయింది

"సలీం బాంక్ తాళాలు మేనేజర్ దగ్గర ఒకటి, కాషియర్ దగ్గర ఒక్కటి ఉంటాయి. ముందుగా మీరు బాంక్ వాచ్‌మెన్ అడ్డు తొలగించుకొనండి. తరువాత మేనేజర్ దగ్గరికి ఒకరు, కాషియర్ దగ్గరికి ఒకరు వెళ్ళి బెదిరించి తాళాలతో సహా వార్ని బాంక్ దగ్గరకు తీసుకురండి వారే మీకు బాంక్ తలుపులు తెరిచి, కాష్ మీ చేతికిస్తారు." అంటూ ప్లాన్ వివరించాడు బాస్.

"జాగ్రత్తగా పని ముగించుకు రండి. ఎక్కడా పొరపాటు జరగకుండా చూడండి." హెచ్చరించాడు బాస్.

*       *       *       *       *       *

అర్ధరాత్రి 12 గంటలు.

మారుతీ బాంక్ ఏరియా అంతా నిర్మానుష్యంగా ఉంది. బాంక్ మైన్‌గేట్ ముందు ఉన్న స్టూల్‌పై కూర్చొని వాచ్‌మెన్ బీడీ దమ్ము కొడుతున్నాడు.

గత ఇరవై సంవత్సరాలుగా ఆ బాంక్‌కు వాచ్‌మెన్‌గా పని చేస్తున్నాడు అతను.

రొటీన్ లైఫ్ బోరు కొడుతుంది వాచ్‌మెన్‌కి.



## ఆశయం

సాయంత్రం 6 గంటలకల్లా భోంచేసి బాంక్ దగ్గరికి రావటం. ఉదయం 8 గంటలకు ఇంటికి చేరటం విసుగనిపిస్తోంది అతనికి.

ఒక్కొక్కసారి మానేద్దామా ఈ ఉద్యోగం అనిపిస్తుంది అతనికి.

కాని వెంటనే ఇంటి దగ్గర ఉన్న కొడుకు, కోడలు గుర్తుకొస్తారు అతనికి.

తను ఇక్కడ పనిచేసి ఈ జీతం తీసుకెళ్ళి కోడలు చేతిలో పొయ్యకుంటే అన్నంకూడా పెట్టదు. జీతం ఇస్తుంటేనే అంతంత మాత్రంగా గౌరవిస్తుంది తన కోడలు. ఇంక ఉద్యోగం మానేస్తే..... ఊహించుకోటానికే భయం వేసింది వాచ్‌మెన్‌కి.

అంతలో -

బర్ర్‌మని ఒక వాన్ వచ్చి ఆగింది బాంక్ ముందు. తర్వాత ఒక జీప్ వచ్చి ఆగింది.

వాన్‌లోంచి బిలబిలమంటూ సలీమ్, అనుచరులు క్రిందకు దిగారు.

వార్ని చూసి "హే!? ఎవరు మీరు?" అన్నాడు వాచ్‌మెన్ ప్రక్కనే ఉన్న గన్ అందుకొంటూ.

సర్రమంటూ దూసుకొచ్చింది బుల్లెట్ సలీం సైలెన్సర్ రివాల్వర్‌లోంచి.

"అమ్మా" అంటూ గుండెలర చేత పట్టుకొని కుప్ప కూలాడు వాచ్‌మెన్.

బుల్లెట్ అతని గుండెలోనికి దూసుకొని పోయింది.

క్రింద పడిన మరుక్షణం అతని ప్రాణవాయువు అనంత వాయువులో కలసిపోయింది.

వాచ్‌మెన్‌కి ఈ లోకం నుంచి, అతనికోడలి బారి నుంచి విముక్తి కలిగింది.

"రేయ్ వాడ్ని ప్రక్కకులాగి ఆ చీకట్లో ఉంచండి" అన్నాడు సలీం.

అనుచరులు చచ్చిపడున్న వాచ్‌మెన్ శరీరాన్ని చీకట్లోకి లాగారు.

అనుచరులలో ఒకడు వాచ్‌మెన్ మాదిరిగా స్టూల్‌పై కూర్చొన్నాడు.

"ఫ్రెండ్స్ మీరంతా ఇక్కడే ఉండండి. జావేద్, నువ్వు జీపుతీసుకొని కాషియర్ ఇంటికి వెళ్ళు. తోడుగా ఒకడిని తీసుకెళ్ళు. కాషియర్‌ని బెదిరించి తాళాలు తీసుకొని బయలుదేరమను. వినకుంటే నిర్దాక్షిణ్యంగా చంపిపారేయ్. అతనికి ప్రాణాలకన్నా డ్యూటీ ఎక్కువని నేననుకోను" అన్నాడు సలీమ్.

ఓకే అంటూ జీప్ స్టార్ట్ చేశాడు జావేద్.

"జావేద్ ఇప్పుడు టైం 12-15. కరెక్ట్‌గా 12-40 కల్లా ఇక్కడికి రావాలి. గుర్తుంచుకో" హెచ్చరించాడు సలీం.

"ఓ.కే సలీమ్."

సలీం ఒక అనుచరుడిని తీసుకొని బాంక్ మేనేజర్ ఇంటికి వెళ్ళాడు.

బాంక్ మేనేజర్ ఇల్లు అక్కడకు ధగ్గరే కాబట్టి నడిచే వెళ్ళాడు. వెంట ఇద్దరు అనుచరుల్ని తీసుకు వెళ్ళాడు. వెళ్ళేముందు వాన్‌ని బాంక్ గోడప్రక్కగా చీకట్లో నిలబెట్టాడు, ఎవరికీ ఏ విధమైన అనుమానం రాకుండా.

కాలింగ్ బెల్ ప్రెస్ చేశాడు సలీమ్ బాంక్ మేనేజర్ ఇంటికి చేరుతూనే.

"ఎవరూ?" అని వినిపించిందో ఆడగొంతు. బాంక్ మేనేజర్ భార్య గొంతులా ఉంది.

సమాధానం చెప్పకుండా మళ్ళీ కాలింగ్ బెల్ ప్రెస్ చేశాడు సలీం.

"ఎవరూ? అంటే పలకరేం? అర్ధరాత్రి డిస్టర్బెన్స్" అని విసుక్కొంటూ తలుపు తెరిచింది ఓ ముప్పయి సంవత్సరాల వయస్సున్న స్త్రీ.

అప్పుడే నిదర నుంచి లేచినట్లుగా మత్తుగా ఉంది ఆమె మొఖం.

"ఎవరు మీరు? ఈ వేళప్పుడు వచ్చారు?" ప్రశ్నించింది విసుగ్గా ఆమె సలీంను చూసి.

ఆమెని తోసుకుంటూ లోపలికి వెళ్ళారు సలీం అనుచరులు.

"హేయ్!? వాటీజ్ దిస్?"

"దిసీస్ నథింగ్ మేడమ్" అంటూ తలుపు గడియ పెట్టాడు సలీం.

"ఎవరు మీరు? ఏమిటీ దౌర్జన్యం?"

"దౌర్జన్యంలేదు గీర్జన్యంలేదు నోర్మూసుకొని ఉండు. ఎక్కడ మీ ఆయన" గద్దించాడు సలీం.

మౌనంగా, నోటమాట రాక చేయెత్తి చూపించింది ఆమె.

ఒక అనుచరుడికి సైగ చేశాడు సలీం.

వాడు వెళ్ళి మేనేజర్‌ను రెక్కపట్టుకొని ఈడ్చుక వచ్చాడు.

అప్పటికి నిదరమత్తు వదిలింది మేనేజర్‌కు.

ఎదురుగా సలీం అతని చేతిలోని రివాల్వర్‌ను చూసి కంగారుపడ్డాడు మేనేజర్.

"డాడీ" అంటూ బెదురుతో ఏడుపునందుకొన్నాడు మేనేజర్ 5 సంవత్సరాల కొడుకు.

"మిస్టర్ మేనేజర్! మేము మీ బాంక్ దోపిడీ చేయటానికి వచ్చాం. నువ్వు మాతో సహకరించాలి" అన్నాడు సలీం తాపీగా.

ఉలిక్కిపడ్డాడు మేనేజర్.

"నో. నో... నా ప్రాణాలు పోయినా ఆ పని నేను చేయలేను" అన్నాడు మేనేజర్.

"నో. నీ ప్రాణాలు తీసేటంతటి మూర్ఖుడ్ని కాదునేను. నేను చెప్పినట్లు వినకుంటే ముందుగా నీ కొడుకుని చంపుతాను. ఆ తర్వాత నీ గురించి ఆలోచిస్తాను". అన్నాడు సలీం మేనేజర్ కొడుకుని దగ్గరకు లాక్కొని రివాల్వర్ చూపిస్తూ.

బిగ్గరగా ఏడుపు నందుకొన్నాడు వాడు.

"చుప్ రహో" గద్దించాడు సలీమ్.

టక్కున నోరు మూశాడు వాడు.

"వద్దు వాడ్ని చంపద్దు. లేకలేక పుట్టాడువాడు మాకు" అంది భయంతో మేనేజర్ భార్య.

"ఆ విషయం చెప్పాల్సింది నాకుకాదు. నీ భర్తతో చెప్పు" అన్నాడు సలీం.

ఆమె మౌనంగా భర్తవైపు చూసింది దీనంగా.

"ఏమని చెపుతుంది? ఇన్నాళ్ళూ అన్నంపెట్టి కాపాడిన సంస్థకు ద్రోహం చేయమంటుందా? లేక, లేక లేక పుట్టిన కొడుకుని చంపుకోమంటుందా?"

ఆఖరుకు ఒక నిర్ణయానికొచ్చాడు మేనేజర్.

"చూడండి నేను ఒక్కడ్ని వచ్చి చేయగలిగింది ఏమీలేదు. కాషియర్ దగ్గర కూడా ఒక తాళంచెవి ఉంటుంది. అదికూడా ఉంటేగాని..."

"మేనేజర్. ఆ ఏర్పాట్లు ఎప్పుడో చేశాము. ఇప్పటికే కాషియర్ అక్కడికి వచ్చే ఉంటాడు."

"సరే పదండి" అన్నాడు మేనేజర్.

"శివం నువ్వు ఇక్కడే ఉండు. కరెక్ట్‌గా ఒంటి గంటకల్లా బాంక్ దగ్గరకు చేరుకో. అప్పటిదాకా వీరికి కాపలా ఉండు. పొరపాటు చేయొద్దు" అన్నాడు సలీం తన అనుచరుడితో.

మేనేజర్‌ని తీసుకొని సలీమ్ బయలుదేరాడు.

అప్పుడు సమయం 12-38 నిముషాలు అయ్యింది.

సలీం వెళ్ళేసరికి అప్పుడే జావేద్ కాషియర్‌తో సహా అక్కడికి వచ్చాడు.

బాంక్ కాషియర్, మేనేజర్ ఇద్దరూ కలిసి స్వయంగా బాంక్ తలుపులు తెరిచి బాంక్‌లోని కాష్, బంగారం అంతా సలీం, జావేద్‌ల వశం చేశారు.

* * * * * *

మరుసటి రోజు దినపత్రికలలో ఈ వార్త ఫ్రంట్ పేజీలో హెడ్‌లైన్స్‌లో ప్రచురించబడింది.

మారుతీ బాంక్ దోపిడి. దాదాపు 50 లక్షల విలువ చేసే డబ్బు, బంగారం చోరీ. వాచ్‌మెన్ హత్య.

ఎక్కడ చూసినా ఈ బాంక్ దోపిడీ గురించే చర్చించుకోసాగారు.

బాంక్ మేనేజర్, కాషియర్‌లిద్దరూ, దోపిడీ జరిగి సలీం జావేద్‌లిద్దరూ కాష్, బంగారం తీసుకొని అక్కడి నుంచి వెళ్ళిన వెంటనే పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేసి జరిగిందంతా చెప్పారు.

క్షణాల్లో ఈ వార్త సిటీ పోలీస్ స్టేషన్‌లకన్నింటికి తెలిసిపోయింది. ఎక్కడికక్కడ కట్టుదిట్టాలు ఏర్పాటు చేశారు.

కాని దోపిడీదారులను పట్టుకోలేక పోలీస్ అధికారులందరూ ఐ. జి. ఆఫీసులో సమావేశమయ్యారు.

ఐ. జి., ఎస్. పి., జిల్లా కలెక్టర్, తదితర ఇన్‌స్పెక్టర్ లందరూ పాల్గొన్నారు ఆ సమావేశంలో.

"సర్ ఈ దోపిడీలు, హత్యలు ఎందుకు జరుగుతున్నాయో, ఎవరు జరుపుతున్నారో, దీని వెనుక ఎవరి హస్తమున్నదో త్వరగా తేల్చండి. ఇప్పటికే హోమ్ మినిస్టర్‌గారి దగ్గర్నుంచి వార్నింగ్‌లు వస్తున్నాయి" అన్నాడు కలెక్టర్.

"యస్. సర్. ఆ పని మాదే ఉన్నాము. మా శాయశక్తులా కృషి చేసి 5 లేక 6 రోజులలో మీకు హంతకుణ్ని, దోపిడీదార్లను పట్టుకొని న్యాయస్థానానికి అప్పజెబుతాము" అన్నాడు ఐ.జి.

"ఫ్రెండ్స్" అందరి వైపు చూశాడు ఐ.జి. ఇన్‌స్పెక్టర్స్, తదితర అధికారులందరూ ఐ.జి. వైపు తిరిగారు.

"ఈ మధ్య నగరంలో హత్యలు, దోపిడీలు ఎక్కువైనాయి. సి. బి.ఐ. ఆఫీసర్ గణేశ్ హత్య, సంతోష్‌కుమార్ హత్య, నిన్న జరిగిన బాంక్ దోపిడి... వీటన్నిటి వెనుక ఒకే హస్తమున్నదని నా అనుమానం. నిన్న జరిగిన బాంక్ దోపిడీలో కాషియర్, మేనేజర్ చెప్పేకథనాన్నిబట్టి సలీమ్, జావేద్ అనే రెండు పేర్లు వాళ్ళ మాటల మధ్య దొర్లాయని మనకు క్లూ అందిచ్చారు. ఈ క్లూల ఆధారంతో మనం హంతకులను పట్టుకోవాలి." ఆగాడు ఐ.జి.

"సర్" లేచాడు ఇన్‌స్పెక్టర్ విజయ్‌కుమార్. అతను అప్పటికే ఛార్జ్ తీసుకొని దాదాపు వారం రోజులయింది.




"వాట్ మిస్టర్ విజయ్‌కుమార్" ప్రశ్నించాడు ఐ.జి.

"నేను ఈ మధ్యనే క్రొత్తగా డిపార్ట్‌మెంట్‌లో జాయినయ్యాను. నేను డ్యూటీలో చేరిన తరువాత నగరంలో జరిగిన మొట్ట మొదటి దారుణం ఈ బాంక్ దోపిడి. మీరు అనుమానించినట్లుగా గతంలో జరిగిన హత్యలకు, ఈ బాంక్ దోపిడీకి సంబంధము ఉంది, వీటన్నింటి వెనుక ఉండే హస్తం ఒకటే అయితే ఆ హస్తాన్ని నరికి, దేశానికి, మన డిపార్ట్‌మెంట్‌కు పట్టిన చీడను తొలగించే అవకాశము నాకు కల్పించవలసిందిగా కోరుతున్నాను" అన్నాడు విజయ్‌కుమార్.

"విజయ్ నువ్వు....?"

"సర్ కొత్తవాడినని సందేహించకండి. నేను ఇన్ని రోజులుగా పొందిన ట్రైనింగ్‌కు, గవర్నమెంట్ నాపై పెట్టిన ఖర్చుకు సత్ఫలితం ఇచ్చేందుకు నాకీ అవకాశం ఇప్పించండి" అన్నాడు విజయ్‌కుమార్.

"ఎస్. నవ్వడిగినట్లే ఈ కేసు పరిశోధన విషయమంతా నీ కప్పచెబుతున్నాము. సమయస్ఫూర్తిగా ప్రవర్తించి మన డిపార్ట్‌మెంట్ పరువు నిలబెట్టు" అన్నాడు ఐ.జి.

"థాంక్యూ సర్."

"డియర్ ఫ్రెండ్స్, మీరంతా విజయ్‌కుమార్‌కు సహకరించండి" అంటూ అందరికీ చెప్పి తగిన సూచనలు, ఆదేశాలు ఇచ్చాడు ఐ.జి. (ఇంకా ఉంది)




లేసర్ డిస్క్ రికార్డ్ ప్లేయర్!

# మంత్ర ముగ్ధుల్ని చేస్తున్న "కాంపాక్ట్ డిస్క్"లు!

సంగీత ప్రియులకి వరప్రసాదంలాగా రంగ ప్రవేశం చేసిన "కాంపాక్ట్ డిస్క్ ప్లేయర్" అంతర్జాతీయ విపణిసీమలో సంచలనాన్ని సృష్టిస్తోందని స్టీఫెన్ కొయప్టిమ్ వారపత్రికలో రాసిన వ్యాసాన్ని చదివితే ఎంతో ఆశ్చర్యం వేస్తుంది. ఈ "కాంపాక్ట్ డిస్క్ ప్లేయర్"ల వల్ల కర్ణపేయమై సుశబ్ద శోభితమై, అలరించి రససిద్ధిని సాక్షాత్కరించే శ్రావ్య సంగీత లహరులని - తన్మయంతో ఆలకించి, తాదాత్మ్యతని పొందడం అతి సునాయాసంగా జరిగేపని అని ఎంతోమంది అభిప్రాయ పడతారు!

"గ్రామ్‌ఫోన్ రికార్డ్"లు పెట్టుకొని వినే రోజులు వెళ్లి పోయాయి. "టేప్ రికార్డర్"లని పెట్టుకొని పాటలు వింటున్న ఈ రోజులకి కూడా త్వరలో కాలం చెల్లనుంది. అతి త్వరలో "కాంపాక్ట్ డిస్క్ ప్లేయర్"లని పెట్టుకొని పాటలు వినే రోజులు ప్రపంచ వ్యాప్తంగా రానున్నాయి. "గ్రామ్ ఫోన్ రికార్డ్" మీద తిరిగే "నీడిల్" వల్ల సంగీత మధురిమ అపశ్రుతులు పలకవచ్చు! అలాగే టేప్‌ను అంటి పెట్టుకొనే "హెడ్" ఉండడం వల్ల "టేప్ రికార్డర్"లో కూడా తరచూ శ్రావ్య సంగీత స్రవంతికి అవరోధాలు కలుగుతూ ఉంటాయి. అయితే "కాంపాక్ట్ డిస్క్ ప్లేయర్"లో సంగీత ఝరికి ఆనకట్ట వేసే ఏ ఆటంకాలూ లేవు. లేసర్ కిరణ వ్యవస్థ ఆధారంగా ఈ డిస్క్ ప్లేయర్ పని చేయడం వల్ల ఎప్పుడు కూడా గంధర్వగాన మాధుర్యమే వినిపిస్తుంది. పొరపాటుగా కూడా అపశ్రుతులు వినిపించవు.

జాజ్, పాప్, రాక్-యన్- రోల్, శాస్త్రీయ సంగీతము- పొందలైన వంటి వివి కోసుకునే వారికి ఈ "డిస్క్ ప్లేయర్"లు అద్భుత కళలని [illegible] తప్పదు. మొదటి సారిగా "కాంపాక్ట్ డిస్క్ ప్లేయర్"లు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో 1983 నాటికి మార్కెట్ లోకి వచ్చాయి. వచ్చే సంవత్సరానికి వీటి సంఖ్య పది లక్షలని దాటుతుందని అంచనా! ఈ సంఖ్యని దాటడానికి వీడియో కేసట్ రికార్డర్‌ల కయితే ఆరు సంవత్సరాలు పట్టింది! (1975 నించి 1981 వరకు!) మొదట్లో "డిస్క్ ప్లేయర్" ధర వెయ్యి డాలర్‌లు కాగా, "డిస్క్" ధర ఇరవై డాలర్‌లు మాత్రమే! ఇప్పుడు "ప్లేయర్" ఖరీదు 180 డాలర్‌లు కాగా, "డిస్క్" వెల 12, 14 డాలర్‌లు మాత్రమే కావడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. 1983లో 35,000 "డిస్క్ ప్లేయర్"లు ఉండేవి. 1984 నాటికి ఆ సంఖ్య 240,000 అయింది. 1985 నాటికి 600,000 కాగలదని అంచనా! వార్నర్ బ్రదర్స్ సంస్థ మార్కెటింగ్ డయిరక్టర్ అలన్ పెర్‌పెర్ భవిష్యత్తులో 100 - 150 డాలర్‌లకే "డిస్క్ ప్లేయర్" లభ్యం కాగలదని చెబుతూ ధర పడిపోవడం "డిమాండ్" లేక పోవడం వల్ల కాదు, భారీ ఎత్తున జరుగుతున్న కొనుగోలు వల్ల అని స్పష్టం చేయడం గమనించాలి.

ఈ "డిస్క్ ప్లేయర్"లని జనం వేలం వెర్రిగా కొంటున్నారని చెప్పవచ్చు. 45 సంస్థలు ఇప్పుడు వీటినే తయారు చేస్తున్నాయి. ఈ "ప్లేయర్"లని తయారు చేసే సంస్థలలో ఎక్కువ భాగం జపాన్‌కి చెందినవి. సోనీ సుప్రసిద్ధ మైనది. అవి తయారు చేసిన "బూమ్- బాక్స్ మోడల్" ధర 550 డాలర్‌లు! సోనీయే తయారు చేసిన "కాంపాక్ట్ డిస్క్ జూక్ - బాక్స్ మోడల్" ఖరీదు 3560 డాలర్‌లు. ఇందులో 120 "డిస్క్"లు 1800 రాగాలతో ఉంటాయి. 5 అంగుళాల వ్యాసము, 1.5 అంగుళాల మందమూ ఉన్న "వాక్‌మన్" రకపు "డిస్క్ ప్లేయర్" (సోనీ తయారీ!) కేవలం 300 డాలర్‌లకే లభించడం ముదావహం! జపాన్‌కి చెందిన సోనీ, నెదర్‌లాండ్స్‌కి చెందిన ఫిలిప్స్ కంపెనీలు "డిస్క్ ప్లేయర్"ల తయారీ పట్ల అమిత శ్రద్ధని కనబరుస్తున్నాయని వార్తలు అందుతున్నాయి.

"కాంపాక్ట్ డిస్క్"లని తయారు చేయడం యల్. పి. రికార్డ్‌లని తయారు చేసినంత సులభం కాదు. టేప్ తయారీ కన్నా క్లిష్టమైనదే! ప్లాస్టిక్ చక్రానికి అద్దంలాంటి అల్యూమినియమ్ కవచాన్ని అతికించడం ఎంతో ప్రయాసతో కూడు కొన్నది. ఈ కర్మాగారంలో పని చేసే కార్మికులు తప్పని సరిగా కళ్లకి నల్లటి అద్దాలు, చేతులకి "గ్లవుస్"లు, కాళ్లకి బూట్‌లు వేసుకోవలసిందే! లేసర్ కిరణ పుంజాల ప్రసక్తి ఉంటుంది కాబట్టి ఎంత మాత్రమూ అజాగ్రత్త కూడదు. "కాంపాక్ట్ డిస్క్"ల వల్ల గురగుర శబ్దం, కీచుమంటూ రొద రావడం ఇలాంటివి మచ్చుకైనా వినిపించవు. డిస్క్‌ల తలం సమంగా, నునుపుగా ఉండడంవల్లా, అల్యూమినియమ్ కవచం ఉండడం వల్లా గీరుకు పోవడాలు, నొక్కులు పడడాలు వగైరా ఉండవు. పైగా ఈ "డిస్క్" మీద "నీడిల్" పయనించడం కాని, లేదా "హెడ్" పట్టుకోవడం కాని జరగదు. కేవలం లేసర్ తరంగం మాత్రమే ప్రసరించబడుతుంది. 1877 లో థామస్ ఎడిసన్ ఫోనోగ్రాఫ్ కనుగొన్నప్పటి నించీ శబ్దాలని రికార్డ్ చేయడం పై ఎక్కువ శ్రద్ధను చూపడం జరిగింది. "గ్రామ్ ఫోన్ రికార్డ్"లు శబ్ద తరంగాలని రేఖా మాత్రపు గాడీలలో దాచి ఉంచు కొంటాయి. వజ్రంకాని, గోమేధకం కాని వాటి మీద కదలాడినప్పుడు ("గ్రామ్ ఫోన్ రికార్డ్"కి ఉపయోగించే "నీడిల్స్" అనుకోవచ్చు!) విద్యుత్ ప్రవాహ శక్తి రూపొంది, "రికార్డ్" అయి ఉన్న శబ్దంగా వెలువడుతుంది! "టేప్ రికార్డర్" విషయం లోనూ ఇంతే! "ప్లాస్టిక్ రిబ్బన్" మీద అయస్కాంత కణికల ద్వారా దాచి ఉంచబడిన శబ్దం "హెడ్" తలం మీదికి వచ్చినప్పుడు వినిపిస్తుంది. "కాంపాక్ట్ డిస్క్" విషయంలో "నీడిల్స్" లేదా "హెడ్స్" - ఈ రెండింటి ప్రమేయమూ లేదు. ప్రతి "డిస్క్" లోనూ అత్యంత సూక్ష్మంగా ఉండే 15 బిలియన్‌ల గుంటలు ఉంటాయి. "డిస్క్" నిమిషానికి 500 సార్లు తిరుగు తున్నప్పుడు లేసర్ కిరణ తరంగం గుంట నించి గుంటకి పయనిస్తూ శబ్దసమాచారాన్ని సంగ్రహించి "మైక్రో కంప్యూటర్"కి అందిస్తుంది. ఈ "మైక్రోకంప్యూటర్" ఆ శబ్దాన్ని బయటపడేలా చేస్తుంది. (బొమ్మని చూడండి!)

"కాంపాక్ట్ డిస్క్" త్వరగా పాడయిపోయే అవకాశమేలేదు. పైగా పని తనపు శక్తి ఎంతో అధికం! తక్కువ ధరకి అతి సులువుగా లభ్యమవు తోంది కూడా! ఇలాంటి వాతావరణంలో "కాంపాక్ట్ డిస్క్"లు మరింతగా ప్రజాబాహుళ్యంలోకి చొచ్చు కొని పోకుండా ఉంటాయా? మొత్తం మీద ఈ "డిస్క్"లు ఒక సంచలనాన్ని కలిగించాయని చెప్ప వలసి ఉంటుంది.!

-డా. గుమ్మనూరు రమేష్‌బాబు

# కనువిప్పు

– శ్రీకంఠశాస్త్రి

కొండమీద దేవుడి హుండీలో వందరూపాయల కట్టలు – వరుసగా పదివేసి భక్తి పూర్వకంగా నమస్కరించాడు భైరవయ్య! ఆ వంద రూపాయల కట్టల విలువ మొత్తం పదివేలు! భైరవయ్య కిప్పుడు మహదానందంగా ఉంది... మనసు – ప్రశాంతంగా ఉంది... స్వామిమొక్కు, తు. చ. తప్పకుండా తీర్చగలిగినందుకు కొండంత తృప్తిగా ఉంది...!

భైరవయ్య తన భార్య పేర ఓ చిట్ ఫండు కంపెనీ నడుపుతున్నాడు. ఆ కంపెనీ తెచ్చిపెట్టే లాభాల్లో పదిశాతం స్వామికి సమర్పించుకుంటానని, కంపెనీ మొదలు పెట్టినపుడే అతను మొక్కుకున్నాడు... మొక్కుకున్న విధంగా ప్రతి సంవత్సరం కొండ మీదకు వచ్చి దేవుడి మొక్కు విధిగా తీర్చుకుంటున్నాడు భైరవయ్య!

భైరవయ్యతో బాటు భార్య మహాలక్ష్మి, పిల్లలు శేఖరం, సునీత, తమకు తోచిన కానుకలు హుండీలో వేసి బయటకు వచ్చారు. గుడిప్రక్కగా కళ్యాణ మండపం గచ్చుమీద కుటుంబం అంతా చతికిల పడి కూర్చున్నారు. పొట్లాలు విప్పి ప్రసాదాలు తినడం ప్రారంభించారు...! విపరీతమైన జనం మధ్య నలిగిపోకుండా... గంటల తరబడి క్యూలో నిలబడకుండా భైరవయ్య స్పెషల్ టికెట్లు – తీసుకున్నాడు... భైరవయ్య కుటుంబం అంతా స్వామిని ప్రత్యేకంగా దర్శించుకున్నారు. భైరవయ్య అత్యంత భక్తి శ్రద్ధలతో తన కంపెనీతోనూ, విడివిడిగా కుటుంబ సభ్యుల. పేర్లతోనూ అభిషేకాలు చేయించాడు! వచ్చే సంవత్సరం ఎక్కువగా లాభాలు తెచ్చిపెడితే... నీ వాటా మొక్కుబడి మరో అయిదు శాతం పెంచుతానని – స్వామికి సాగిల పడ్డాడు...!

భైరవయ్య రకరకాల వ్యాపారాలు చేశాడు... కష్టపడ్డా అతనికి వ్యాపారం చాలాకాలం కలిసి రాలేదు... తల్లి – దండ్రుల్ని, బంధువుల్ని ఎదిరించి అతను మహాలక్ష్మిని పెళ్లిచేసుకున్నాడు. మహాలక్ష్మిని పెళ్లి చేసుకున్న తరువాతే తనకు 'లక్ష్మి' కలిసి వచ్చిందని అతని గట్టి నమ్మకం! పిల్లలు పుట్టిన తరువాత కూడా అతని వ్యాపారం దినదినాభివృద్ధి చెందింది... భైరవయ్య కిప్పుడు ఏ బాధ్యతలూ లేవు... బెంగలూ లేవు...!

భార్య మహాలక్ష్మి అతని వ్యాపారానికి ముఖ్య సలహాదారురాలు! పదేళ్ల సునీత ఏడవ తరగతి చదువుతోంది! పన్నెండేళ్ల శేఖరం తొమ్మిదిలోకి అడుగుపెట్టాడు...! మొదట్నుంచీ భైరవయ్యకు భక్తి ప్రపత్తులు ఎక్కువ... రోజూ గంటకుపైగా అతను పూజగదిలో గడుపుతుంటాడు. ప్రతియేటా కొండకు రావడం, కోరికలు విన్నవించుకోవడం స్వామి మొక్కుబడి తంచనుగా చెల్లించడం అతని అలవాటు! గుడికి సమీపంలో పావుగంటసేపు కూర్చుని... ప్రసాదాలు తిని భార్యాబిడ్డలతో కారు దగ్గరకు వచ్చాడు భైరవయ్య.

కారు డ్రైవరు కనకరాజు కాలుస్తున్న బీడీని నేలమీద పడేసి వినయంగా కారు తలుపులు తీశాడు...

భైరవయ్య, మహాలక్ష్మి, సునీత వెనుకసీట్లో కూర్చున్నారు. శేఖరం, డ్రైవరు ప్రక్క ముందు సీట్లో కూర్చున్నాడు... మహాలక్ష్మి కనకరాజు చేతిలో ప్రసాదం పెట్టింది! ప్రసాదం కళ్ల కద్దుకుని... నోట్లో వేసుకుని కారు స్టార్టు చేశాడు కనకరాజు!

"త్వరగా పోనీయవోయ్! కొండదిగి మనం వెంగళ్రావు గారింట్లో భోజనం చేయాలి! ఆ తరువాతే ప్రయాణం!" భైరవయ్య కనకరాజుని ఆజ్ఞాపించాడు.

"అలాగే సార్!" యజమాని ఆజ్ఞకు బద్ధుణ్ణి అన్నట్టుగా కనకరాజు తల ఊపి బలంగా ఏక్సిలేటరుమీద కాళ్లు వేశాడు!

వెంగళ్రావు, భైరవయ్య ఒకప్పుడు కలిసి వ్యాపారం – చేశారు. భైరవయ్యకున్న మిత్రుల్లో వెంగళ్రావు ముఖ్యుడు. అతను ఈ ఊళ్లోనే స్థిరపడ్డాడు... భైరవయ్య కొండకు వచ్చినపుడల్లా వెంగళ్రావు ఇంట్లో భోజనం చేయడం ఆనవాయితీ!

మిట్టమధ్యాహ్నం కావస్తోంది!

నెత్తిమీద సూర్యుడు నిప్పులు చెరిగే ప్రయత్నంలో ఉన్నాడు...!

కారు ముందుకు పరుగెడుతోంది!

ఘాట్‌రోడ్డుమీద మెలికలు తిరుగుతూ – కొండ పైనుండి సర్రున క్రిందికి దూసుకుపోతూంది! కనకరాజుకూ ఆకలిగా ఉందేమో హుషారుగా కారును పరుగెట్టిస్తున్నాడు!

రోడ్డుప్రక్క చుట్టూ ఎత్తైన కొండలు... అగాధమైన – లోయలు... కొండలమీద గుబురుగా, దట్టంగా పెరిగిన – పచ్చటి వృక్షసంపద! ఆ చెట్ల



మధ్యనుంచి కొండపైకి ప్రాకిన విద్యుత్తు, టెలిఫోన్ తీగెలు! ఇరువైపులా రాళ్ళ ఫెన్సింగు గోడతో, మైళ్ళదూరం ఎంతో శ్రమకోర్చి సన్నగా, సన్నగా త్రాచులా మెలికలు తిరిగేలా నిర్మించిన ఘాట్ రోడ్డు...!

భైరవయ్య కారు అద్దాల్లోంచి పాలోచనగా బయటకు చూస్తున్నారు... ముందు సీట్లో శేఖరం, కొండల మధ్య చక్రం కట్టినట్లుగా ఎగురుతూన్న తెల్లటి పిట్టల్ని చెల్లెలికి చూపిస్తున్నాడు! సునీత సంభ్రమంగా ఆ పిట్టల్ని చూస్తూ చప్పట్లు కొడుతోంది!

కనకరాజు కారుని స్రరుమంటూ ముందుకు పరుగెట్టిస్తూనే ఉన్నాడు! కారు ఓ మలుపు తిరిగింది... కనకరాజు చటుక్కున తల వెనక్కి తిప్పాడు! భైరవయ్య ముఖంలోకి భయంగా చూశాడు...!

"అయ్యగారూ! కారుకి బ్రేకులు పని చేయడం లేదుసార్!"

భైరవయ్య గుండె గుభిల్లుమంది! అతని ముఖంలో భయం! ఆందోళన! మహలక్ష్మి ముఖం తెల్లగా పాలిపోయింది... పిల్లలిద్దరూ బిదురు కళ్ళతో చూశారు!

"బ్రేకులు పని చేయకపోవడం ఏమిట్రా? వచ్చేటప్పుడు సరిగానే ఉన్నాయికదా!" భైరవయ్య అలజడిగా – ఆత్రంగా అన్నాడు.

"ఏమోసార్! వచ్చేటప్పుడు బాగానే ఉన్నాయండి!" కనకరాజు కంఠంలోనూ కలవరపాటు... కంగారు! అతను దృష్టంతా రోడ్డుమీదకు నిలిపి స్టీరింగు అతి జాగ్రత్తగా తిప్పుతున్నాడు...!

కారు అరవై మైళ్ళ వేగంతో క్రిందికి జారిపోతోంది...! మలుపులు తిరుగుతోంది! కనకరాజు బ్రేకులమీద మళ్ళీ కాళ్ళు వేశాడు... ఫలితం కనిపించలేదు! మళ్ళీ ప్రయత్నించాడు! మళ్ళీ ప్రయత్నించాడు! బ్రేకులు పడలేదు... అతను నిస్సహాయంగా భైరవయ్య ముఖంలోకి చూశాడు...!

భైరవయ్యకు అప్పటికే గుండె బేజారెత్తిపోయింది! "ఎంతలో ఎంత ప్రమాదం ముంచుకొచ్చింది? స్వామి...! నేనేమైనా అపచారం చేశానా? నన్ను క్షమించు! ఈ గండం తప్పించు!" అతను కొండమీద దేవుణ్ని మనసులో పదే పదే వేడుకుంటున్నాడు... చెంపలు వాయించుకుంటున్నాడు... భార్య మహలక్ష్మి కూడా భయంతో బిగుసుకుపోతూ, గొంతువిప్పి భగవన్నామ స్మరణ చేస్తోంది! తల్లిమాట మీద పిల్లలు కూడా చేతులు జోడించారు!

కనకరాజు నిశ్చలంగా కారు నడుపుతున్నాడు. మలుపులు వచ్చినపుడు మనిషి చాకచక్యంగా ఊపిరి ఉగ్గబెట్టి మరీ డ్రైవు చేస్తున్నాడు. ఎదురుగా ప్రభుత్వ జీపు కాబోలు ఒకటి దూసుకువస్తోంది! భైరవయ్య భార్య భుజం మీద చేయివేశాడు... అతని



చేయి సన్నగా వణుకుతోంది!

ఏమాత్రం ప్రమాదం జరిగినా... కారు రెండువేల అడుగుల క్రిందికి లోయలోకి దొర్లిపోతుంది!

తనభార్య, బిడ్డలు బలవన్మరణంగా ప్రాణాలు పోగొట్టుకుంటారు!

తను కూడా సంపాదించుకున్న ఆస్థి, అంతస్తు, గౌరవం, హోదా అన్నీ అనుభవించకుండానే అన్యాయంగా కళ్ళు మూస్తాడు! అమ్మో!

భైరవయ్య ఊహలు పిచ్చిగా అరుస్తున్నాయి!

"ఒరేయ్! కనకరాజూ! ఎలా డ్రైవుచేస్తావో! ఏమో! అంతా నీ చేతుల్లోనే ఉంది!" భైరవయ్య ముందుకు వంగి భయం భయంగా అన్నాడు...

"అవున్రా బాబూ! మా ప్రాణాలు నీ గుప్పెట్లోనే ఉన్నాయి! నువ్వే మమ్మల్ని రక్షించాలి!" మహాలక్ష్మి కూడా గద్గద స్వరంతో అంది!

"మీరేం భయపడకండి అమ్మగారూ! మిమ్మల్ని క్షేమంగా కొండ క్రిందకు చేర్చే పూచీ నాది!"

కనకరాజు అభయ మిచ్చినట్టుగా అన్నాడు... అన్నట్టుగానే ఎదురుగా వస్తోన్న జీపుకు ఒడుపుగా దారి యిచ్చి ముందుకు పోనిచ్చాడు!

కారు పిచ్చెక్కిన దానిలా పరుగెడుతూనే ఉంది! బ్రేకులు వేస్తోన్నా ఆగకుండా... అదూ అదుపూ లేకుండా నున్నటి సన్నటి రోడ్డుమీద క్రిందికి జారిపోతోంది!

ఎదురుగా రెండు టూరిస్టు బస్సులు పెద్దగా హారను కొడుతూ వస్తున్నాయి! భైరవయ్య కుటుంబం కారులో ప్రాణాలు బిగబట్టుకుని కూర్చున్నారు! ఎవరి ముఖాల్లోనూ జీవకళలేదు! కనకరాజు ముఖం నిండా చెమటపట్టింది...! భైరవయ్య భార్యాబిడ్డలకి ధైర్యవచనాలు పలుకుతున్నాడు.

"ఒరేయ్ కనకరాజూ! అంతా నీదేభారం! మాకు నువ్వే దిక్కు ఓ ఇరవై నిముషాల్లో కొండదిగిపోతాం! కొండ దిగిన తరువాత నువ్వు కోరినంత డబ్బిస్తాను... నీజీతం పెంచుతాను... నీకూతురి పెళ్ళి దగ్గరుండి నేనే చేయిస్తాను! నీ కొడుకు చదువుకు పెట్టుబడి నేనే పెడతాను... మమ్మల్ని సురక్షితంగా క్రిందికి చేర్చు!"

# కనువిప్పు

భైరవయ్యలో ప్రాణభయం పరాకాష్ఠనందుకుంటోంది! కనకరాజు భుజం మీద చేయివేసి... వణుకుతూన్న కంఠంతో మరీ వాగ్దానం చేశాడు!

కనకరాజు మాట్లాడలేదు... కారుని లాగి పట్టినట్టుగా నడుపుతూనే ఉన్నాడు! టూరిస్టు బస్సులు పెద్ద రొదపెడుతూ ఎదురుగా వచ్చేశాయి! భయంతో అందరూ కళ్ళు మూసుకున్నారు. కొండను ఢీకొన్నట్టు పెద్ద శబ్దం! పిల్లలందరూ అదిరిపడుతూ కెవ్వుమన్నారు! భైరవయ్య స్పృహ కోల్పోతున్న వాడిలా కళ్ళు తెరిచాడు! రాతి ఫెన్సింగుగోడను రాసుకుంటూ కారు ముందుకు దూసుకుపోయింది! కనకరాజు చాలా తెగువగా... త్రుటిలో టూరిస్టు బస్సుల్ని తప్పించాడు...!

భైరవయ్య గుండెలమీద చేయివేసుకున్నాడు! ప్రమాదం తప్పినందుకు, తప్పించినందుకు అతను కన కరాజును కారులో కౌగిలించుకున్నంత పని చేశాడు...

మరో అయిదు నిముషాల్లో కారుకొండ క్రిందకు వచ్చేసింది! కనకరాజు కారుని చిన్నరాళ్ళగుట్టకు ఢీకొట్టి అతి లాఘవంగా నిలబెట్టాడు! భైరవయ్య మనసు కుదుటపడింది. ప్రమాదం తప్పించినందుకు, కనకరాజు రెండు చేతులూ పట్టుకుని కన్నీళ్ళు కార్చేసింది మహాలక్ష్మి! ఆమె కొండమీద దేవుడికి, కనకరాజుకీ ఒకేసారి రెండు చేతులూ జోడించింది! బిదిరిపోయిన పిల్లలూ బిగ్గరగా ఏడ్చి తల్లికి అంటుకుపోయారు!

"ఒరేయి కనకరాజూ! ఇవిగోరా! ఈ వెయ్యి రూపాయలు తీసుకో! ఇంటికి వెళ్ళిన తరువాత మరో వెయ్యి ఇస్తాను! కారులో నేను నీకు వాగ్దానం చేసిన అన్ని మాటలు నెరవేర్చుకుంటాను... ఈ రోజున నన్నూ నాకుటుంబాన్ని రక్షించావు! మా జీవితాల్ని నిలబెట్టావు! నువ్వు ఏమాత్రం అజాగ్రత్తగా నడిపినా మా బ్రతుకులు ఈపాటికి తెల్లారి పోయేవి! కొండమీద ఆ దేవుడే కాదురా! నువ్వూ దేవుడివే! నువ్వూ దేవుడివే!" భైరవయ్య అమాంతం కనకరాజుని ఆలింగనం చేసుకుని వెయ్యి రూపాయలు చేతిలో పెట్టాడు!

కనకరాజు డబ్బు తీసుకోలేదు. అతని కళ్ళ వెంటా కన్నీళ్ళు జలజలా రాలుతున్నాయి! మనిషి నిలువెల్లా కంపించిపోతున్నాడు! మాటలకోసం తడుముకుంటున్నాడు! ముకుళించుకు పోతున్నాడు!

"అయ్యా! నన్ను క్షమించండయ్యా! నేను దేవుడ్ని కాదు... మామూలు మనిషిని ఆకలిదప్పులకి, అవసరాలకి [illegible]... అర్హుడ్ని! నాకీ డబ్బు [illegible]

కొండకు బయలుదేరే ముందు మిమ్మల్ని మూడొందలు జీతం [illegible] అడిగానయ్యా! మీరు కసురుకున్నారు. కోపగించుకున్నారు. నా భార్యని పెద్ద డాక్టరుకి చూపించాలని నిజంగా కళ్ళనీళ్ళు పెట్టుకున్నా... కష్టకథలు చెప్పాలన్న నన్ను తిట్టిపోశారు! దాన్ని అలా అనారోగ్యంతోనే వదిలేసి మీతో కొండకు వచ్చేశానయ్యా! నా ఆడది డబ్బులేక నాకు దూరమైపోతే... నాకుటుంబం ఏమవుద్దోనని భయం వేసింది! పదేళ్ళుగా మీ డ్రైవరుగా పనిచేస్తున్నా... నామాట మీరెందుకు నమ్మటం లేదో అర్థంకాలేదు! నామీద నాకే కోపం వచ్చిందయ్యా! ఆ కోపం మీమీద తీర్చుకోవాలనిపించిందయ్యా అందుకే కారుకి బ్రేకులు పడటంలేదని అబద్ధం చెప్పాను. అందుకు అనువుగా నటించి మిమ్మల్ని భయపెట్టాను! ఇప్పుడు నా తప్పేమిటో నాకు తెలిసిందయ్యా! అమ్మగారూ... పిల్లలూ ప్రాణభయంతో ఎంత బిగ్గపట్టుకుపోయారో కళ్ళారా చూశాను... కొండ దిగిన తరువాత నన్నో దేవుడిలా పొగుడుతూ ఎందుకు దణ్ణాలు పెడతన్నారో... అదీ ఈ కళ్ళతోనే చూశానయ్యా! కేవలం డబ్బుకోసం... కక్షతో అవకాశం చూసి మిమ్మల్ని భయపెట్టాను... ద్వేషంతో హింసపెట్టాను! ఇది చాలా తప్పనిపించిందయ్యా! నా మనస్సాక్షి నా పాపాన్ని నిలబెట్టి అడిగిందయ్యా! అందుకే నానేరం ఒప్పేసుకుంటున్నాను... నన్ను కొట్టండి... తిట్టండి... పనిలోంచి తీసేసి బయటకు పొమ్మనండి! సంతోషంగా బయటకు పోతానయ్యా! బయటికి పోతాను!" కనకరాజు భైరవయ్య కాళ్ళమీద పడిపోయాడు... మహాలక్ష్మి భర్తనీ, కనకరాజునీ బిత్తరపోయి చూస్తోంది! భైరవయ్య విగ్రహంలా ఉండిపోయాడు...!

ఇంతసేపూ తనూ, తన కుటుంబం అనుభవించిన బాధ... భయం... ఆందోళన అన్నీ కన కరాజు కల్పించినవేనా? కారుకి బ్రేకులు నిజంగా చెడిపోలేదా?

అతనికి విలువైన సత్యమేదో బోధపడినట్టయ్యింది...

"కనకరాజూ! నీ అవసరాన్ని... కష్టాన్ని గుర్తించకపోవడం నాదే తప్పు! నీలోనూ దేవుడున్నాడు... ఆ దేవుడు నాకు ఇప్పుడిప్పుడే కనపడుతున్నాడు. కనువిప్పు కలిగిస్తున్నాడు. ఈ వెయ్యి రూపాయలూ నీదగ్గరే ఉంచు!." కనకరాజుని రెండు చేతులతోనూ ఆప్యాయంగా లేవదీసి కారు దగ్గరకు – నడిపించాడు భైరవయ్య...! □






### వై. ఎ. జె. ఆర్. నిరాకార్‌పూర్, ఒరిస్సా

★ మహా మేధావి గొథె వంటి వ్యక్తి స్త్రీది విషపూరిత హృదయంగా చిత్రించడం, టెన్నిసన్ వంటి మహనీయుడు మగవాని విలాస వస్తువుగా పరిగణించడం నిజానికి ఆవేదన కల్గించే విషయాలు. స్త్రీ స్వతంత్రానికై కలంపట్టిన చలాన్ని యీ ప్రపంచం- ముఖ్యంగా స్త్రీలే అర్థం చేసుకోరేం?

● మీరు సూచించిన వారంతా పురుషులు అవడమే వారి వాదన తప్పనడానికి నిదర్శన. చలం స్త్రీ స్వతంత్రం కోసం కలం పట్టలేదు. స్త్రీ స్వేచ్ఛ పట్ల తనకున్న అభిప్రాయాలని వ్యక్తం చేయడానికి కథలల్లారు. చివరి దశలో ఆయన అభిప్రాయాలు ఆయనకే నచ్చలేదు. సెక్సు స్వేచ్ఛ- ఒక్కటేనా స్త్రీలు కోరే స్వేచ్ఛ?! స్త్రీ విమోచనోద్యమ కర్తలు కోరింది, కోరుతున్నదీ ఆడదాన్ని మనిషిగా చూడమని. వ్యక్తిగా గుర్తించమని. ఆమె కూడా మగవాడితో- పతనంలో పోటీపడాలని కోరుకోడం లేదు.... అయినా పిచ్చిగాని- వ్యభిచరించాలనుకున్న వారిని ఆపగలరా?! తన శరీరం మీద కోర్టు ద్వారా హక్కులను పొందాలని ఆశించే మగవాడిని ఏ ఆడదేనా గౌరవంగా కోరుకుంటుందా? సెక్సుకీ స్వేచ్ఛకీ ముడి పెట్టడమే- చలం కథలో వీక్ పాయింట్ అని నా నమ్మకం.

### బి. ఎ. ఆర్. కాకినాడ

★ రామలక్ష్మిగారూ, రిజర్వేషన్లపై మీ అభిప్రాయం ఏమిటి?

● నాకు తెలిసినది ఒకే రిజర్వేషన్- రైల్వేది... రిజర్వేషన్ లేకుండా ప్రయాణం అంటే భయం నాకు!

### ఎమ్. బి. ఆర్. అంబుసోలి

★ భర్త చనిపోయేక భార్యకి గాజులు, మంగళసూత్రం బొట్టు తీసేయాలంటారు. కారణం ఏమిటి?

● కారణం కాదు- అడగవలసింది- యీ ఆటవికానందానికి కారణం ఏమిటి అనాలి. భర్తపోయి సగం చచ్చి బాధపడుతున్న ఆడదాన్ని యింకా హింసించడానికీ చర్యలు... అసలు యివన్నీ వుండీ వాటికి విలువ నివ్వని వారినేం చేయలేని- చుట్టాలూ పక్కాలూ- వీటికి విలువనిచ్చే వారిని మానసికంగా హింసిస్తారు..... నా కిలాంటి క్రూరమైన సంప్రదాయాలంటే అసహ్యం. నేను గాజులు వేసుకోను; మంగళ సూత్రం వేసుకోను. అయినా నాకు వివాహ వ్యవస్థ మీద మొక్కవోని నమ్మకం వుంది..... నేనిదివరకు బొట్టు కూడ ఎక్కువ పెట్టుకునేదాన్ని కాదు- కొన్నేళ్ల క్రిందట శ్రీమతి భానుమతిగారు కోప్పడి పెట్టి- అలవాటు చేశారు. అప్పటినించే అలవాటై పోయింది. సంప్రదాయం అర్థం బాధ పెట్టడంకాదు. మనసుని గాయపరచిన విషయాలని జ్ఞాపకం చేయకుండా వుండడం కూడా అని మనం అర్థం చెప్పుకోవాలి. అయినా ఎన్నో ఉండగా మీ రెప్పుడూ ఇదే ప్రశ్నవేస్తారెందుకు? ఏ పెళ్ళిలో యాభై కార్ముతి చంపిపుంటా!

### ఎస్. ఎస్. వేములవాడ

★ సైన్సు అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో చేతబడులు, క్షుద్ర శక్తులు ఉన్నాయని విద్యార్థికులు సైతం వాదిస్తుంటారు. ఎందుకు? వీళ్లు ఇటువంటివి నమ్ముతారా?

● పిరికితనం చేత! ఏమో ఏ పుట్టలో ఏ పాముందో నన్న... భయంచేత! ఈ పిరికితనానికి, భయానికి కారణాలుండవు. చదువుకి విజ్ఞానానికి వీటికి సంబంధం వుండదు. హేమా హేమీలనదగ్గ శాస్త్రవేత్తలు తమకు తెలియక నా బాబాలను కొలవడం?!

### ఎస్. పి. కె. వేములవాడ

★ ఈ నాటి రచయితలు రచయిత్రులు తమ రచనల్లో ఎక్కువ భాగం ప్రేమ గురించి రాస్తున్నారు. సంఘంలోని కుళ్ళుని బయటికి లాగడానికి ప్రయత్నించరేం?

● ఆ పని సినిమాలు చేస్తున్నాయంటున్నారుగా!!

### సి. ఆర్. బి. జిల్లేడుపల్లి

★ జీవితంలో మరవురానిది ఏది?

● చేసిన అప్పు!

★ ఆడవారి నోట నువ్వుగింజ నానదంటారు- మరి మగవారి నోట?

● ఎవరి నోటేనా నువ్వు గింజ నమలవలసిందే కాని నానవలసింది కాదు.

★ మీరు శాఖాహారులా! మాంసాహారులా?

● తిండిలో శుద్ధ శాకాహారిని!

### జి. వి. ఆర్. విజయవాడ

★ మీకు జీవితం చూస్తుంటే ఏమనిపిస్తుంది.

● జీవితం ఎంత చిన్నదో అంతకంత సున్నితమైనది కాబోలు అనిపిస్తుంది.

### జి. ఆర్. కె. గోదావరిఖని.

★ సృష్టిలో తీయనిది స్నేహం అంటారు కదా - మరింక దానికి మించిన దేమైనా వుందా?

● లేదు. మంచి స్నేహాన్ని మించినదేం లేదు.

### ఎన్. ఆర్. బి. హైదరాబాద్

★ మరో పది హేను సంవత్సరాల తరవాత పురుషుల సంఖ్య తగ్గి స్త్రీల సంఖ్య అధికంగా వుంటుంది. అప్పుడు ఎంచక్కా ఒకడికి ముగ్గురేసి భార్యలుంటారు. ట్రిబుల్ కట్నాలు కొట్టవచ్చు. ఆడవాళ్లని చెప్పుచేతల్లో వుంచవచ్చు.

● సిగ్గు లేకపోతేసరి! తాళికట్టకుండా ఎందరు భార్యలున్నా మగవాళ్లకి గొప్పేకద! అందులోనూ సంపాదించే ... ంటే యింకా హాయి! ఏమంటారు?' ... చించే మీ లాంటి వాళ్ళు ఉన్నంత వర... ఎల్లలు 'పెళ్ళో రామచంద్రా' అని అఘోరించడం మాన నంత వరకు- పరిస్థితులు మారవని మీ మాటలు చెప్పక చెప్తున్నాయి.

★ మీ ఆడవాళ్లను చూస్తే నాకు ఒళ్ళు మంట- ఒక్క విషయంలోనూ నిజం చెప్పరు.

● ఏం? మీకు కట్నం, పెళ్ళాంతో పాటు కిరసనాయిలు డబ్బా యివ్వలేదా!!

★ ఎందుకో మిమ్మల్ని అత్తయ్య అని పిలవాలని ఉంది. మీకు అభ్యంతరమా?

● అభ్యంతరంన్నర రమేష్ బాబూ, అర్థమైన వాళ్లు నన్ను అత్తయ్య అంటే నాకు ఒంటికి కారం రాసుకున్నట్టు వుంటుంది. అందులోనూ నీలా సంకుచితంగా ఆలోచించే వాళ్లు. □






# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

**కె పాండురంగారావు, కైకలూరు, కృష్ణాజిల్లా**

ప్ర నాకు రొమ్ము పడిశము, దగ్గు, జలుబు

జ మీరు బైద్యనాథ్ శ్రంగ్ భస్మ 6 గ్రాములు, 6 గ్రా హర్తాళభస్మ్, 6 గ్రా అకీక్ పిష్టి ఇవి అన్ని కలిపి 30 పొట్లాలు చేసుకోగలరు ప్రతి ఒక్క పొట్లము ప్రొద్దున, సాయంత్రము తేనెతో తీసుకోగలరు భోజనం తరువాత బైద్యనాథ్ అర్జునారిష్ట 2 స్పూనులు మరియు 2 స్పూనులు ద్రాక్షారిష్ట రోజుకు రెండుసార్లు వాడాలి ఇలా రెండునెలలు చేయాలి

**పి. వెంకటేష్, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్; బి రామకృష్ణ, మహబూబ్‌నగర్; రాజశేఖర్, అనంతపురం.**

ప్ర సెక్సు సంబంధమైన బలహీనత ఉన్నది వీర్యము త్వరగా వెళ్ళిపోతుంది

జ మీరు బైద్యనాథ్ వీటా- ఎక్స్ మాత్రలు ఒక్కొక్కటి ప్రొద్దున రోజుకు రెండు సార్లు నీళ్ళతో వేసుకోవాలి మరియు బైద్యనాథ్ బసంత్ కుసుమాకర్ రస్ మాత్రలు ఒక్కొక్కటి పాలతో 40 రోజులు వేసుకోవాలి ఆహారము పుష్టికరమైనది తీసుకోవాలి

**జి దేవి, ముమ్మిడివరం**

ప్ర నాకు 5 సంవత్సరముల నుండి తెల్ల బట్ట అవుతున్నది

జ భోజనము తరువాత 3 స్పూనులు బైద్యనాథ్ సుందరి కల్ప్‌ఫోర్ట్ మరియు 1 మాత్ర ల్యూకోనిల్ నీళ్ళతో రోజుకు రెండు సార్లు తీసుకోవాలి బైద్యనాథ్ పత్రంగాశవ్ ప్రొద్దున సాయంత్రం 3 స్పూనులు ప్రొద్దున నీళ్ళతో వేసుకోవాలి ఇలా 40 రోజులు చేయాలి

దొరుకు స్థలము ఇ ఎం. శర్మ అండ్ సన్స్, కెమిస్ట్ అండ్ డ్రగ్గిస్ట్, ముమ్మిడివరం.

**మల్లంపల్లి భాస్కరాంబ, ఏలూరు; ఆకునూరు శ్రీ శైలజ, విశాఖపట్నం**

ప్ర విపరీతమైన తల నొప్పి, తల తిరుగుట, తల బరువు అగుట.

జ మీరు బైద్యనాథ్ చంద్రామృత్ రస్ ఒక్కొక్క మాత్ర రోజుకు ఒక్కసారి నీళ్ళతో వేసుకోవాలి. తలనొప్పి సమయంలో బైద్యనాథ్ బామ్ పెట్టుకోవాలి మాత్రలు 40 రోజులు వాడాలి మీరు ఏవిధమైన చింత చేయకూడదు

**యస్.కె. రవూఫ్, ఇల్లందు; పి. అప్పారావు, ఖరగ్‌పూర్; ఎం. లక్ష్మినారాయణ, తదితరులు**

ప్ర శీఘ్ర స్ఖలనము, రతిసుఖము లేకపోవుట, చిన్న వయస్సులో దురలవాటుచే బలహీనతలు

జ బైద్యనాథ్ విటాఎక్స్ టాబ్లెట్స్ రోజు రెండుసార్లు బైద్యనాద్ చ్యవనప్రాశ స్పెషల్ పాలతో వాడవలెను రాత్రి పడుకోబోవునపుడు బైద్యనాథ్ స్వర్ణ మకరధ్వజ మాత్ర ఒకటి పాలతో, బైద్యనాద్ అశ్వగంధారిష్ట భోజనము తరువాత రోజు రెండు సార్లు వాడాలి

**వై. కేశవరావు, దోహా- కత్తార్ (అరేబియా), డి. లక్ష్మి, పాటిగడ్డ కాలనీ, సికిందరాబాద్-**

ప్ర తలవెంట్రుకలు ఊడిపోవుట, తెల్లబడుట

జ బైద్యనాథ్ మహాభృంగరాజ్ తైలం (మెడికేటెడ్) తలనూనెగా వాడవలయును శికాకాయిని తలస్నానమునకు ఉపయోగించవలయును నెత్తిపై ఎక్కువగా వేడి నీటిని పోయరాదు

**వింత చినమంగారెడ్డి, తేలప్రోలు**

ప్ర అతి మూత్రము

జ బైద్యనాథ్ బహుమూత్రాంతక రస ఉదయం సాయంత్రం ఒక మాత్ర చొప్పున వాడండి బైద్యనాథ్ వసంత కుసుమాకర రస 1 మాత్ర రాత్రి పాలతో వాడండి

**యస్. ఉషాకుమారి, భీమవరం**

ప్ర మూత్ర సంబంధమైన వ్యాధి

జ బైద్యనాద్ సుందరీకల్ప ఫోర్టు విడవకుండా రోజు రెండుసార్లు 3 చెంచాల మందు సమభాగము నీటితో కలిపి వాడండి 2 నెలలు వాడాలి

**ఎన్. బాచేశ్వరరావు, బెరహంపూర్.**

ప్ర డయబీట్‌సుకు ఔషధములు

జ బైద్యనాద్ మధుమేహారియోగ్ 1 మాత్ర ఒకపూట, బైద్యనాథ్ బసంత కుసుమాకర రస ఒకపూట వాడవలయును చక్కెర పదార్థములు వాడరాదు బైద్యనాథ్ విటా- ఎక్స్ గూడా వాడవచ్చును

**కె. వి రమణ, కాశీబుగ్గ; పి. సి. శేఖర్, కాకినాడ**

ప్ర ఆయాసం, దగ్గు, కఫం, పిల్లికూతలు.

జ బైద్యనాథ్ శ్వాస కురారం మాత్రలు రోజు రెండుసార్లు ఉదయం సాయంత్రం వేడినీటితో వాడండి భోజనం తరువాత బైద్యనాథ్ పిప్పల్యాసవ రెండు చెమ్చాలు సమభాగం నీటితో రోజుకు రెండు సార్లు వాడాలి పడని వస్తువులు వాడరాదు

**జె. సుబ్రహ్మణ్యశాస్త్రి, జక్కరకుప్పం (కర్నాటక); చెంగల కృష్ణమూర్తి, లింగన్నపాలెం**

ప్ర అజీర్ణము, పులితేనుపులు, కడుపులో మంట

జ బైద్యనాథ్ సూతశేఖర రస నెం 1 రోజుకు ఒకసారి తేనెతో వాడుతు బైద్యనాడ్ లఘు సూతశేఖర రస 2 మాత్రలు చొప్పున రోజు రెండుసార్లు మంచినీటితో వాడవలెను భోజనం తరువాత బైద్యనాథ్ శారిబా ద్యాసవ రోజుకు రెండుసార్లు 3 చెంచాల మందు సమభాగము నీటితో కలిపి వాడాలి

**బి. శారద, రెడ్‌హిల్స్, హైదరాబాద్**

ప్ర గుండె దడ, కాళ్ళు చేతులు పీకుట, భయము

జ. బైద్యనాథ్ సుందరీకల్ప ఉదయం సాయంత్రం రెండు చెమ్చాలు సమభాగము నీటితో బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషలు పాలతో రోజు రెండుసార్లు వాడండి మంచి ఆహారము, విశ్రాంతి అవసరము.

**సి. శ్రీధర్, జి. సునిల్‌కుమార్, తాడిపత్రి**

ప్ర లావు కావటానికి మందు

జ. బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్ రోజు రెండుసార్లు పాలతో సేవించవలయును మంచి పుష్టికరమైన ఆహారము తీసుకొనవలయును ☐

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

ప్రశ్న

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :

# సినిమా విశేషాలు

–జి.వి.జి.

## "దొంగోడొచ్చాడు"లో దొంగ ప్రేమ

కృష్ణ (కృష్ణను అకస్మాత్తుగా చూడగానే భజగోవిందం (గొల్లపూడి మారుతీరావు) తృళ్ళి పడినా – వెంటనే తమాయించుకుని, "నువ్వా బాబూ కృష్ణా?" అని పరుగున దగ్గరికెళ్ళి కావలించుకుని, "బాబూ, కృష్ణా! నువ్వెన్ని సార్లు నాకు కలలోకి వచ్చావో తెలుసా? ఒక్కొక్క సారి ఒక్కొక్క రకంగా ... చిలిపి కృష్ణుడి లాగా, దొంగ కృష్ణుడి లాగా..." అంటూ లేని ప్రేమను ఒలుకబోసుకున్నాడు.

కృష్ణ నాలుగాకులు ఎక్కువే చదివాడు. అంచేత "నువ్వూ అంతే మావయ్యా! తోచనప్పుడల్లా నా కలలో కొస్తూండేవాడివి.. శకుని మామలాగా ... కంసమామలాగా..." అన్నాడు.

"ఏది ఏమైనా – ఇంత కాలానికి నువ్వొచ్చావంటే, నాకు ఆనందంతో చిందులేయాలనిపిస్తోందిరా!"

"కాని, ఇంత వయసొచ్చిన వాడివి – చిందులేస్తే అంత బావుండదు మావయ్యా!"

మేనమామ, మేనల్లుళ్ళ సరసాలకు అటొచ్చిన లక్ష్మి (జయంతి) ముక్కున వేలేసుకుంది.

కోడి రామకృష్ణ దర్శకత్వంలో ఘట్టమనేని విజయలక్ష్మి, పి. జనార్ధనరావు నిర్మించిన శ్రీ మూవీస్ "దొంగోడొచ్చాడు" చిత్రం ఎన్. రామలింగేశ్వరరావు సమర్పణ. ఫిబ్రవరి విడుదల.

---

**మనం ఫిల్మోత్సవ్‌లో చూసిన సినిమా నువు కాపీ కొట్టడానికి నిశ్చయించుకున్నావా? అయితే ఆపు! నేను అప్పుడే మొదలు పెట్టి ఒక రీలు తీసేసాను కూడా!**



"నమ్మిన బంటు" రజని, మురళీమోహన్

## శ్రీ ఎన్. టి. ఆర్, శ్రీ మీనన్‌లకు యార్లగడ్డ వెంకన్న చౌదరి అవార్డులు

వివిధ రంగాలలో నిరుపమానమైన సేవలు చేసిన ప్రముఖులకు జాతీయ స్థాయిలో యార్లగడ్డ వెంకన్న చౌదరి స్మారక అవార్డ్‌ను ప్రదానం చేయడానికి వారి తనయుడు శ్రీ శంభుప్రసాద్ నిర్ణయించిన విషయం పాఠకులకు విదితమే. ఈ ఏడు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావుకు, సాంకేతిక రంగంలో విశిష్టమైన కృషి **చేసిన ప్లానింగ్ కమిషన్ సభ్యుడు శ్రీ ఎం. జి. కె. మీనన్‌లకు ఆ అవార్డు ప్రదానం 1987 ఏప్రిల్ 6న వెంకన్న చౌదరిగారి వర్ధంతి సందర్భంగా మద్రాసు మ్యూజిక్ అకాడమీ హాలులో అత్యంత వైభవంగా జరుగుతుంది. తండ్రిగారి సంకల్పాన్ని నెరవేరుస్తున్న** శంభుప్రసాద్ ఎంతైనా **అభినంద నీయులు.**

## 'నవత' కృష్ణంరాజు చిత్రాలు

"ఇద్దరు స్నేహితులకు సంబంధించిన కథ ... నవత రమణ మూవీస్ బానర్‌లో ఫిబ్రవరి మొదటి వారంలో సెట్స్‌కు వెళ్లే ఈ చిత్రం నా సమర్పణ. కె. ఎం. సుబ్బారాయుడు, ఎన్. అచ్యుతరామరాజు నిర్మాతలు. కృష్ణమోహన్‌రెడ్డి డైరెక్టరు. మా నవత బానర్‌లో నేను నిర్మించే చిత్రంలో జంధ్యాల దర్శకత్వంలో కమలహాసన్ తొలిసారిగా నటిస్తారు. జూన్, జూలై ప్రాంతాల్లో షూటింగ్ ప్రారంభమవుతుంది," అని తెలియజేశారు ఎన్. కృష్ణంరాజు.

## చంద్రమోహన్, పూర్ణిమ "చిలిపి దంపతులు"



## రచయిత సత్యానంద్ దర్శకత్వంలో శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "ఝాన్సీరాణి"

"నేటి సమాజంలో అబలలకు జరిగే అన్యాయాలకు ఎదురునిలిచి, భీరత్వం నీడలో నిద్రిస్తున్న అమాయకురాళ్లను జాగృతం చేసి, మహిళాభ్యుదయం కోసం పోరాడే ఓ సాహస నారి గాథ. మల్లాది వెంకటకృష్ణమూర్తి నవల "మిస్టర్ వి" ఆధారం", అన్నారు సత్యానంద్. ఈయనరచన, దర్శకత్వంలో మిద్దే రామారావు నిర్మిస్తున్న "ఝాన్సీరాణి" చిత్రంలో భానుప్రియ నాయిక. రాజేంద్రప్రసాద్, కోట శ్రీనివాసరావు, వేలు, వీరభద్రరావు ప్రభృతులు ఇతర పాత్రలు పోషిస్తున్నారు. చక్రవర్తి సంగీతం, డి. డి. ప్రసాద్ ఛాయ, పి. సాయికుమార్ శిల్పం. ఎన్. వెంకటేశ్వరరావు-ఉదయ్ ప్రొడక్షన్, డి. వెంకటరత్నం కూర్పు, సలీం నృత్యాలు, వై.కాశీ విశ్వనాథ్ సహకార దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

## కృష్ణ దర్శకత్వంలో ఆయన రెండో కుమారుడు మహేష్ నటించే చిత్రం

"మా బావగారితో పాటు పన్నెండేళ్ల ఆయన రెండవ కుమారుడు మహేష్ కూడా ప్రధానపాత్ర నిర్వహిస్తాడు. మే మాసం నుంచి షూటింగ్", అన్నారు యు. సూర్యనారాయణబాబు. ఈయన నిర్మించే శ్రీ పద్మావతీ ఫిలిమ్స్ చిత్రానికి పరుచూరి సోదరుల రచన, బప్పీలహరి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ తెర వెనుక హంగులు. సమర్పణ. దర్శకత్వం : కృష్ణ.

## పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో జయప్రద సమర్పించే "రాకీ"

"హీరోగా పరిచయమవుతున్న మా చిన్న తమ్ముడు శ్రీరామ్‌కుమార్‌కు మెడిసిన్ చదువుతున్నప్పట్నుంచి నటుడు అవ్వాలని ఆశ. హీరాలాల్ మాస్టర్ వద్ద డాన్స్‌లో, స్వామి మాస్టర్ వద్ద ఫైట్స్‌లో ఆరు మాసాలపాటు శిక్షణపొందాడు," అన్నారు జయప్రద. ఈమె సమర్పించే జయప్రద ఫిలిమ్ సర్క్యూట్‌వారి "రాకీ" చిత్రానికి అదే పేరుగల హిందీ హిట్ చిత్రం మూలం. ఈ చిత్ర దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి "ఒరిజినల్ పిక్చర్‌లో లేని అక్కా తమ్ముళ్ల అనుబంధాన్ని కొత్తగా కలిపాం. సంజయ్



"శ్రుతి లయలు"లో డా. రాజశేఖర్, సుమలత

పాత్రను శ్రీరామ్‌కుమార్, నాయిక టినామునీమ్ పాత్రను బొంబాయి నటి సుపర్ణ, రీనారాయ్ పాత్రను జయప్రద, శక్తికపూర్ పాత్రను జయప్రద మరో సోదరుడు రాజ్‌బాబు ధరిస్తున్నారు. జనవరి నుంచి ఏప్రిల్ వరకు ప్రతి నెలలోనూ మొదటి పది రోజులు షూటింగ్," అన్నారు. ఇంకా సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, కోట శ్రీనివాసరావు, సుజాత, రమాప్రభ, మాస్టర్ సిద్ధార్థ కూడా నటిస్తున్నారు. ఆర్. డి.బర్మన్ స్వరకల్పనలో ఆత్రేయ, వేటూరి గీతాలు రాశారు. పి. దేవరాజ్ ఛాయ, రంగా శిల్పం, శ్రీనివాస్ నృత్యాలు, స్వామి సాహసాలు, ఆర్. బి. కృష్ణ ప్రొడక్షన్, మన్నె రాధాకృష్ణ సంయుక్త దర్శకత్వం, గౌతంరాజు కూర్పుతో నీలవేణి కృష్ణ, సౌందర్య నిర్మాతలు. గణేష్‌పాత్రో సంభాషణలకర్త.



# అభినేత్రి భానుప్రియ సమాధానాలు

**ఇమ్మనేని వరపరాజులు**

ద్వంద్వార్థాలు వచ్చే మాటలు పాటలు తగ్గిపోయి మంచి కళాఖండాలు అనదగ్గ పూర్వ స్థాయి చిత్రాలు రావాలంటే నిర్మాతలు తమ కూతుర్లని సినీరంగ ప్రవేశం చేయిస్తే సరిపోతుందని నా అభిప్రాయిం మీరు ఏకీబవిస్తారా?

ఏకీభవిస్తాను.

**యు వి. రామయోగి, విజయవాడ**

ఈనాటి నాయికలు నాటి నాయికల కంటే పై స్థాయిలో ఉన్నారా? ఇంకా దిగువనే ఉన్నారా?

నాకు తెలియదు.

**యు. శివప్రసాద్, మాచవరం**

మీ నట జీవితానికి మార్పు తెచ్చిన చిత్రమేది?

సితార నా నట జీవితానికి మార్పు తెచ్చింది.

**వి ఎస్. బి. ఎస్. జోన్స్, పెదపాడు**

మీకు నేను మొదటిసారిగా ప్రశ్న పంపుచున్నాను నాకు ఏమి వ్రాయాలో తెలియదు

నాకూ ఏం చెప్పాలో తెలియడం లేదు.

**ఎం. డి నఫీస్, ఎల్లందు**

అక్కయ్యా! సమాజంలో స్త్రీకి కొన్ని. అర్హతలున్నాయి కదా! అవి తెలిపి, వాటిపై మీ అభిప్రాయం తెలుపండి

ఆ అర్హతలు చెప్పేపాటి వయసూ – అనుభవం లేవు నాకు

**కె. పి. వెంకటరమణ, విజయవాడ**

ఈ నాటి కొత్త సినిమాలు రిలీజు అయిన ఒక వారం మాత్రమే హవుస్ ఫుల్ అవుతాయి అదే పాత సినిమాలు రిలీజు అయిన తర్వాత చాలా రోజులు హవుస్‌ఫుల్ అవుతాయి దీన్ని బట్టి చూస్తే చిత్ర పరిశ్రమ ముందుకు సాగుతోందా? మీ సమాధానం?

సాగుతూనే వుందిగా!

**కె. జి. రాజన్, జగిత్యాల**

ఒక మనిషి ఎంతగానో ఎదిగిపోవాలన్నా – వారి వెనుక ఎవరిదన్నా ప్రోత్సాహకమో లేక పరిస్థితులో కారణం తెల్పుతాయి మరి మీ విషయంలో ?

మా అమ్మగారి ప్రోత్సాహం, నా వుత్సాహం కారణం.

**కాజ సుమతి, విజయవాడ**

ఈనాటి చిత్రాలు నాటి చిత్రాలకన్నా పైస్థాయిలో ఉన్నాయా, దిగువ స్థాయిలో ఉన్నాయా?

కొన్ని పైస్థాయిలో – మరి కొన్ని దిగువ స్థాయిలో.

## ఉత్తమ ప్రశ్న

**ఎస్. శారదాదేవి, విశాఖపట్నం**

ఎలాంటి పాత్రలకు ప్రాదాన్యత ఇస్తున్నారు? ఏవయినా పాత్రల మీద ప్రత్యేకమైన అబిమానం ఉందా? అలాంటిది ధరించాలని అనుకుంటున్నారా?

అశ్లీలత – అసభ్యత లేని ఏ పాత్రైనా నాకిష్టం.

**ఎస్. మహబూబ్‌షా ..దనపల్లె**

మీ పాపులారిటీ పెంచుకోడానికి ఇలా ప్రశ్నా సమాదానాల శీర్షికలో ప..ంటున్నారా?

మీ పేరు పేపర్లో పడడం కోసం ఈ ప్రశ్న వేశారా?

**ఎన్. నందకుమార్, ప్రొద్దుటూరు**

అక్కా! భరతనాట్యం, కూచిపూడి నృత్యాలలో మిమ్మల్ని మించిన వారు లేరంటాను. కాదంటారా?

నన్ను మించిన వారు వున్నారంటాను.

**ఎన్. సుందరరాజన్, ఐరాల**

"చిరంజీవి" చిత్రంలో మొదటిసారిగా గుడ్డిదాని పాత్రలో నటించినప్పుడు మీరెలా ఫీలయ్యారు?

గుడ్డిదానిలా – కళ్ళు లేకపోడం ఎంత దురదృష్టమో తెలిసింది.

**వి. సీతారామరాజు, విస్సాకోడేరు**

ఒక చిత్రం విజయవంతమవడానికి తెరవెనుక పాటల రచయితలు గాని. గాయనీ గాయకులు గాని ఎంత వరకు దోహదకారులు?

ఫిఫ్టీ – ఫిఫ్టీ.

**ఎం. ఎస్ విఠోబా, రాయచూరు**

ఆడవాళ్ళు కబుర్లు చెప్పుకోడానికి ఎందుకు ఉత్సాహపడతారు?

ఏం? మగవాళ్ళు మాత్రం ఉత్సాహపడరా?!

**ఎస్. అనూరాధ, ఒంగోలు**

అక్కయ్యగారూ! మీ ఉద్దేశ్యంలో ఉత్తమ ప్రశ్న అంటే ఎలా ఉండాలో చెప్పరూ, ప్లీజ్!

అమ్మో! సీక్రెట్! చెప్పను!

**ఎన్. మనోజ, పోలవరం**

అక్కయ్యా! మీరు 1987 లో ఉత్తమ నటిగా ఎన్నిక కావాలని నా కోరిక ఇది తీరుతుందంటారా?

తీరవచ్చు.

**ఎ. సుధాకర్, బరంపురం–2**

భానుప్రియగారూ! మీరు ప్రతి సినిమాలో బరత నాట్యం ఆడుతున్నారు మీకు బరతనాట్యమంటే ఇష్టమా!

నాకు నాట్యమంటే యిష్టం. □

కూపన్.

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## భానుప్రియ సమాధానాలు

ప్రశ్న: ______________________

______________________

______________________

పంపిన వారి పేరు ______________________

పూర్తి చిరునామా ______________________

______________________

# అభిమాన తారలపై అభిప్రాయం

జయసుధగారు నా అభిమానతార అని చెప్పు కొనుటకు నేనెంతో సంతోషిస్తాను, గర్విస్తాను.

'పండంటి కాపురం' చిత్రం ద్వారా తొలిగా వెండి తెరకు పరిచయమైనది జయసుధ. 'జ్యోతి' చిత్రం లోని ఆమె నటనకు స్పందించని ప్రేక్షకులుండరు. అహంభావిగా 'సత్యభామ' చిత్రంలో ఆమె నటించిన తీరు ఎందరో ప్రేక్షకుల నాకర్షించింది. 'ఆది



దంపతులు' చిత్రంలో ప్రారంభంలో బాధ్యతా యుతమైన వదినగా త్యాగమయి పార్వతి పాత్రను కూడా అవలీలగా పోషించి పూర్తి న్యాయం చేకూర్చారు శ్రీమతి జయసుధగారు. అంతేకాక 'శ్రీమతిగారు' 'ఆక్రందన' 'భార్యామణి' 'జీవిత నౌక' వంటి చిత్రాలలో విభిన్న తరహాల పాత్రలను పోషించి తన నటనా సామర్థ్యముతో ఎందరో ప్రేక్షకుల హృదయములను దోచుకున్న మేటి అగ్ర కథా నాయిక జయసుధ. ఈ కీర్తి ప్రతిష్టలు ఇలాగే ఆమెకు చిరస్థాయిగా నిలవాలని కోరుతూ.....

–ఎం. వాణి, దర్శి

★ ★ ★

యావత్ భారత దేశము గర్వించ తగ్గ నటి జయప్రద. ఆమె నవ్వితే నవరత్నాలు ఒలికినట్లు వుంటుంది. ఆమె అందానికి వన్నె తెచ్చే ఆ నవ్వుకే నేను ఆమె అభిమానిని అయ్యాను. సిరిసిరిమువ్వ, అంతులేని కథ, సాగరసంగమం ఆమెలోని మహా నటిని వెలికి తెచ్చాయి. సృష్టిలో ఎన్ని పువ్వులు వున్ననూ దేవుని పూజకు నోచుకున్నవి కొన్ని పువ్వులు



మాత్రమే. అలాగే సినీ పరిశ్రమలో ఎంతమంది హీరోయిన్లు వున్ననూ నటనకే భాష్యం చెప్పే నటి జయప్రద మాత్రమే. ఆమె లాయర్, విప్లవ కారిణి పాత్రలలో నటిస్తే చూడాలని వుంది. హిందీ పరిశ్రమకు ప్రాధాన్యత యిస్తూ తనను నెం. 1 స్థాయికి చేర్చిన తెలుగు పరిశ్రమను నిర్లక్ష్యం చేయవద్దని నామనవి.

–కె. ప్రియ, తణుకు

నా అభిమాన హీరో అందాల నటుడు, వరుసగా తొమ్మిది సార్లు "ఉత్తమ నటుడుగా" ఎన్నిక కాబడ్డ శ్రీ నటభూషణ్ శోభన్ గారంటే నాకెంతో అభిమానం. ఎందుకంటే, ఆయన చిత్ర సీమలో మరొకరితో పోల్చదగిన వ్యక్తి కాదు. ఎప్పుడూ ఆయన తత్వం ఆయనదే, ఆయన బాణీ ఆయనదే, ఆయన నటన ఆయనదే. ఈ విధంగా తెలుగు చిత్ర సీమలో ఆయనకు వారసుడుగా మరొకరు లేరు. అందుకే



(నాదృష్టిలో) ఆయన చిత్ర సీమలో అరుదైన మనిషి. చిత్ర సీమలో ఎన్ని గొడవలు, ఎన్ని రాజకీయా లున్నా, అవేమీ ఆయనకు అంటవు. ఇంకా ఇలాంటి ఎన్నో మంచి గుణాలున్నాయతనిలో. ఎలాంటి పాత్ర నైనను అవలీలగా పోషించే శ్రీ నటభూషణ్ గారికి అభిమానిగా ఆయనకు నేనిచ్చే సలహా ఏమిటనగా– చాలా ఎక్కువ స్థాయిలో కథాబలం గల చిత్రాలలో మాత్రమే నటించాలని నామనవి.

–కేతా వెంకటేశ్వరరావు, కొండపల్లి

★ ★ ★

కరాటే కింగ్ సుమన్ నా అభిమాన నటుడు. "నేటి భారతం" చిత్రం లోని అతని నటనకు ముగ్ధురాలినై అతని అభిమానిని అయ్యాను. సుమన్ అంటే నాకు మాటలలో వర్ణించ లేనంత ఇష్టం. నాటి "ఇద్దరు కిలాడీలు" చిత్రం నుంచి "ఛాదస్తపు మొగుడు" చిత్రం వరకు ఎన్నో విభిన్న పాత్రలు ధరించి నటనలోను, ఫైట్స్‌లోను తనకంటూ ఒక ప్రత్యేక



స్థానాన్ని ఏర్పరచుకున్న నటుడు సుమన్. సుమన్ నటించే ప్రతి చిత్రమూ వెరైటీగా ఉండాలని నా అభిప్రాయము. సుమన్ న్యాయవాదిగా నటిస్తే చూడాలని ఉంది. సుమన్ గారు స్టెప్స్ విషయంలో జాగ్రత్త వహించి, ఇంకా బాగా వెయ్యాలి. మంచి కథాబలం ఉన్న చిత్రాలలో నటించి, అభిమానుల గుండెల్లో చిరస్థాయిగా మిగిలి పోవాలని ఆయన అభిమానిగా నేను కోరుకుంటున్నాను.

–ఎం. రేవతి, తిరుపతి

మేనరిజమ్స్ ప్రదర్శన నటనగాను, స్టీరియోటైప్ యాక్షన్– మహానటన గాను చెలామణి అవుతున్న ఈ రోజుల్లో సెల్యులాయిడ్ నటనకు "ఆధునికత"ను సంతరించి పెట్టి ఓవర్ యాక్టింగ్ నుండి విముక్తి కలిగించిన మహానటుడు కమల్ నా అభిమాన హీరో. దక్షిణ ఉత్తర భాషలందు తన సహజ నటనతో అన్ని వర్గాల ప్రేక్షకులను ఆకట్టుకొన్న కమల్ నిజంగా



బహుముఖ ప్రజ్ఞుడు. జాతీయ, రాష్ట్ర అవార్డులతో పాటు ఎన్నో ఇతర సంస్థల నుండి సన్మానాలు పొందుటలో సరికొత్త రికార్డు సృష్టించారు. ఎంతటి క్లిష్టమైన పాత్రనైనా సరిగా అర్థం చేసుకొని అవసరమయినంత చక్కగా ప్రాజెక్ట్ చేసి ఆ పాత్రల్లో జీవించి న్యాయం చేకూర్చడంలో ఆరితేరిన నటుడు కమల్. ఈ యేటి మేటి ఉత్తమ చిత్రం "స్వాతిముత్యం" ఆస్కార్ అవార్డ్ పోటీకి ఎన్నిక కావడం కమల్ కీర్తి కిరీటానికి ఒక కలికితురాయి. ఇటువంటి నా అభిమాన హీరోకి ఇంకా ఎన్నో జాతీయ అంతర్జాతీయ అవార్డులు రావాలని కోరుతున్నాను.

– మార్పెట్టి సురేష్‌కుమార్, బొబ్బిలి

★ ★ ★

నేను చిరంజీవి అభిమానిని. ఖైదీలో అతని నటనను చూచి నేను అభిమానిని అయినాను. చక్కని నటనా, ముచ్చటగొలిపే రూపం, అన్నిటినీ మించిన హావభావ ప్రకటన, దీనికి తోడైన ఫైట్లు చేయగల సామర్థ్యం చిరంజీవిని నేడు మంచి నటుడుగా



నిలబెట్టాయి అంటే అతిశయోక్తి కాదు. ఇప్పటి వరకు విలన్ మొదలుకొని హీరో మరియు హాస్య పాత్రలు సైతం అవలీలగా పోషించి దేనికదే సాటి, అన్నిట్లోనూ మేటి అని నిరూపించుకొన్న చిరంజీవి పౌరాణిక పాత్రలలోను, జానపద పాత్రలలోనూ నటిస్తే చూడాలని ఉంది.

–కె. సీతారామాంజనేయులు,
కేదారేశ్వరపేట, విజయవాడ □

"మరణశాసనం"లో కృష్ణంరాజు, శోభన

"కార్తీకపౌర్ణమి"లో రాధిక



## "త్రిమూర్తులు" మూడవ షెడ్యూల్

"నవంబర్ షెడ్యూల్ హైదరాబాద్, మద్రాస్‌లలో జరిగింది. డిసెంబర్ షెడ్యూల్ రెండు యూనిట్‌లు, మూడు కెమెరాలతో తొమ్మిది రోజుల పాటు మద్రాసులోనే జరిగింది. వెంకటేశ్‌తో బొంబాయి ఫైటర్ బాన్ క్రిష్టో, రాజేంద్రప్రసాద్‌తో ఒక చైనీస్ ఫైటర్ కరాటే పోరాటాలను స్టంట్ మాస్టర్ విజయన్ గగుర్పాటు కలిగించే రీతిలో కంపోజ్ చేశారు. మూడవ షెడ్యూల్‌ను జనవరి 15న ప్రారంభించాం. ఫిబ్రవరిలో హాంకాంగ్‌లో షూటింగ్ ఏర్పాట్లను పేకేటి శివరామ్ గావించారు. ఏప్రిల్‌లో చిత్రీకరించ బడే ఒక పాటలో ప్రముఖ నటీనటులు పాల్గొనడం మరో విశేషం. ఏప్రిల్ చివరి వారంలో విడుదల." అన్నారు ఎ. శశిభూషణ్. ఈయన నిర్మాతగా టి. సుబ్బరామిరెడ్డి సమర్పించే మహేశ్వరి పరమేశ్వరి ప్రొడక్షన్స్ వారి "త్రిమూర్తులు" చిత్రంలో వెంకటేశ్, అర్జున్, రాజేంద్రప్రసాద్, శోభన, కుష్బూ, అశ్విని, రావుగోపాలరావు, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, నాగేష్, వేలు, సుధాకర్, వీరభద్రరావు, చిట్టిబాబు, భీమేశ్వరరావు, రమాప్రభ, సుమిత్ర, మణిమాల, విజయ, హిందీ నటుడు అనుపమ్‌ఖేర్ పాల్గొంటు న్నారు. ప్రయాగ్‌రాజ్ కథకు పరుచూరి సోదరులు మాటలు రాశారు. ఆత్రేయ, వేటూరి గీతాలను బప్పీలహరి స్వరపరిచారు. ఎస్. గోపాలరెడ్డి ఛాయ, రఘురాం నృత్యాలు, ఆర్. పద్మనాభన్ నిర్వహణ, విజయన్ సాహసాలు, నరసింహారావు కూర్పుతో కె. మురళీమోహనరావు దర్శకుడు.

## మోహనగాంధి దర్శకత్వంలో మహాలక్ష్మి పిక్చర్స్ కంబైన్స్ చిత్రం

"తెలివితేటలతోనో, డబ్బుతోనో, కుయుక్తుల తోనో సమాజంలో ముందుకు నెగ్గుకు రాగలమని మూడు పద్ధతులను విశ్వసించే ముగ్గురి కథ", అన్నారు మోహనగాంధి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శ్రీమతి ఆర్. మహాలక్ష్మీరావు నిర్మిస్తున్న మహాలక్ష్మి పిక్చర్స్ కంబైన్స్ చిత్రంలో రాధిక, అర్జున్, చరణ్‌రాజ్ ముఖ్య పాత్రధారులు. శరత్‌బాబు గెస్ట్ ఆర్టిస్ట్. ఆకెళ్ల కథకు పరుచూరి సోదరులు సంభాషణలు రాశారు. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. డి.ప్రసాద్‌బాబు ఛాయ, భాస్కరరాజు శిల్పం, సురేష్- సాయిసంయుక్త దర్శకత్వం, భాస్కర్ సహకార దర్శకత్వం, రాధాకృష్ణ ప్రొడక్షన్, గౌతంరాజు కూర్పుతో నంగునూరి శ్రీనివాసరావు నిర్మాణ సారథి. □




కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం **పి.సాంబశివరావు** నిర్మాత **జి.రాజేంద్రప్రసాద్**

మాటలు:కాశీవిశ్వనాథ్ సంగీతం:యం.యస్.విశ్వనాథం పాటలు:వేటూరి కెమెరా:యస్.నవకాంత్ ఎడిటింగ్:నాగేశ్వరరావు ప్రొడక్షన్:స్వామినాథన్

ఫాల్గుణ శుద్ధ ద్వాదశి. అహోబల నరసింహ స్వామి తిరునాళ్ళు జోరుగా సాగుతున్నాయి. నల్లమల కొండలు స్వామి పవిత్ర నామాలతో ప్రతిధ్వనిస్తున్నాయి.

"అంబల పొద్దుకే ఎండలు సురక్కి సురక్కిన కాలుచ్చాందయబ్బా-వొల్లును. పయిటేల ఆయితే బతుకుతాం?"

"ఒల్లంతా కరిగిపోతన్నెట్టుంది."

అబ్బా ఏమి ఎండలు? ఏమి ఎండలు!"



కొండల మధ్యగా చెట్ల సందుల్లో ఎగుడు దిగుడుల ఇరుకు దారి. ఆ దారెంట ఒకరి వెనుక వొకరు వెడుతున్నారు. పదిమంది జానపదులు.

అందరి భుజాలమీద చిన్న చిన్న మూటలున్నాయి. కర్రలకు తగిలించబడి. మరో భుజం మీద గొడ్డళ్ళున్నాయి.

ఎంత తాపాన్ని, నడక భారాన్ని మరవడానికి ఏవేవో వూసులు చెప్పుకుంటున్నారు.

ఒక యువకుడు జానపద గేయాన్ని అందుకున్నాడు. మంచి హుషారునిస్తోంది ఆ పాట.

"పాట శానా బావుందిరా సెవ్వన్నా!" యువకుడి ముందు నడుస్తున్న వృద్ధుడన్నాడు.

"నా పాటకన్నా పెద నాయనా! ఈ అడవే

బాగుంది".

"ఇదేం అడివిరా? పదేండ్ల కిందట గీన నువ్వు సూసిందే ఈ మాట అనో నివీగాదు".

"అట్టనా? మరి యామైంది అదంతా?"

"ఎనకా ముందు సూదకుండా నరికి పారేసిన్రు".

"గారదు రేంజరు కావిలి ఉన్నే?" ఆశ్చర్యంగ అన్నాడు.

"వాళ్లే లెక్కకు గడ్డి దిని అమ్ముకున్నేరు".

"అట్టనా పెదనాయనా! అందుకేనేమో కరువులు జాస్తైనయ్. అడివి వాల్లబ్బ సొమ్మా!"

"అడిగే దెవుడురా? బూమి దున్నుకోను నాగేలి తెచ్చుకుంటే కేసుబెడ్తరు. పెద్దోల్లు లారీల్తో సందనం టేకుమాన్లను తీసకపోతంటె వూరుకుంటరు"

బాధగా ఫీలయ్యాడు ఆ యువకుడు.

దారికి అటు ఇటు నిల్చున్న చెట్లు పండుటాకుల్ని జల జల రాలుస్తున్నాయి వాళ్ల మీద.

కాళ్ల క్రింద నలుగుతున్న ఎండుటాకులు నడకకు అనుగుణంగా తాళం వేస్తున్నాయి.

"పెదనాయనా! అదేంది??– రాల్లు కుప్పగా బోసి నడిదేల సంచుబెట్టిండ్రు".

సెప్పిన్న చూపించిన దిశగా చూశారంతరూ.

"ఒరె నాయాల! అదీ తెల్వురా?" ఎకసక్కెంగా అన్నాడు ఒకడు. "కుందేల్ల బోసురా సెప్పు నాయాలా!"

"యాంది ... యాందీ? ... కుందేల్ల ..."

"కుందేల్ల పట్టుకునె బోనురా అది. కుందేల్లు పట్టె మాయిన సంచుబెట్టి ఎనకే మూడు పైన రాల్లు గుట్టగా పెడ్తరు. కుందేలి లోపలికి దూరి దాదు కొరుక్కుతానె బెట్టు వూడి ముందున్నె బండ సందుకు అడ్డం పడ్తది" వృద్ధుడు విశదీకరించాడు.

"కుందేలుగాని జింకగాని సూజ్జామనుకన్నే కనపట్లేదే? పెద నాయనా!"

"ఇంగా ఎక్కడుండాయ్. లైటు యాటతో పిల్లను గూడా లేకుండా సేసిన్రు".

"అదెట్ట పెద నాయనా?" క్యూరియాసిటీగా అడిగాడు.

"అడవికి దూరంగా వుండి మా పేనం తీచ్చుండవ్ గదరా సెవ్వోడా!" ఎవరో అనటంతో పక్కున నవ్వారు అందరూ.

"శార్జి సేసుకొనే బేటర్లైటు తలకాయకు కట్టుకుని మొబ్బులో తిరుగుతా వుంటే కుందేలి గీన దాని ఎల్తుర్లో పడిందా?? ... ఇంగ అట్నే సూస్తా నిలబడిపోద్ది. అప్పుడు 'గిర్' అరన్ యేసుకొని ఇంగా– ఇంకా దగ్గిరికి పోవాలె. ఆ లోపల్నె ఇంగో మనిషి ఎనకమల్లుగా పొయ్యి కట్టితో దాన్ని బాది పడగొడ్తరు. అదీ లైటేట". చెప్పాడు వృద్ధుడు.

"శానా అన్నేయం పెద నాయనా! అడివిలో కుందేల్లు జింకలు కద్తులు తిరుగుతా వుంటేనే– అవేవో ఆటలో సూసినట్టు ... బాగుంటదిగాని ..."



"నిజమేరా! ఎవుని పొట్ట పోసుకోవటానికి వాడు సచ్చుందడు గదా? మనమేం అడ్డం బోతాం?" ఆవేదనగా అన్నాడు

"నేనే రయింజరు నైతేనా? ... సెట్లు నరికేవోట్లను, లైటేట గాల్లను తుపాకితో ధామ్మున కాల్చి పారేత్తా". ఆవేశంగా అన్నాడు.

"అబ్బ! బో యీరుడురా? యీడు". ఎగతాళిగా అన్నాడు ఒకడు.

మొదట్లో చేవవున్న మూరెడు తుంట కోసం విచక్షణా రహితంగా కొట్టి పడేసిన చందనపు మాన్లతో, దూలాల కోసం ఎన్నో వృక్షాల్ని నరికి అందులో ఉత్తమంగా వున్న దానిని ఎన్నుకొని వదిలేసిపోయిన మిగిలిన వృక్షాల్తో భీభత్సంగా వుంది అరణ్యమంతా.

మాటల సందట్లోనే 'జ్యోతి' ప్రాంతానికి వచ్చారు వాళ్ళు.

పెద్ద మఱ్ఱిచెట్టు, బావి. పారే సెలయేటితో అందంగా వుంది ఆ ప్రాంతం.

అక్కడున్న చిన్న కుటీరం ముందు సన్యాసులు కొంతమంది గంజాయి దమ్ము లాగుతున్నారు ఒకరి తర్వాత ఒకరు.

"ఇంగా ఎంత దూరముంది పెద నాయనా ఓబులం?" అడిగాడు సెవ్వన్న.

"అప్పుడే యేమైంది? యింత నాలుగింతలు నడ్సాల" ఎవడో అన్నాడు.

"ఓమ్మో ...? ..."

"సెవ్వేడి పని అయిపోయినట్టుంది. అప్పుడే ఎంత దూరముందని అడుగుతాండడు" నవ్వుతూ అన్నాడు ఒకతను.

"కొండల్లో ఇంగ యాడా నీల్లు దొరకవు. ఈడే వుండేది. బువ్వ సేసుకొని తిని సల్లబడేదాకా వుండిపోదాం".

ముసలాయన మాటతో మూట ముల్లె దించారు అందరూ. వంట ప్రయత్నాలు మొదలెట్టారు.

## కడితి వేట

అరణ్యాన్ని ఎప్పుడూ చూడనివాడైనందున అటు యిటు పరికించి చూస్తున్నాడు సెవ్వన్న.

దూరంగా కొండలు కాలుతున్నాయి.

"పెద నాయనా! అక్కడ కొండలు కాల్తా వుండయ్యే! ఎవరయినా అగ్గిపెట్టి వుంటారా?" అడిగాడు వేలు చూపిస్తూ.

తలెత్తి చూడలేదు ముసలాయన.

పొలగాల్లు బీడీ తాగి ఇసిరేసుంటారు. అది రాజుకొని మంది అడివిని కాల్చేచ్చుంది".

"ఇంగ పదేండ్లు పోతే కొండలో సెట్టే కనబడ్దు గావాల? పెద నాయనా!"

"కారెం దంచరా సిన్నబ్బీ!"

"ఈ మెతుకుల్లోకి సియ్యాలైతే బాగుంటై. అడివిలో నడ్సి నడ్సి నోరు సవ్వబడింది.

"యాందిరోయ్? ... అట్టా అనుకున్నోనివి ఒక కోన్ని సంకనబెట్టుకొని రాగుడ్దూ?"

"ష్ ... రాం ... రాం ... ఎండలు చంపేస్తున్నాయి."

"నీల్ల పక్కన నీడలో కూర్చుని మనమే ఇలాగంటే అడవిలో నీల్లు దొరక్క ఎన్ని మూగజీవాలు ప్రాణాలు విడుస్తున్నాయో? ... భగవాన్ ..."

"మనం యిక్కడ వుండటం కూడా పాపమే. వాటిని దప్పిక తీర్చుకోనివ్వకుండా చేసినట్లు ... రాం ... రాం ..." గట్టిగా దమ్ములాగి పక్కవాడికి అందించాడు సన్యాసి.

"ఫటక్ ... ఫటక్ ... ఫట్ ... ఫట్ ..."

హఠాత్తుగా ... దూరం నుంచి ఏదో శబ్దం విన్పిస్తోంది.

"పెద నాయనా! యాందా సప్పుడు?"

"ఫట్ ... ఫట్ ... ఫటా ... ఫటా ..."

రాతిని రాతికేసి కొట్టినప్పుడు వచ్చే శబ్దం

"ఏ వూరు నాయనా మీది?" వాళ్ళ వైపు చూస్తూ అడిగాడొక సన్యాసి.

"వరికుంట్ల సోమీ!"

"ఫట్ ... ఫట్ ... ఫట్ ... ఫట్ ..."

"ఓబుళం పోతున్నారా?"

"పెద నాయనా! యాందో వచ్చాంది" గట్టిగా అరిచాడు

"అవ్రా ..."

మాట ముగించలేదు.

క్షణంలో సగంలో సగం కూడా జరుగలేదు.

రాళ్ళను కాళ్ళతో గాల్లోకి తంతూ మహావేగంతో విండి నుండి వెలువడ్డ బాణంలా అక్కడికి వచ్చిందొక కడితి. ఆయాసంతో వగరుస్తోంది.

"కడితి ... కడితి ... కడితి ..." ఉద్విగ్నంగా అన్నారు అందరూ.

చుట్టూ వున్న మనుషుల్ని లెక్కజేయలేదు అది. అసలు చూసిందో? లేదో? ...

నీల్ల గుంట దగ్గరకెళ్ళి తలవంచి గబగబ తాగేసింది కడివెడునీల్లను.

తర్వాత, తలెత్తి చూసింది, అందరి వైపు - బిక్కిరి బిక్కిరిగా. వెనక్కి ముందుకు వూగుతూ వగరుస్తోంది.

"కొట్టండ్రా దాన్ని ..."

"నరకండ్రా ..."

"పోనియ్యి గాకండ్రా ..."

ఒక్కసారిగా అరిచారు.

"ఒరేయ్ ... వద్దురా ... దప్పికె ..."

ముసలాయన మాటకన్నా ముందే రివ్వుమంటూ వెళ్ళింది ఓ గొడ్డలి

"పాపంరా ..."

మరో రెండు కర్రలు గాల్లోకి లేచాయి.

గొడ్డలి కడితిని తగల్లేదు. కిందపడి శబ్దం చేయటంతో ఒక్కసారిగా ఎగిరింది అది.

బోటి మీదుగా సుడిగాలిలా దూసుకుపోయింది.

మనుసులున్నా లెక్కజెయ్యకుండా వచ్చి నీల్లు



## ధర్మపథం నియమపాలన




వేద శాస్త్ర పురాణాదులు మానవుని జీవితం సుఖంగా సాగిపోవుటకునూ, జీవిత లక్ష్యాన్ని సాధించుటకున్నూ ఉద్దేశింపబడినవే! ధర్మ శాస్త్రాదులు నిర్దేశించిన నియమాలు కొంత శ్రమను కలిగించేవే అని కొందరు అభిప్రాయ పడవచ్చును. రోగికి వైద్యుడిచ్చే మందు కొంత చేదుగా ఉండవచ్చును. కొన్ని మందులు వెగటుగా ఉండవచ్చును. కాని వాటి వల్ల మేలే కలిగి రోగం నయమవుతుంది.

ప్రకృతియే నియమాలకు కట్టుబడి ఉన్నది. పగటి భాగంలో సూర్యుడు, రాత్రి చంద్రుడూ నియమ బద్ధంగా నడుస్తున్నారు. ఆయా ఋతువులు తమ తమ ఋతు ధర్మాలను నెరవేరుస్తున్నవి. అలాగే మానవుడు నియమాలను పాటిస్తే జీవితం సుఖంగా గడుస్తుంది. విద్యార్థులకూ, గృహస్థులకూ కొన్ని నియమాలు ఏర్పరచ బడి ఉన్నాయి. అవి విద్యార్థుల విద్యాభివృద్ధికిని, గృహస్థుల ఆదర్శ జీవనానికీ ఉద్దేశించ బడినవే! ఉదాహరణకు - బ్రహ్మచారి. అంటే- విద్యార్థి మధురాహారాన్నీ, గంధమాల్యాదులనూ, పగటి పూట నిద్ర మున్నగు వానిని విడిచి పెట్టాలనే నియమం చెయ్యబడింది. రుచుల మీదా, ముస్తాబు మీదా మనస్సు పోతే చదువు పై ధ్యాస ఉండదనే సంకల్పమే దీనికి కారణం. అలాగే పగలు నిద్ర అలవాటయితే గురువు పాఠం బోధించేటప్పుడూ, తాను చదువుకునే టప్పుడూ కునికి పాట్లు రావడం సహజం కాబట్టి పగటి నిద్ర పనికి రాదన్నారు. ఇలాగే గృహస్థులకు అతిథులను సంతోష పరచడం, పనిచేసే దాస దాసీ జనానికి భోజనం పెట్టిన తర్వాతనే తాను భోజనం చెయ్యాలనీ నియమం. అతిథి సత్కారం వల్ల పరోపకార బుద్ధి అలవడుతుంది. నలుగురిలోనూ పేరు ప్రతిష్ఠలు లభిస్తాయి. పనివారికి, ముందుగా భోజనం పెట్టడం వల్ల వారు తృప్తిపడి యజమానుల పట్ల గౌరవం చూపుతూ పనులన్నిటినీ సక్రమంగా జరుపుతారు. వాళ్ళు అసంతృప్తితో చేసే పని సక్రమంగా జరగదు.

సూర్యోదయంకంటె ముందే లేచి కాలకృత్యాలు తీర్చుకుని స్నానం చెయ్యడం, మితంగా మాట్లాడటం, ఆరోగ్యకరమైన ఆహారాన్ని మితంగా భుజించడం, రాత్రి మేలుకోకుండా నిద్రపోవడం మున్నగునవి సామాన్య నియమాలు. వీటిని పాటించినట్లయితే వైద్యుల దగ్గరకు పోవలసిన అవసరం వుండదు. చిరకాలం జీవించవచ్చును. ఇలా చేసేవారు సహస్ర మాసాలకు పైగా -

ఇంకా నూరేళ్ళకుపైగా జీవిస్తారు. నూరేళ్ళకు పైగా జీవించిన మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారిని "ఇంతకాలం ఎలా జీవించగలిగారు?" అని ఎవ్వరో ప్రశ్నించగా తాను నియమాలను సక్రమంగా పాటిస్తున్నానని సమాధానం చెప్పారట!

- బులుసు వేంకటరమణయ్య

---

తాగించంటే అదెంత దప్పిగొనిందో చూడండ్రా పాపం ..."

ముసలాయన మాట ముగించలేదు.

వంద గజాల దూరం కూడా వెళ్ళలేదు కడితి.

ఎందుకో హఠాత్తుగా క్రిందపడింది. మొదలు నరికిన మానులా.

ఆశ్చర్యంతో నిశ్చేష్టులైనారు అందరూ.

గిజగిజ తన్నుకో సాగింది అది-

"కడ్తి పడిందిరోయ్! ...", కేకేస్తూ ముందుకు ముందుకు పరుగెట్టాడు ఒకడు.

"కో" అని అరుస్తూ వెనకే పరుగుదీశారు అందరూ-

"ఒరే ... ఒరే ..." అంటున్నా ఆగకుండా సెవ్వన్న కూడా ముందుకు దూసుకెళ్లాడు.

కిందపడి తన్నుకుంటున్న కడితి పైద దబదబా పడ్డాయి బడితెలు గొడ్డళ్ళు.

ఓ అర్ధ గంట తర్వాత అందరూ కలిసి దాన్ని క్రిందకు ఈడ్చుకొచ్చారు.

"పెద నాయనా! కడ్తిని సంపి తెచ్చినం" ఆనందంగా చెప్పాడు సెవ్వన్న.

"నోరు ముయ్యి వెధవా! దప్పికతో వచ్చిందాన్ని సంపినను. ఆ పాపం మిమ్మల్ని వూరికే పోనివ్వదు. పురుగులుబడి సచ్చురు" ఉక్రోశంగా అన్నాడు ముసలాయన.

సన్యాసులు శాపనార్థాలు పెడుతున్నారు.

"ఎన్ని రోజుల్నించి దప్పిగొనిందో పాపం? మనుసులున్నా ప్రాణాలకు తెగించి వచ్చి కడుపు నిండా నీల్లు తాగేసరికి తట్టుకోలేకపోయింది. సేపదీర్చుకోనిచ్చి వుంటే బ్రతికేదేమో? వెధవలు తరిమి చంపారు" బాధగా అంటున్నాడు ఒక సన్యాసి.

"సంపిందాన్ని తింటే పాపం లేదంటగా?- పెద నాయనా"

సెవ్వన్న నమ్మిన ధర్మసూత్రానికి ముసలాయనకు బాధతో కూడిన నవ్వొచ్చింది.

"అవ్రా! సిన్నప్పుడు పిల్లిని సంపి ఆ పాపం పోగొట్టుకోడానికి దాని సెవ్వు తిన్నెదాన్వేగ దా ... నీకు సెవ్వన్న అనే పేరొచ్చింది" అన్నాడు.

"ఈ అడివిని నరికేటోల్లు ఈ కొండను కాల్చేటోల్లు నీలాగే పెపంచ గ్యానం లేకుండా గుడ్డిగా వాల్లు జేసే పని మంచిదని నేరి పెట్టుకోబట్టే లోకం యిట్లైంది." బాధగా అన్నాడు.

"కాలు కోసికింది. ఎట్టా నడ్సాలబ్బా?"

"కడ్తి దొరికిన్లా! మూలగదీసి రుద్దుదాం. ఏటికెపోద్ది".

సంతోషంగా మాట్లాడుకుంటూ కడితిని కోయటంలో నిమగ్నమైనారు వాళ్ళు. □



## బాంకులో తుపాకీ కాల్పులు

తిరుచ్చికి చెందిన జయకోండమ్ అనే వూరు పక్క వూరు ఉల్‌కొట్టైలోని ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంకులోకి డిశంబరు పదో తేదీన కొందరు జొరబడి, తక్కున పిస్తళ్ళు ప్రేల్చడం ఆరంభిం చారట. తత్ఫలితంగా ఆ బ్యాంకి మేనేజరు రామనాధన్ అక్కడికక్కడే చనిపోయారట. త్యాగరాజన్ అనే వో క్లర్కు ఆసుపత్రికి తీసుకు వెళ్తుండగా చనిపోయాడట.

## గట్టి పిండం!

చికాగోకు చెందిన 26 ఏళ్ళ కోనిహారాన్ అనే గర్భిణి స్త్రీకి తన గర్భస్థ శిశువు చనిపోయినట్టు అనుమానంవచ్చి 30వ అంతస్థులో వున్న వో ఆసుపత్రికి వెళ్ళి చూపించుకున్నదట. వారు ఆమె వూహ తప్పని నచ్చ చెప్పటమేగాక, శిశువు గుండె కొట్టుకోడాన్ని గూడా ఆమెకు వినిపించారట. అయినా ఆమెకు సంతృప్తి కలుగక ఆ 30వ అంతస్థు నుంచి క్రిందికి దూకి ఆత్మహత్య చేసుకుందట. వింతేమిటంటే ఆ మృత దేహంలో శిశువు ప్రాణాలతో నే వుండడంతో వెంటనే శిశువును తల్లిగర్భం నుంచి వేరుచేసి రక్షించారట– డాక్టర్లు.

## విఫల ప్రేమా–ఆత్మ త్యాగమూ!

కడపకు చెందిన 17 ఏళ్ళ వేలాయుధ శెల్వి అనే అమ్మాయీ అదేవూరుకు చెందిన 21 ఏళ్ళ బాబ్జి అనే యువకుడూ పరస్పరం ప్రేమించుకుంటే అంతకు మించి వీల్లేదని ఆమె తల్లి అడ్డం వచ్చిందట. శత విధాల చెప్పినా శెల్వి తల్లి వప్పులేదట. ఆవిడ ప్లాస్టిక్ బొమ్మలు వో సంతలో అమ్ముకు రాడానికి పక్క గ్రామం వెళ్ళిందట. ఆ రాత్రి తన కూతురుకు లక్ష్మి అనే ఒకామెను కాపలావుంచితే శెల్వి ఆమెను




బ్రతిమాలి ఆమె సహకారంతో ఆ రాత్రి తన ప్రియుడు బాబ్జితో ఆ యింట్లో కలుసుకున్నదట. వారిద్దరూ రాత్రి జీవితాలను కలుపుకుని, ఆదేరాత్రి ఆత్మహత్య చేసుకున్నారట.

## అన్యాయానికి అన్యాయం!

ఆలూరు గ్రామంలో 40 ఏళ్ళ మణికల సంజీవయ్య అనే పురుషుడు మధువు సేకరించి, స్వీకరించి మదవతి కోసం గగ్గడు అనే వొకతని సహాయం కోరాడట. ఆ గగ్గడు వో అమ్మాయిని తెచ్చి వో కాలేజిలోని వొక గదిలో 'ఆ' ఏర్పాటు చేశాడట. కామదాహం తీరిన ఆ సంజీవయ్య తన దాహం తీర్చిన ఆమెకు డబ్బిచ్చి ఆమె దాహం తీర్చేదిలేదని వాదన పెట్టుకున్నాడట. ఈ వాదనలో వొళ్ళు వేడెక్కిన గగ్గడు వో రాయితో శక్తివంచన లేకుండా ఆ సంజీవయ్య తల పగలేశాడట. దెబ్బ వూహించినకన్నా ఎక్కువ తగలడంతో సంజీవయ్య చనిపోయాడట. ఇది నవంబరు 26న జరిగిందిట.

## పురుషునిగా మారనున్న స్త్రీ!

ఇండియాకు చిట్టచివరి నగర మయిన నాగర్ కోయిల్‌కు చెందిన 17 ఏళ్ళ శుభ అనే అమ్మాయికి ఐదు నెలల క్రితం కొంచెంగా నూనూగు మీసాలూ, గడ్డమూ రావడం ఆరంభ మయిందట. తలి దండ్రులు ఎన్నో రకాల మందులు యిప్పించి కూడా ప్రయోజనం లేకపోయిందట. నెమ్మది నెమ్మదిగా ఆమెలో స్త్రీత్వపు లాలిత్యమూ, ఎత్తు పల్లాలూ తగ్గుతూ, పురుషత్వపు శరీరం తలఎత్త నారం భించిందట. ఆమెను పరీక్షించిన ప్రభుత్వ డాక్టర్లు శుభ మగవానిగా మారుతోంది. అందులో సందేహం లేదు. ఆమె శరీరం అందుకు తగిన విధంగా అతి శీఘ్రంగా మారుతోంది. కొన్నాళ్ళలో ఆమె సంపూర్ణ పురుషునిగా మారిపోతుంది అన్నారట. ఈ ప్రక్రియకు శస్త్ర చికిత్స కావాలి గనుక ఆమెను కేరళకు చెందిన త్రివేంద్రంలోని ప్రభుత్వ ఆసుపత్రికి పంపారట.

## అక్రమ సంబంధం–హత్య!

రామనాధపురానికి చెందిన దేవి పట్నానికి చెందిన నాచ్చియారమ్మ అనే ఆవిడ తన భర్త చనిపోవడంతో తన 7 ఏళ్ళ కొడుకు మునుసామిని తీసుకుని, ఆ వూరు వొదిలి విజయ కరిచల్ అనే గ్రామంలో స్థిరపడిందట. ఆ వూళ్ళో యీమెకు నల్లయ్య అనే వో వివాహితునితో అక్రమ సంబంధం ఏర్పడిందట. దీనికి నల్లయ్య భార్య వెళ్ళాయి సమ్మతించడంతో మరింత జోరుగా సాగేదట. నాచ్చియారమ్మ ధనికురాలవటంతో నల్లయ్య ఆమె వద్ద వీలు చిక్కినప్పుడల్లా డబ్బు గుంజేవాడట. చివరికామె యిందులో తిరకాసు కనిపెట్టి ఇక ముడియాదు అనేసరికి ఆ భార్యా భర్తలిద్దరూ చేరి ఆమెను చంపేశారట. ఈ సంఘటనను టీరువా వెనుక నక్కి చూసిన 7 ఏళ్ల కుర్రాడు (ఆమె కొడుకు) మునుసామి కోర్టులో సాక్ష్యం యిచ్చాడట. దాంతో ఆ భార్యా భర్తలకు యావజ్జీవ శిక్షపడ్డదట.

## చైనాలో ఇళ్ళకొరత!

ప్రపంచ దేశాలన్నిటిలో కన్నా చైనా దేశంలో ఇళ్ళ కొరత చాలా ఎక్కువట. చిన్న చిన్న యిళ్ళలో బోలెడు మంది పడుగూ పేకగా పడుకుంటూం టారట. ఏడి పడక గది, ఏడి మరుగుదొడ్డి అనేవి అక్కడ ఆశ్చర్య కరమైన పదాలట. ఒక్కో యింట్లో పడకగదిలో అరడజను మంది పడుకోవాల్సి వుంటుందట. నూతన దంపతులయితే ఆ మధ్యలో దోమతెరో, అటువంటిదో కట్టుకుని అఘో రించాల్సిందేనట. ఇంత వరకూ సొంత యిళ్ళు కట్టుకో నివ్వని ప్రభుత్వం యిపుడిపుడే తన దృక్పథాన్ని మార్చుకుంటోందట.

## ఎన్నికల్లో పార్టీ గెలిచినందుకు యం. జి. ఆర్. కి బహుమతి!

అరుప్పుకోట్టై ఎన్నికలలో అన్నా డి. యం. కె. గెలిచినందుకు గానూ, ఆపార్టీకి చెందిన సాత్తూర్ రామచంద్రన్ తమిళనాడు ముఖ్యమంత్రి యం. జి. ఆర్ కు 21 కాసుల బంగారు గొలుసును బహూకరించారట– వ్వి

## వంటగ్యాస్ ప్రమాదం!

పామర్రుకు చెందిన మల్లింపల్లి కమల అనే ఆవిడ గ్యాసు పొయ్యి మీద వంట చేస్తూండగా




గ్యాసు సిలిండరుకు వున్న ట్యూబు వూడిపోయి బండనుంచి గ్యాసు సర్రున బయటికి రావడంతో ఆమె వొళ్ళు అంటుకుని, గుంటూరు ఆసుపత్రిలో మరణించిందట. □




# అందాన్ని అందించడం ప్రకృతి సహజం. అందచందాల్ని అందించడం కేమియో లక్షణం.

కొబ్బరి నూనెలోని మృదువైన నవనీతం మీ శరీర శోభను ఇనుమడింప చేస్తుంది.

రోజంతా మీ శరీరాన్ని పూల పరిమళంలో తేలియాడిస్తుంది.

"న్యూ కేమియో బ్యూటీ సోప్" మీముందు.

అందాల సంరక్షణలో ఒక కొత్త అనుభవాన్ని అందిస్తుంది.

ACIL/025/86-Tel



## కేమియో

బ్యూటీ సోప్




**మీ శరీర సౌందర్య పరిరక్షణలో ఓ కొత్తమలుపు ఇస్తుంది కేమియో**



జయలక్ష్మీ వారి ఉత్పాదన





# సీరియల్
# ఆరోహణ
## శైలకుమార్



(గత సంచిక తరువాయి)

కళ్ళు మూసుకుని తపస్సు చేస్తున్న వాడిలా, ధ్యానం చేస్తున్న వ్యక్తిలా, కూర్చుండిపోయాడు చక్రవర్తి అక్షరాల అలలు లేస్తున్నాయి హృదయ సముద్రంనుంచి. భావాలు ఆకారం దాల్చుకోవటానికి కొట్టుమిట్టాడుతున్నాయి మనసంతా మధన వచ్చిన అవకాశం నిలబెట్టుకోవాలన్న తపన పాటల రచయితగా పేరు తెరమీద చూసుకోవాలన్న కోరిక. అక్కడ వున్న అందరినీ వ్రాసి మెప్పించాలన్న పట్టుదల

నీలిమ రూపం కళ్లముందు కదిలింది చక్రవర్తికి వ్రాయగలనన్న విశ్వాసం మరింత పెరిగింది దీక్షగా మనసుని కేంద్రీకరించాడు. ఏకాగ్రతతో ఆలోచనలన్నీ ఒకే మార్గంలో మళ్ళించాడు లక్ష్యాన్ని ఛేదించాలన్న పట్టుదలతో సర్వశక్తులూ కేంద్రీకరించి సూటిగా గురిపెడుతున్న విలుకాడిలా కలాన్ని ఎక్కుపెట్టాడు చక్రవర్తి.

గబగబా ఒక పల్లవి రాశాడు విసుగ్గా గడియారాలు చూసుకోబోతున్న వాళ్ళందరూ ఆసక్తిగా చూశారు చక్రవర్తి వైపు.

పల్లవి వినిపించాడు చక్రవర్తి పెదవి విరిచాడు డైరెక్టరు "మరి కాస్త శృంగారం వచ్చేలా చూడండి' చెప్పాడు రాంబాబు.

పది నిమిషాలలో మరో పల్లవి చెప్పాడు చక్రవర్తి. అదీ ఎవ్వరికీ నచ్చలేదు అసిస్టెంటు డైరెక్టరుకు నచ్చింది. కాని అతనా మాట చెప్పలేకపోయాడు

అరగంటలో దాదాపు ఆరు పల్లవులు చెప్పాడు చక్రవర్తి ఏదీ నచ్చలేదు అక్కడున్న వాళ్లకు మరింత పట్టుదల పెరిగింది చక్రవర్తిలో.

సిగరెట్ వెలిగించుకుని గాఢంగా గుండెలనిండా పొగపీల్చాడు మరింత తీవ్రంగా ఆలోచించసాగాడు చక్రవర్తి

విసుగ్గా మొహం పెట్టాడు డైరెక్టరు. ఇక అతను రాయలేడు అన్న నిర్ణయానికి రాబోతున్నాడు రాంబాబు ఆ సమయంలో-

మందు తాగే మామయ్యా
ముందే ముందో చూడయ్యా
కాగితాల కట్టకాదురా
కన్నెబుగ్గ సొట్ట చూడరా, అంటూ రాగయుక్తంగా పల్లవి చెప్పాడు చక్రవర్తి

ఆనందంతో చప్పట్లు కొట్టాడు రాంబాబు అందరికీ ఏకగ్రీవంగా నచ్చింది పల్లవి

జరిగిన కథ –9: నీలిమ ఎడబాటు వల్ల కలిగిన నిరాశలో కవి చక్రవర్తి తిరుపతి వదలి మద్రాసు చేరుకుంటాడు. కొత్త వారికి స్థానం ఇస్తానని ప్రకటించిన సత్యం వంటి డైరెక్టర్ దగ్గర కూడ ఆయనకు ఆశాభంగమవుతుంది. శశాంక పరిచయమవుతాడు. ఏ పనీ లేకపోయినా అందరితో పరిచయాల మీద బతికేస్తున్న శశాంక తాను కాబోయే డైరెక్టర్‌నని, తన సినిమాలో స్థానం ఇస్తానని భ్రమింపజేసి చక్రవర్తిని తన గదిలో చేర్చుకుంటాడు. ఒక ప్రొడ్యూసర్ ఆఫీసులో అవకాశం కోసం అర్థించి అవమానపడి వెనక్కి తిరిగి వస్తున్న చక్రవర్తిని మరో నిర్మాత రాంబాబు పిలిపించి ఒక పాటకు అవకాశం ఇస్తాడు.

అవ్యక్తమైన ఆనందం హృదయపు అంచులు దాటి పొంగుతూవుంటే, తనమీద తనకు నమ్మకం పెరుగుతూ వుంటే కలాన్ని పరుగెత్తించాడు చక్రవర్తి

మన డ్యాన్సర్ కన్నె పిల్లే అంటారా" నవ్వుతూ అడిగాడు డైరక్టరు

"ఆ విషయం మీకే బాగా తెలియాలి" కన్నుగీటుతూ అన్నాడు రాంబాబు

అందరూ నవ్వారు వాళ్ళు అలా నవ్వుతూ వుండగానే చరణాలు కూడ పూర్తిచేసి వినిపించాడు చక్రవర్తి అందరికీ నచ్చాయి

"బావుంది చక్రవర్తీ మెచ్చుకుంటూ అన్నాడు రాంబాబు

థాంక్స్ బరువు దిగిపోయిన వాడిలా అన్నాడు చక్రవర్తి

'ఇదిగో సిగరెట్ కాల్చు" త్రిబుల్ఫైవ్ సిగరెట్‌ను చక్రవర్తి నోట్లో కుక్కాడు రాంబాబు కాఫీలు తెమ్మని బాయ్‌ను పురమాయించాడు

జరిగింది కలా నిజమా అన్న పరిస్థితిలో పడ్డాడు చక్రవర్తి అది తను సినిమాకోసం వ్రాసిన మొదటిపాట నిరాశగా నడచిపోతూ వున్న తనను పిలిచి పాట వ్రాయించుకున్న రాంబాబు ఎంతో గొప్పవాడిగా కనిపించాడు చక్రవర్తి కళ్లకు.

పైకొస్తావు చక్రవర్తీ

"మీ ఆశీర్వాదంసార్! ఇది నా గొప్పకాదు మీది" నిజాయితీగ అన్నాడు చక్రవర్తి

రేపు మ్యూజికల్ డైరెక్టర్‌తో కూర్చుని ట్యూను చేయిద్దాం నీకేం పని లేదుగా

"లేదండీ"

"ఎక్కడ నువ్వుండేది

అడ్రసు చెప్పాడు చక్రవర్తి

'దగ్గరే ఇక్కడికి మరి రేపు ఉదయమే వచ్చెయ్యి మ్యూజిక్ సిట్టింగుకు"

"అలాగే' ఒప్పుకున్నాడు చక్రవర్తి

మరికొద్దిసేపు అవీ ఇవీ మాట్లాడుతూ వుండి రూముకు బయలుదేరాడు చక్రవర్తి.

ఆనందంతో అతని మనసు ఆకాశంలో విహరిస్తోంది. తాను వ్రాసిన పాట త్వరలో సినిమాలో వినిపించబోతూ వుంది. వెంటనే ఆ విషయం శశాంకకు చెపాలని, ప్రభాకర్‌కు ఉత్తరం రాయాలని, నీలిమ వినేలా చేయాలని అనిపించింది

అడుగులు వేగంగా వేశాడు చక్రవర్తి ఆపాట హిట్టయినట్టూ, తనపాటలకోసం అందరూ ఎగబడుతున్నట్లూ పంచరంగుల పగటి కలలుకంటూ గదికి చేరుకున్నాడు చక్రవర్తి.

నిద్రపోతున్న శశాంకను లేపి విషయం చెప్పాడు.

"ఏమిటీ రాంబాబు నీతో పాట వ్రాయించుకున్నాడా"

అమితమైన ఆశ్చర్యంతో అడిగాడు శశాంక.

"ఔను శశాంకా"

'ఏదీ చరిత్రా క్రియేషన్స్ రాంబాబేనా నువ్వు చెప్పేది"

"ఔను ఏం అతన్నీకు తెలుసా"

"బాగా తెలుసు. డబ్బులిచ్చాడా"

"లేదు రేపు మ్యూజిక్ సిట్టింగుకు రమ్మన్నాడు."

"రమ్మనడమేమిటి కారు పంపించడా"

"కారు పంపించేంత పెద్దవాళ్ళమా మనం"

"చక్రవర్తి వాళ్ళకు అవసరమైనపుడు కార్లూ ఇస్తారు, బీర్లూ పోస్తారు. అవసరం తీరాక ఖాళీ బీరుసీసాను విసిరేసినట్లు విసిరేస్తారు. అదీ సినిమా నీతి."

"కాని ఆయన అలా అనిపించలేదు నాకు" నిశ్చయంగా అన్నాడు.

"ఏ పుట్టలో ఏ పాముందో నీ నమ్మకాన్ని నేనెందుకు కాదనాలి. తొలిపాట రాశావు మరి పార్టీ చేసుకుందాం పద" లేచి బట్టలు వేసుకుంటూ అన్నాడు శశాంక.

"ఏం పార్టీ కావాలి" తనూ లేస్తూ అడిగాడు చక్రవర్తి.

"పార్టీ అంటే మందు విందు ఆ తరువాత చక్కటి పొందు. చూశావా నువ్వు నా రూములో చేరేసరికి నాకూ డైలాగులు వస్తున్నాయి."

రూముకు తాళం వేశాడు శశాంక.

"ఇక్కడ ప్రొహిబిషన్ కదా మందెక్కడ దొరుకుతుంది."

"ఎక్కడ దొరకదు అని అడగాలి. ఎందెందు వెదకి చూచిన అందందే కలదు మందు" తాగబోతున్న హుషారుతో అన్నాడు శశాంక.

ఇద్దరూ కొద్ది దూరం నడిచి చీకటిగా వున్న సందులోని ఒక ఇంట్లోకి నడిచారు.

విస్కీ బాటిల్ ఓపెన్ చేశాడు శశాంక. రెండు గ్లాసుల్లో పొయ్యబోతుంటే ఆపాడు చక్రవర్తి.

"నేను తాగను" అన్నాడు.

"సినిమా రచయితకు తాగకపోవటం అన్నది పెద్ద డిస్ క్వాలిఫికేషను. కొద్దిగా తీసుకో"

"అలవాటు లేదు."



## ఆరోహణ

"అందరికీ పుడుతూనే అలవాటయిందా చక్రవర్తీ! ఏదో ఒక రోజు ప్రారంభించాలి. సింపుల్‌గా ఓ పెగ్ తీసుకో"

"ప్లీస్ వద్దు"

ఎంత బలవంతం చేసినా చక్రవర్తి విస్కీ తీసుకోలేదు.

తానొక్కడే తాగసాగాడు శశాంక ఆనందంగా.

"ఔను డైరక్టర్ సుందరానికి సబ్జెక్టు చెబుతానన్నావు కదా. రాశావా" అడిగాడు శశాంక.

"ఎక్కడా అదే ఆలోచిస్తున్నాను"

"సినిమా కథకు ఇన్ని రోజులు ఆలోచిస్తే ఎలా చక్రవర్తీ! ఇక్కడ అంతా స్పీడ్. ఉదయం కథ అడిగితే మధ్యాహ్నానికి చెప్పగలగాలి. పాట అడిగిన పది నిముషాల్లో రాసి ఇచ్చేయాలి. అట్లా అయితేనే ఇక్కడ రచయిత బ్రతగ్గలడు"

"ఎంతయినా ఆలోచించాలికదా శశాంకా."

"ఓ పనిచెయ్యి చక్రవర్తీ, రేపు మార్నింగ్‌షో ఇంగ్లీషు సినిమా, మ్యాట్నీ తమిళసినిమా, మొదటిఆట మళయాళం సినిమా, రెండవఆట హిందీ సినిమా చూడు. ఒకదాన్లోంచి సెంటిమెంట్లు, ఒకదానిలోంచి కామిడీసీన్లు, ఒకదానిలోంచి ఫైట్లు, ఒకదానిలోంచి క్లైమాక్స్ కలిపేసి ఓ కథ తయారుచేసి చెప్పెయ్యి."

"ఛీ ఛీ కాపీ కొట్టమంటావా" కోపంగా అన్నాడు.

"మందుతాగి చెబుతున్నాననుకోవద్దు చక్రవర్తీ! ఇక్కడ సినిమా కథలన్నీ ఇంతే. కొద్దిరోజులుపోతే అన్నీ నీకే అర్థమవుతాయి."

"అంతేనంటావా."

"మందు మీద ఒట్టు అంతే."

మరో అరగంటకు విస్కీ తాగటం పూర్తి చేశాడు శశాంక. చక్రవర్తి బిల్లు చెల్లించాడు. ఇద్దరూ బయటికి వచ్చారు.

"చక్రవర్తీ నువ్వు రూముకెళ్లు నేను తరువాత వస్తాను."

"ఎక్కడికిప్పుడు."

"ప్రక్క వీధిలో ఓ డబ్బింగు ఆర్టిస్టు వుందిలే. అప్పుడప్పుడూ చిన్న చిన్న వేషాలు కూడ వేస్తుంటుంది. వస్తావా" కాస్త ముద్దగా వస్తున్నాయి శశాంక మాటలు.

"ఎందుకూ"

"నువ్వేం రచయితవయ్యా. రాత్రిపూట ఆడదాని దగ్గరికి మగాడు ఎందుకెళ్తాడు" నవ్వుతూ అన్నాడు.

"వెళ్ళు నేరాను" కఠినంగా అన్నాడు చక్రవర్తి.




"ఈ పాతివ్రత్యం ఎన్నాళ్లో నేనూ చూస్తాను" వ్యంగ్యంగా అన్నాడు శశాంక.

సిగరెట్ వెలిగించుకుని కదిలాడు చక్రవర్తి. గదికివచ్చి పడుకున్నాడేగాని నిద్రపట్టలేదు. ఆలోచనల మధ్య కథకు ఓ ప్లాటు దొరికింది. లేచి ఆ రాత్రి రెండు గంటలప్పుడు రాస్తూ కూర్చున్నాడు చక్రవర్తి.

తెల్లవారుజామున వచ్చాడు శశాంక. మరికాసేపటికి కథ పూర్తిచేసి పడుకున్నాడు చక్రవర్తి.

* * * * * *

ఉదయం తొమ్మిది గంటలకల్లా మ్యూజిక్ సిట్టింగుకోసం చరిత్రా క్రియేషన్సు ఆఫీసు చేరుకున్నాడు చక్రవర్తి. హార్మనీ తబలాలతో పాటు తన ఇద్దరు శిష్యులనూ తీసుకుని వచ్చాడు మ్యూజిక్ డైరెక్టరు. కాఫీ టిఫిన్లు ముగిశాయి.

వ్రాసిన పాటను ట్యూన్ చేయటానికి మొదట్లో చాలా విసుక్కున్నాడు మ్యూజిక్ డైరెక్టరు. తాను అంతకు ముందు చేసిన ట్యూనుకే పాట వ్రాయించమని పట్టుబట్టాడు.

"ట్యూను టేప్ చేసి ఇచ్చాను గదాసార్. దానికి వ్రాయించండి" విసుగ్గా అన్నాడు.

"రైటరు కొత్తవాడండీ. లిరిక్ మాకు బాగా నచ్చింది. ఎలాగైనా ట్యూను చెయ్యాలి మీరు" చెప్పాడు రాంబాబు.

"నాకు వేరే రీరికార్డింగ్ వుంది సార్."

"మీరు అనుకోవాలేగాని అరగంటలో ట్యూను చేస్తారు"

"కొత్తవాళ్ళతో ఇదే ఇబ్బంది ట్యూనుకు రాయలేరు. రాసి ట్యూన్ చేయమని మమ్మల్ని ఇబ్బంది పెడతారు" విసుక్కున్నాడు.

"నాకు బాగా కావలసిన వాడండీ అందుకే ఇండస్ట్రీకి ఇంట్రడ్యూస్ చేస్తున్నాను. ఎలాగైనా ట్యూన్ చేయాలి మరి" అబద్ధం ఆడాడు రాంబాబు.

"మీ ఇష్టంసార్. నా ట్యూను అయితే ఖచ్చితంగా హిట్టవుతుంది. ఇప్పుడు దీనికి చేయటం అంటే మీరిస్కు."

చివరికి కొన్ని చిన్న చిన్న మార్పులతో చక్రవర్తి పాటకు ట్యూన్‌కట్టి వినిపించాడు మ్యూజిక్ డైరెక్టరు. అందరికీ నచ్చింది ట్యూను పాటకూడ.

"రికార్డింగు ఎప్పుడుసార్" కుతూహలంగా రాంబాబును అడిగాడు చక్రవర్తి.

"త్వరలో నే థియేటరు దొరకగానే నేనే కబురు పెడతాను"

"మీకు తెలిసిన వాళ్ళకు నన్ను రెకమెండ్ చెయ్యండిసార్"

"ఆ విషయం నువ్వు చెప్పాలా చక్రవర్తీ అలాగే"

మెస్‌లో భోజనంచేసి రూముకు వచ్చాడు చక్రవర్తి. శశాంక అప్పటికే రూములో వున్నాడు.

"రాత్రి చాలాసేపటి వరకూ మేలుకుని వున్నావేమిటి సబ్జెక్టు తయారు చేశావా" అడిగాడు శశాంక.

"ఔను సుందరంగారి దగ్గరికి వెళదామా"

"ఇందాకే కలిశాను ఆయన్ను. సాయంత్రం వెళదాం. అరుణా హోటల్‌లో వుంటానన్నాడు."

"సాయంత్రాలు మందు బిజీలో వుంటారు. ఎవ్వర్నీ కలవద్దని నువ్వే అన్నావుకదా."

"నిజమే. కొందరు సినిమా వాళ్ళను మందులో వున్నప్పుడే కలవాలి. లేకపోతే పనులు జరగవు. సుందరం మందు కొడుతూనే కథ వింటాడు" నవ్వుతూ చెప్పాడు శశాంక.

ఆ సాయంత్రం అరుణా హోటల్‌లో డైరక్టర్ సుందరాన్ని కలిశారు చక్రవర్తి, శశాంక. అప్పటికే బాటిల్ ఓపెన్‌చేసి కూర్చుని వున్నాడు సుందరం. వాళ్ళను చూస్తూనే మరో రెండు గ్లాసులు తెప్పించాడు.

"ఒక్కటి చాలండి చక్రవర్తికి గ్లాసక్కరలేదు."

"అంటే సీసాతో నే కొట్టేస్తాడా" నవ్వుతూ అడిగాడు సుందరం.

"లేదండీ అసలు ముట్టుకోడు"

ఆశ్చర్యంగా చూశాడు చక్రవర్తి వైపు సుందరం. ఛీర్స్ చెప్పి తన గ్లాసు అందుకున్నాడు శశాంక.

రాత్రంతా తాను ఎంతో ఆలోచించి వ్రాసిన కథను వినిపించాడు చక్రవర్తి. మందు తాగుతూనే విన్నాడు సుందరం.

"ఈ మధ్యే ఇలాంటి హిందీ సినిమా ఏదో వచ్చిందండీ" అన్నాడు సుందరం కథంతా విన్నాక.

"లేదండీ అదివేరు" శశాంక సమాధానం చెప్పాడు.

"చాలా మార్చాలీ కథను" పెదవి విరిచాడు సుందరం.

"మార్చితే పనికొస్తుందంటారా" అడిగాడు చక్రవర్తి.

"ఆలోచించాలి. అయినా హీరో హీరోయిన్లను ఇంట్రవల్‌దాకా మీరు కలపలేదే ఎలాగ. ఇంట్రవల్‌కు ముందు కనీసం రెండు డ్యూయట్లన్నా లేకపోతే ప్రేక్షకులు డబ్బాలు వెనక్కి పంపేస్తారు" బాక్సాఫీసు సూత్రాలన్నీ ఆయనకు క్షుణ్ణంగా తెలిసినట్లు అన్నాడు సుందరం.

"మీకు తెలీదండీ ఏముందండీ హీరోనో హీరోయినో కలగన్నట్లు డ్యూయట్ తీస్తే సరిపోతుంది" అన్నాడు శశాంక.

"డ్రీం సాంగ్ అంటే సెట్టు వెయ్యాలి. ఖర్చు ఎక్కువ. మామూలు డ్యూయట్ అయితే అవుట్‌డోరులో తీసేస్తాం."

కొద్ది సేపు ఎవరూ మాట్లాడలేదు.

"మరి మేము వస్తాంసార్" లేచాడు శశాంక.

"అలాగే కథను గురించి మళ్ళీ ఆలోచిద్దాం."

ఇద్దరూ బయటికి వచ్చి ఆటో ఎక్కారు.

"చూడు చక్రవర్తీ సినిమాకు కథ రాయటంకన్నా చెప్పే విధానం ముఖ్యం. ఎంత చెత్తగా రాసినా ఎవరూ పట్టించుకోరు. కాని చెప్పటం మాత్రం ఎదుటి వాళ్ళను ఆకట్టుకునేలా చెప్పాలి." చెప్పాడు శశాంక.

"అంటే అభినయంతో చెప్పాలా"

"ఔను చెప్పే విధానమే ముఖ్యం."

"ఇంతకూ కథ తీసుకుంటాడంటావా" ఆతృతగా అడిగాడు చక్రవర్తి.

"లేదు. ఆలోచిద్దాం అన్నాడు అంటే కథను కొద్దిగా మార్చి తన పేరు వేసుకుంటాడు లేదా మనసీన్లు కొన్ని వాడుకుంటారు."

"నీకెలా వుంది కథ."

"బావుంది కాస్త మార్పు చేసి వేరే కంపెనీ వాళ్ళకు కూడా చెబుదాం." తల ఊపాడు చక్రవర్తి.

"చూడు చక్రవర్తీ కథను పూర్తిగా ఎప్పుడూ ఎవ్వరికీ చెప్పద్దు. మంచి సస్పెన్సు దగ్గరో, క్లైమాక్సు దగ్గరో ఆపెయ్యి. ఎదుటివాడు కుతూహలం చూపించాడా డబ్బు విషయం మాట్లాడు. కుతూహలం చూపించలేదా వెనక్కి తిరిగి వచ్చెయ్యి."

"ఎందుకు"

"కథను పూర్తిగా చెప్పావనుకో వాళ్ళకు నచ్చితే వేరేవాళ్ళ పేరుమీద వాడుకుంటారు. నీ పేరు వెయ్యరు డబ్బూ ఇవ్వరు"

అదో కొత్త పాఠం చక్రవర్తికి.

ఆటో రూము ముందు ఆగింది. ఇద్దరూ దిగారు.

మూడు రోజులు గడిచాయి. చక్రవర్తికి రెండు ఉత్తరాలు వచ్చాయి. మొదటిది ప్రభాకర్ రాశాడు తిరుపతినుంచి. రెండవది తిరుపతి నుంచి రీడైరెక్టు చేయబడింది. ఓ ప్రముఖ వారపత్రిక వాళ్ళు వ్రాశారు. చక్రవర్తి తిరుపతిలో వున్నపుడు పంపిన 'మానస వీణ' నవలను సీరియల్‌గా వేస్తున్నట్లు రాశారు. దాని పారితోషికం వివరాలు కూడా తెలియ చేశారు.

నవల సీరియల్‌గా వస్తున్నందుకు చాలా ఆనందం కలిగింది చక్రవర్తికి. దానికి వచ్చే పారితోషికంతో మరికొంత కాలం గడపొచ్చు. మద్రాసులో చాలా తృప్తిగాను హాయిగాను వుంది చక్రవర్తికి - అప్పటిదాకా మద్రాసులో పడిన కష్టాలన్నీ తాత్కాలికంగా మరిచిపోగలిగాడు.

నీలిమ తప్పకుండా చదువుతుంది నవలను. నీలిమ చదువుతుందన్న ఊహ వచ్చేసరికి ఏదో మత్తు ఆవరించింది చక్రవర్తిని. "ఇక నుంచి అక్షరాలు ఆలోచనలు అన్నీ నువ్వే అయి కనిపించాలి" అన్న ఆనాటి నీలిమ రూపం కళ్ళ ముందు. ఆ నవల వెనుక వున్నది నీలిమ ఇచ్చిన ధైర్యం, ఆమె ఇచ్చిన నమ్మకం.

నీలిమ దగ్గరికి పరుగెత్తుకు వెళ్ళాలని అనిపించింది చక్రవర్తికి. ఆనందమో విషాదమో కలిగినపుడే కావాలి ఆత్మీయుల లాలన. ఆ భావావేశాన్ని వాళ్ళతో పంచుకోవాలి. వారి స్పర్శలో సర్వం మరచిపోవాలి.

తన అభిప్రాయాన్ని కనీసం పత్రికకైనా రాస్తుందా నీలిమ. అమూల్యంగా భావిస్తాదని ఆమెకూ తెలుసు. తప్పకుండా రాస్తుంది. తనలో తనే అనుకున్నాడు.

"చక్రవర్తీ" భుజం మీద తడుతూ పిలిచాడు శశాంక.

"ఆఁ" అన్నాడు భావావేశం నుంచి తేరుకుని చక్రవర్తి.

"ఏమిటి పిలిచినా పలకనంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు".

"ఏంలేదు ఏదో కథకు ప్లాటు" అబద్ధం ఆడాడు నిజం చెప్పటం ఇష్టంలేక.

"రాంబాబు కారు పంపిస్తానన్నాడా"

"కారు పంపటమా ఎందుకూ"

"అదేమిటి చక్రవర్తీ మధ్యాహ్నం వాహినీలో రికార్డింగ్ వుందట. నీకు తెలీదా" ఆశ్చర్యంగా అడిగాడు శశాంక.

చక్రవర్తి కూడ ఆశ్చర్యపోయాడు. తన పాటను రికార్డు చేస్తూ రాంబాబు తన కెందుకు కబురు పెట్టలేదో అర్థంకాలేదు. లేచి బట్టలు వేసుకున్నాడు.

"శశాంకా రికార్డింగ్ కెళదాంరా" పిలిచాడు.

"ముందు నువ్వెళ్ళు చక్రవర్తీ. నేను ఓ డైరక్టర్ని కలవాలి. ఆయన్ను కలసి అక్కడి నుంచి థియేటరుకు వస్తాను".




"తప్పకుండా రావాలి" అని చెప్పి గబగబా వాహినీకి బయలుదేరాడు చక్రవర్తి.

చాలాహడావిడిగా వుంది రికార్డింగ్ థియేటరు. ముందు ఎవరెవరో కుర్చీల్లో కూర్చుని మాట్లాడుకుంటున్నారు. హాలులో సంగీత వాయిద్యాల శృతులు సరి చేసుకుంటున్న ధ్వనులు. థియేటరుకు ప్రక్కన ఓ మూలగా రాంబాబు, డైరెక్టర్ మాట్లాడుకుంటున్నారు.

"నమస్కారంసార్" వాళ్ళ దగ్గరికి వెళ్ళి వినయంగా అన్నాడు చక్రవర్తి.

"నమస్తే" అన్నాడు రాంబాబు ఇబ్బందిగా. వాళ్ళ మాటలు పూర్తయ్యాక మాట్లాడవచ్చని ప్రక్కగా నిలబడ్డాడు చక్రవర్తి.

"కూర్చోండి వస్తాను" చక్రవర్తి అక్కడ వుండటం ఇష్టంలేనట్లు అన్నాడు రాంబాబు.

అక్కడ నుంచి కదలి రికార్డింగ్ రూములోకి వచ్చాడు చక్రవర్తి. సౌండు ఇంజినీరు ట్రాక్‌మైకులను ఇతర పరికరాలను టెస్టు చేసుకోవటంలో నిమగ్నమై వున్నాడు. మూలగా వున్న కుర్చీలో కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నాడు అసిస్టెంటు డైరెక్టరు కిరీటి.

"హలో బావున్నారా" పలకరించాడు చక్రవర్తి.

"ఆ కూర్చోండి" నవ్వుతూ అన్నాడు కిరీటి.

"బిజీగా వున్నట్టున్నారు".

# ఆరోహణ

"ఏమీలేదండి పాట ఫెయిర్ కాపీలు తీస్తున్నాను."

"క్లబ్ సాంగే కదా రికార్డ్ చేస్తోంది"

చక్రవర్తి మొహంలోకి జాలిగా, బాధగా చూశాడు కిరీటి.

"ఔనండీ" అన్నాడు నిదానంగా.

"ఎవరితో పాడిస్తున్నారు" కుతూహలంగా అడిగాడు చక్రవర్తి.

చెప్పాడు కిరీటి.

కొన్ని నిముషాలు ఇద్దరి మధ్యా మౌనం. పాటఫెయిర్ కాపీలు తీయటంలో మునిగాడు కిరీటి.

"ఏదండీ ఒకసారి చూద్దాం" పాట కాగితం కోసం చేయి సాచాడు చక్రవర్తి.

చక్రవర్తి కళ్ళల్లోకి బాధగా చూస్తూ కాగితం అందించాడు కిరీటి.

ఆత్రుతగా చదివాడు చక్రవర్తి. కంపెనీ పేరు చూశాడు చరిత్రా క్రియేషన్స్ అని వుంది. రచయిత పేరు చూసి అదిరిపడ్డాడు. నెత్తిన పిడుగుపడినట్లు కంపించింది అతని శరీరం. తుఫానులో ఒంటరిగా ఏ దిక్కూ తోచక చిక్కుకు పోయిన వాడిలా వణికింది అతని హృదయం.

రచయిత పేరు చక్రవర్తికి బదులుగా 'శాస్త్రి' అని వుంది.

"ఇదేమిటి శాస్త్రి అని రాశారు" వేలుతో నొక్కి చూపుతూ అడిగాడు కిరీటిని.

సమాధానం చెప్పలేదు కిరీటి. విషాదంగా నవ్వాడు.

అర్థమైపోయింది చక్రవర్తికి. తాను రక్తాన్ని ఆవిరి చేసుకుని ఎంతో నమ్మకంతో, ఆశతో వ్రాసిన పాటను 'శాస్త్రి' పేరు మీద రికార్డు చేస్తున్నారు. నమ్మిన వ్యక్తే నిలువునా నీళ్ళలో ముంచేస్తున్నాడు. తన ఆలోచన, తన భావం, తన శ్రమ, తన శక్తి మరొకరి పేరు మీద తెరకెక్కబోతోంది. నిలువునా దోపిడీ చేయబడుతున్నాడు తను.

బాధతోను, కోపంతోను, ఆవేశంతోను ఎర్రబడింది చక్రవర్తి ముఖం. విసురుగా లేచి పెద్ద పెద్ద అంగలతో రాంబాబు దగ్గరకి నడిచాడు.

ఎర్రబడిన మొహంతో తన దగ్గరికి వస్తున్న చక్రవర్తిని చూడగానే విషయం అర్థమైంది రాంబాబుకి. చక్రవర్తిని మాట్లాడ నివ్వకుండా భుజంమీద చేయి వేసి రికార్డింగ్ థియేటరుకు దూరంగా తీసుకుని పోయాడు రాంబాబు.

"ఏమిటిసార్ ఏమిటిది నేనెంతో కష్టపడి రాసిన పాటను శాస్త్రిగారి పేరుతో రికార్డు చేస్తున్నారు" ఆవేశంగా అడిగాడు చక్రవర్తి.

"ఆవేశపడకు చక్రవర్తీ! ఇక్కడ ప్రతిదానికి ఎన్నో కారణాలు వుంటాయి" తాపీగా అన్నాడు రాంబాబు.

"ఏం కారణాలు సార్! అవకాశం ఇస్తానని ఆశపెట్టి నాతో రాయించుకుని ఇప్పుడిలా మోసం చేస్తారా" విసురుగా అన్నాడు.




"ఇది మోసంకాదు చక్రవర్తీ లౌక్యం. ఇప్పుడు ఈ రంగంలో మహా రచయితలుగా పేరున్న ఎందరో మొదట్లో ఇలా అవస్థపడ్డారు. కొన్నిటిని ఓర్చుకోవాలి. అప్పుడే పైకొస్తావు"

"ఓర్పుకుకూడా ఓ హద్దుందండీ! నా పేరు వేయటం ఇష్టంలేనప్పుడు నాతో ఎందుకు వ్రాయించుకున్నారు."

"నీ పేరెయ్యాలనుకున్నాను కాని నీ పేరువేస్తే ఇక ముందు నా సినిమాలకు రాయనని పట్టుబట్టారు శాస్త్రిగారు. ఎంతో మార్కెట్ వున్న ఆయనను నీ కోసం వదులుకోలేనుగా" అన్నాడు తప్పును శాస్త్రివేపు తోసేస్తూ రాంబాబు.

"అలాంటప్పుడు ఆయనతోనే వ్రాయించుకోండి" రోషంగా అన్నాడు చక్రవర్తి.

"వ్రాయించుకోలేకకాదు చక్రవర్తీ! కాని అంత టైములేదు. అందుకే ఇలా చేయవలసి వచ్చింది."

ఏదో అనబోయిన చక్రవర్తిని మధ్యలోనే ఆపాడు రాంబాబు.

"చూడు చక్రవర్తీ! ఒక మూడు నిమిషాల పాటను చిత్రీకరించటానికి దాదాపు ముప్పయివేలు ఖర్చవుతాయి. రికార్డింగు ఖర్చు, షూటింగు ఖర్చు, ఆర్టిస్టుకు పారితోషికం అన్నీ ఇవ్వాలి. ఇంత ఖర్చును ఏ మాత్రం పేరులేని నీ మీద పెట్టి రిస్కు చెయ్యమంటావా" తాపీగా అసలు విషయం చెప్పాడు రాంబాబు.

"ఆ విషయం మీకు ముందే తెలీదా"

"తెలుసు రిస్కు చేద్దామనే అనుకున్నాను. కాని అందుకు డిస్ట్రిబ్యూటరు ఒప్పుకోవటంలేదు నేను మాత్రం ఏం చేయగలను"

"వీల్లేదుసార్ నా పాట మరొకరి పేరు మీద రికార్డు కావటానికి నేనొప్పుకోను. ఇప్పుడే మీ మోసం అందరికీ చెప్పేస్తాను" కదిలాడు చక్రవర్తి.

"చక్రవర్తీ" రాంబాబు కంఠంలోని తీవ్రతకు అడుగు ముందుకు వేయబోయిన చక్రవర్తి ఆగిపోయాడు.

"ఇప్పటికే శాస్త్రిగారు ఎన్నోవేల పాటలు రాశారు. అలాంటి వ్యక్తి నీ పాట వాడుకున్నాడు అంటే ఇక్కడ వున్న ఎవ్వరూ నమ్మరు. పైపెచ్చు అవకాశం రాలేదన్న ఈర్ష్యకొద్దీ నువ్వే అబద్ధం చెబుతున్నావని అనుకుంటారు. నీ మీద అలాంటి ముద్రపడ్డం తరువాత ఏ నిర్మాతా నిన్ను పిలిచి రచయితగా పెట్టుకోడు జాగ్రత్త." కఠినంగా చెప్పాడు రాంబాబు.

"భయపెడుతున్నారా" రాంబాబు కళ్ళల్లోకి కోపంగా చూస్తూ అడిగాడు.

"కాదు నీ భవిష్యత్తును చేతులారా నువ్వే పాడు చేసుకోవద్దని చెబుతున్నాను. ఈ అవకాశం పోతే మళ్ళీ ఇంకొకటి వస్తుంది. కాని మొదట్లోనే చెడ్డపేరు తెచ్చుకున్నావా మళ్ళీ జీవితంలో కోలుకోలేవు."

మెత్తబడ్డాడు చక్రవర్తి ఆ మాటలకు. కాని భరించలేని బాధ. నవమాసాలు మోసి కన్న బిడ్డను ఎవరో పరాయి వ్యక్తి బలవంతంగా ఎత్తుకు పోతుంటే ఏమీ చేయలేని తల్లి మనసు పడుతున్న క్షోభ చక్రవర్తిలో.

దగ్గరకు వచ్చి భుజంమీద చేయివేశాడు రాంబాబు.

"చూడు చక్రవర్తీ! ఇంత సంజాయిషీ నేను నీకు ఇవ్వాల్సిన అవసరంలేదు ఎందుకంటే ఇక్కడ అబద్ధం చెప్పినా నా మాటకే విలువెక్కువ. కాని ఎందుకు చెప్పానంటే నాకు నీ ప్రతిభమీద నమ్మకం వుంది. వచ్చే సినిమాలో నీకు తప్పక అవకాశం ఇస్తాను" ఓదారుస్తున్నట్లు అన్నాడు రాంబాబు.

"అప్పుడూ ఇలా కాదని నమ్మకం ఏమిటండీ"

"నమ్మాలి చక్రవర్తీ! అంతే. ఆవేశపడి అంతా పోగొట్టుకుంటావో ఓర్పుతో సాధించుకుంటావో ఆలోచించుకో" అని అక్కడి నుంచి వెళ్ళిపోయాడు రాంబాబు.

అన్నీ పోగొట్టుకుని శూన్యంగా మిగిలినవాడిలా నిలబడ్డాడు చక్రవర్తి.

ఓ రచన వెలికి రావటానికి, ఒక భావం అక్షరాకృతి పొందటానికి రచయిత ఎంత ప్రసవ వేదన పడతాడో, ఎంత రక్తాన్ని ఆవిరి చేసుకుంటాడో, ఎన్ని నిదురలేని దీర్ఘ రాత్రులలో తనలో తాను జ్వలించి హరించుకు పోతాడో వాళ్ళకు తెలీదు.

ఒక మంచి రచనను సృజించటానికి రచయిత ఎంత ఆనందాన్ని ఎంత అనురాగాన్ని త్యాగం చేస్తాడో, ఏకాంతంగా ఎంత తపిస్తాడో మనసులో ఎంత మథనపడతాడో వాళ్ళకు అర్థంకాదు. వాళ్ళకు తెలిసిందల్లా వ్యాపారం

శ్రీరస్తు - శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాంనమః

# ఆంధ్రపత్రిక

పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణతో
త్వరలో వెలువడుతుంది

పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణతో
త్వరలో వెలువడుతుంది

## శ్రీ ప్రభవ నామ సంవత్సర పూర్ణశాస్త్రీయ పంచాంగమ్









'దైవజ్ఞచిన్తామణి' శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి,

'భాషాప్రవీణ' శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి సిద్ధాన్తి సోదరులచే గుణింపబడినది.

ఆంధ్రపత్రికా కార్యాలయము

ప్రతి 1-కి రూ. 5-00

గాంధీనగరం - విజయవాడ - 3. — బషీర్‌బాగ్ - హైదరాబాద్ - 29.

## ఆరోహణ

అనశ్వరమైన అక్షరాక్షయాన్ని డబ్బుతో తూచాలనుకోవడం.

బరువెక్కిన హృదయంతో కదిలాడు చక్రవర్తి. ఎదురుగా కిరీటి. చక్రవర్తి మొహంలోకి చూశాడు కిరీటి.

"బాధ పడకండిసార్! మీకూ ఓ రోజు వస్తుంది - ఆ రోజు మీరు వద్దన్నా అందరూ మీ వెంట పడతారు" ధైర్యం చెబుతూ అన్నాడు కిరీటి.

"ఎదురు చూడటం తప్ప ఏం చేయగలం కిరీటీ."

పాట రికార్డు కావటానికి ముందే అక్కడ నుంచి కదిలి రూముకు వచ్చేశాడు చక్రవర్తి. చాపమీద వాలిపోయాడు. ప్రతిక్షణం మోసానికి గురవుతున్న తన అసహాయత మీద అసహ్యం, తన చాతగానితనం మీద కోపం కలిగాయి. ఆశలతో పాటుగా కళ్లల్లోనే ఇంకి పోతున్న కన్నీళ్ళతో, ఘోషిస్తున్న మనసుతో అలాగే కలతనిద్రలోకి ఒరిగాడు.

తలుపు కొడుతున్న చప్పుడుకు లేచి లైటు వేశాడు చక్రవర్తి. శశాంక వచ్చాడేమో అనుకుంటూ తలుపు తీశాడు.

ఎదురుగా కిరీటి. మందువాసన గుప్పున కొట్టింది. తూలుతూ లోపలికి అడుగు పెట్టాడు కిరీటి.

"నువ్వూ - తాగుతావా కిరీటీ" బాధగా అడిగాడు చక్రవర్తి.

"ఈ ఫీల్డులో తాగనోడు ఎవడు కవిగారూ."

ఎన్నడూ లేనంత ఆనందం కలగ జేసింది చక్రవర్తికి కిరీటి 'కవిగారూ' అన్న పిలుపు.

"ఔను కిరీటీ ఎందుకిలా తాగుతారు అందరూ"

"జీవితంలో అన్నీ పోగొట్టుకుని ఇలా మిగిలిపోయామే అన్న బాధతో కొందరు తాగుతారు. డబ్బు కీర్తి సంపాదించాంకదా అన్న తృప్తితో కొందరు తాగుతారు." నవ్వుతూ చెప్పాడు కిరీటి.

"మరి నువ్వెందుకు తాగుతున్నావ్"

"నేనా? నాలో మంచితనం ఇంకా చచ్చి పోలేదని గుర్తు చేసుకోటానికి తాగుతున్నాను." గుండెమీద చేత్తో సున్నితంగా కొట్టుకుంటూ చెప్పాడు కిరీటి.

అతనిలోని బలహీనతకు బాధపడాలో నిజాయితీకి మెచ్చుకోవాలో తెలీక విషాదంగా నవ్వాడు చక్రవర్తి.

"శశాంక ఏడీ"

"ఏమో తెలీదు కిరీటీ, మధ్యాహ్నం వెళ్లాడు."

"అంటే రాత్రికి రాడా"

"చెప్పలేం ఒకోసారి వస్తాడు ఒకోసారి రాడు"

"ఎందుకొస్తాడులెండి ఎక్కడ ఏ అమ్మాయిని తారుస్తున్నాడో" ముద్దగా అన్నాడు కిరీటి.

శశాంకను అలా అన్నందుకు కోపం వచ్చింది చక్రవర్తికి.

"ఏమిటి కిరీటీ నువ్వు మాట్లాడేది" తీవ్రంగా అన్నాడు.

"అంటే మీకు తెలీదా కవిగారూ! ఔనులెండి వాడు నిజం మీ కెందుకు చెబుతాడు ఎప్పుడూ లేనిది ఈ రాత్రి నేనెందుకొచ్చాననుకొంటున్నారు" ఎదురు ప్రశ్నించాడు కిరీటి.

"ఎందుకొచ్చారు"

"ఎవరైనా అమ్మాయిని చూపిస్తాడని."

శశాంక అబద్ధాలు చెబుతున్నాడని కొంతకాలం క్రితమే గ్రహించాడు చక్రవర్తి. కాని ఈ విషయం విన్న తర్వాత శశాంక మీద చాలా అసహ్యం కలిగింది. ఇలాంటి వ్యక్తితో నా తాను కలిసి వుంటున్నది అనుకున్నాడు.

"ఛీ ఛీ ఇలాంటి పని చేశా బ్రతుకుతున్నాడు శశాంక" అసహ్యంగా అన్నాడు చక్రవర్తి.

"ఏమిటి కవిగారూ! ఏదో సొంత మనిషిని తార్చినట్టు బాధపడుతున్నారు. ఇక్కడ భార్యలను తార్చే మొగుళ్ళు, కూతుళ్ళను తార్చే తల్లులు, చెల్లెళ్ళను తార్చే అన్నలూ వున్నారు. ఎందుకో తెలుసా డబ్బుకోసం, వేషాలకోసం" అన్నాడు విరక్తిగా కిరీటి.

కంపరం కలిగింది చక్రవర్తికి.

"శశాంక ఎందుకీ పని చేస్తున్నాడో తెలుసా. హీరో కావాలని"

"అతనికంత డబ్బెక్కడిది" ప్రశ్నించాడు చక్రవర్తి.

"తెలివున్న వాడికి ఇక్కడ డబ్బు అక్కరలేదు. ఎందరో అమ్మాయిలు వస్తున్నారు అమాంతం హీరోయిన్‌లు కావాలని. ఆ వ్యక్తితో ఈ రాత్రి గడిపితే వేషం ఇస్తాడని అమ్మాయిలకు చెబుతాడు. ఆ అమ్మాయితో గడిపి తనకు వేషం ఇమ్మని ఆ దర్శకుడికో, నిర్మాతకో చెబుతాడు" పక పకా నవ్వుతూ మత్తుగా చెప్పాడు కిరీటి.

"ఆ విధంగా అయితే చాలా వేషాలు వచ్చి వుండాలి."

"అంటే వాళ్ళు తెలివితక్కువ వాళ్లనా మీ ఉద్దేశ్యం? అమ్మాయి కావలసి వచ్చినపుడు తప్ప వాళ్ళకు శశాంక గుర్తుకురాడు"

తల తిరిగి పోతోంది చక్రవర్తికి. దెబ్బ మీద దెబ్బ. ఎంత కృత్రిమత. లేనిపోని ఆశలతో నైతిక విలువలు దిగజార్చుకుని ఏ గమ్యం చేరతారు వీళ్లంతా. గ్లామరు కోసం ఎందుకీ బురదలో పొర్లాడుతున్నారు.

ఆ రాత్రి ఇక నిద్రపట్టలేదు చక్రవర్తికి.

(ఇంకా ఉంది)








# దూరదర్శనం

లత

శుక్రవారం (16.1.87) కార్యక్రమం స్వర మాధురితో ప్రారంభం అయింది - ముజతాబ్ ఆలీఖాన్ సితార్ - అంతోనీ మాథ్యూస్ వయొలిన్‌లతో జుగల్‌బందీ - ఫరవా లేదు. తెలుగు వాళ్ళే ఉండాలని రూలేంలేదు - మిశ్రతిలంగ్ అన్న రాగం విన్నాను గాని - మిశ్రకి తిలంగ్ అన్న రాగం వినలేదు. సంగీతవేత్తలనడగాలి అయినా చిన్ని తెర మీద పట్టే అక్షరాలు తప్పుకాకపోతే.

ఏ. అలేఖ్య చేసిన భరతనాట్యం రాగమాలిక చూపించారు. చూస్తే మూడో రోజే కార్యక్రమాలు చప్పబడ్డాయనిపిస్తున్నా - ఎన్ని నాళ్ళు ఎదురు చూశాం ఈ తీయని తెలుగు కార్యక్రమాల కోసం? కాని మూడో రోజే నిరాశ పరుస్తున్నాయి ఏమిటి? అలేఖ్య నృత్యం ఫరవాలేదు గాని సాయంత్రం భూపాల రాగం పాడిన గాయకురాల్ని ఏమనాలి? పైగా సుప్రభాతం అంది. ప్రాతఃకాలంలో భూపాల రాగంలో సుప్రభాతం నప్పుతుంది. సాయంత్రం పూట తెల్లవారు ఝాము అంటే ఎలా చద్దాం. భూపాలం తెల్లవారు ఝామున తప్ప పాడరని నర్తకికీ గాయనికీ తెలియకపోతే నాట్యశాస్త్రం దేనికి? నాట్యం దేనికి? మన టి. వి. లో సంగీతపు మాస్టర్లు దేనికి?

అనంతరం అంధుల మీద డాక్యుమెంటరీ చూపించారు.

అనంతరం వార్తలు వచ్చినయ్ - చదివిన అమ్మాయి చక్కగా చదివింది.

అనగనగా ఒక శోభ చివరి భాగం. అది వరకు ఏం జరిగిందో గాని ఇందులో మాత్రం మారువేషం వేసుకొని ఆస్తి ఇప్పించి పెళ్ళి చేయించాడు పద్మనాభం. ఇది హాస్యనాటిక కాబోలు. చిత్రహార్ ఇచ్చారు - అంటే హిందీ పాటలు అన్నమాట.

అంటే హిందీ న్యూస్ వచ్చే వరకూ తెలుగు నడవదా? టైమింగ్స్ కొంచం గందరగోళంగానే ఉన్నాయి.

యాత్ర - మొగల్‌సరాయి నుంచి ప్రారంభమయింది - ఒక పెళ్ళికాని స్త్రీని స్త్రీలే ప్రశ్నలు వేసి బాధించడం - స్టూడెంట్సు టికెట్ లేకుండా ప్రయాణిస్తూ అందరినీ అవమానిస్తూ పోలీసులు దింపే దాకా అల్లరి చేయడం, టికెట్ లేని స్త్రీ పడే అవస్థలూ కళ్ళకి కట్టినట్టు చూపించారు. మనకి కూడా కంభం నించి వరంగల్ దాకా స్టూడెంట్స్ అలాగే ప్రవర్తిస్తారు. సంస్కారం నేర్పని చదువులు మనవి. బాధ్యత లేని జీవన యాత్రలు మనవి. శ్యామ్ బెనెగల్ దర్శకత్వం ఈ భాగంలో రక్తికట్టింది.

17 న ఏమైపోతుంది? అనే ప్రశ్న "సుడిగుండాలు" ద్వారా మహానటుడు నాగేశ్వరరావుగారు మనందరికీ వేశారు. సుడిగుండాల కథ ఇది: చెత్త కామ సాహిత్యం 'సందులో సుందరి' లాటి సినిమాలు చూసి చెడిపోయిన టీనేజ్‌డ్ కుర్రాడు తన గరల్ ఫ్రెండ్ తమ్ముణ్ణి అవమానం తీర్చటం కోసం జడ్జి చంద్రశేఖరం గారి కొడుకు ఎనిమిదేళ్ళ రాజశేఖరాన్ని హత్య చేస్తాడు - కోర్టు వాళ్ళకి శిక్ష వేస్తుంది. తన జడ్జి పదవికి రాజీనామా ఇచ్చి లాయరు కోటు వేసుకుని ఆ పిల్లల తలిదండ్రులది లోపం అని నిరూపించి - ఏమైపోతుంది యువతరం అనే ప్రశ్న అడుగుతూ చంద్రశేఖరంగారు ప్రాణం విడుస్తారు. ఏమైపోతుంది? అనే ప్రశ్నార్థకంతో సినిమా అయిపోతుంది. ఆ సినిమా ఆ నాడే చూసి నాగేశ్వరరావు గారినీ, ఆదుర్తి వారినీ అభినందించింది లోకం. ఏమై పోతోందో చూస్తున్నారుగా. హత్యలు. హింసా ప్రవృత్తి సాహిత్యం సినిమాల వల్ల ఇంకా పెరిగినాయి. ఈ కథ ఇప్పుడు తీయాలి. లేదా ప్రతి వాళ్ళకీ థియేటర్లలో వేసి చూపించాలి. ఉద్యోగస్తులకు జీతాల్లో టికెట్ డబ్బు మినహాయించుకుని సినిమా చూపించాలి. నియోరిచ్ క్లాస్ ఆ సినిమా చూశామని టికెట్ ముక్కలు చూపించమనాలి. స్టూడెంట్సుని ప్రతి అధ్యాపకుడూ, బిడ్డల్ని ప్రతి తల్లీ ప్రతి తండ్రీ ఈ సినిమాకి తీసుకు వెళ్ళాలి. నాగేశ్వరరావు గారు సొసైటీకి ఈ ప్రశ్న వేసి ఏ విధంగా కళ్ళు తెరవమని ప్రబోధించారో! ఆ ప్రబోధం ఇప్పుడు అత్యవసరం - నటన ఒక యోగంగా పరిణతి చెందిన మహానటుడి నటన చూడటానికైనా నటన ప్రేమికులు సుడిగుండాలు చూడాలి. వందనం అభివందనం శ్రీ నాగేశ్వరరావు గారికి సుడిగుండాలు తీసినందుకు.

"అచ్యుత కన్య" పాత హిందీ సినిమా చూపించారు టి. వి. ఢిల్లీ కేంద్రంవారు. పాతకాలం సమస్యల్లో ఒకటైన అంటరానితనం ఆధారంగా తీసిన సినిమా మన "మాల పిల్ల" లాటిది. అశోక్ కుమార్ చిన్నగా తమాషాగా ఉన్నారు. దేవికా రాణి అందగత్తె అంటారు. ఇందులో సామాన్యంగా ఉంది - చివరికి ఈ అచ్యుతకన్య రైలు కింద పడి చనిపోయి ఊరి వారి చేత పూజింపబడుతుంది.

ఆదివారం 18-1-87 "తృష్ణ" - మానవుడి తృష్ణ వల్లనే కొండల్ని, సముద్రాల్ని, ఆకాశాన్ని లొంగ తీసుకొన్నాడు. తెరచాప ఓడలో సముద్రయానం మానవుడి తృష్ణకి మరో రూపం. అదే కథ - దీన్ని కథ అనే కంటే వాస్తవిక చిత్రణ అంటే బాగుంటుంది. నేవీ వర్కర్స్ ఆఫీసర్సు ఇందులో భాగస్వామ్యం ఉన్నవారు.. ఆ ఓడ పేరు తృష్ణ - ఎవరెస్ట్ హీరో ఆ హూలీవాలా కూడా మానవుడి ఈ తృష్ణ మహత్తరమైంది అన్నాడు. కంతమనేని సుధాకరరావు అనే ఆంధ్రుడు ఇందులో పాల్గొనటం మనకి గర్వ కారణం.

## ది ఓల్డ్ ఫాక్స్

బాంక్ దొంగతనం జరిగింది. దొంగని ఒక కుర్రాడు చంపాడు. సూట్‌కేసులో ఉన్న డబ్బు లేదు. అది ఎలా మాయమయింది. అది సమస్య - ది పాప్యులర్ ఇంగ్లీషు డిటెక్టివ్ సీరియల్ ప్రారంభం ఇది - సూట్‌కేస్ కొద్ది నిముషాల్లో ఎలా మారింది? అది సస్పెన్స్ - అదొక ఆడపిల్ల చేతిలో పడుతుంది. ఒక యువకుడు అది గ్రహించి - దాన్ని చేజిక్కించుకుంటాడు. సమయానికి వచ్చిన పోలీసు ఆఫీసర్ని చంపి పారిపోతూ పోలీసులకి చిక్కుతాడు. ఇలాటి సీరియల్స్ సమాజానికి చెరుపు కలిగిస్తాయి. భారత సమాజం ఇలా తయారవ్వాలా? థ్రిల్ కోసం అయినా అది అభిలషణీయం కాదు. ఎక్కడి షెర్లాక్ హోమ్స్? ఎక్కడి ఓల్డ్ ఫాక్స్. నాన్సెన్స్.

## ఖేల్ ఖేల్‌మే

లాటరీ అమ్మేవాడు ఏ టికెట్‌కి ప్రైజు వస్తే అది అనేక పేర్లతో తనే కాజేస్తూ ఉంటాడు. పిల్లలకి వచ్చిన అయిదు వేల లాటరీ కూడా అలాగే తీసుకుంటాడు. అది పట్టుకోవటం ఇందులో కథ.

## తస్వీర్ కా దూసరా రుఖ్

ఇది కొంత దూరం నడిచాక - ఫిలిం తెగిపోయింది.

టి. వి. విలేఖరులు గాని, అవతల వ్యక్తులు గాని మాట్లాడినప్పుడు జోక్ అనేది లేకపోయినా నవ్వుల ఎఫెక్టు వేస్తూ ఉంటారు పాపం - అందులో సహజంగా నవ్వురాదు గనక - ఇంతకంటే టి. వి.కి అవమానం తెచ్చిపెట్టే ప్రోగ్రాం లేదు.

## మాన్ - అభిమాన్

కథ చవటగా ఉంది. హీరో హీరోయిన్లు గొప్పగా చేయలేదు. సంగీతం ఓ మాదిరి. చాలా చవకబారు ఆర్డినరీ ప్రేమ జిగట. □

# "నాకూ ఆడదానిగా పుట్టాలనుంది"

యస్. భారతీదేవి

రాత్రి ఎనిమిది గంటలయింది. నెలరాజు వెన్నెలంతా భూమిపైనే కురిపిస్తూ, పుడమితల్లిపై తనకెంత ప్రేమో వ్యక్తం చేస్తున్నాడు.

అరవిచ్చిన మల్లెలు, జాజులు తమ పరిమళాలను నలువైపులా వెదజల్లుతున్నాయి. పారిజాతం చెట్టు ప్రక్కన గార్డెన్ ఛెయిర్‌లో కూర్చుంది మంజుల.

అప్పుడే వచ్చిన రవిచంద్ర స్కూటర్‌కు స్టాండ్ వేసి మంజుల కూర్చున్న దగ్గర కొచ్చి కుర్చీ లాక్కొని, కూర్చుంటూ, "మంజూ! ఉదయం హాస్పటల్ కెళ్ళావా?" అన్నాడు.

మంజుల సమాధానం చెప్పలేదు. ఆమె కళ్ళనుంచి కన్నీటి చుక్కలు మంచిముత్యాల్లా చెక్కిలిపైకి జాలువారుతున్నాయి.

"మాట్లాడవేం మంజూ?"

"వెళ్ళాను."

"డాక్టరేమంది?"

"పుట్టబోయే బిడ్డ ఆడపిల్లని చెప్పింది."

"అభివృద్ధి చెందిన శాస్త్ర పరిజ్ఞానంతో గర్భంలోని, శిశువు ఆడ, మగ కనిపెట్ట గలుగుతున్నారు. నిజంగా గర్వించదగిన విషయం."

"ఏమండీ."

"ఏమిటి మంజూ?"

"మనకొక పాపుంది కదా?" అంటూ అర్థోక్తిగా ఆగిపోయింది.

"ఉంటే?" రవిచంద్ర కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"ఇద్దరు పాప లెందుకు? ఎబార్షన్ చేయించుకుంటాను." అంది.

ఉలికిపడ్డాడు ఆ మాటకు రవిచంద్ర. ఒక్క క్షణం తను పొరపాటుగా విన్నానా అనుకున్నాడు.

"ఈ రోజుల్లో ఇద్దరాడ పిల్లలంటే మాటలా? మీ జీతం డబ్బులు, ఉంటున్న ఈ డాబా ఇల్లు తప్ప మనకేం స్థిరాస్తులు లేవు. లక్షాధికారులే, ఒక్క ఆడపిల్ల చాలనుకుంటున్నారు."

"మంజూ! ఎబార్షన్ చేయించుకుంటానని చెప్పటానికి, నీకు మనస్సెలా వప్పింది. మన ప్రేమ ప్రతి రూపాన్ని, మన చేతులతో మనమే చంపుకుందామా?"

"మీకు సెంటిమెంట్స్ ఎక్కువ. ఆడపిల్ల అని తెలియగానే, మా చెల్లెలు, వదిన కూడా ఎబార్షన్ చేయించుకున్నారు."

"ఆడపిల్లయినంత మాత్రాన, ప్రాణాలక్కూడా తెగించి ఎబార్షన్ చేయించుకోవాలా? మంజూ! ఈ బాధంతా ఎందుకు? డెలివరీ అయింతర్వాత, ఒకేసారి కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకుందువు గాని."

"అబ్బాయి, లేకుండానేనా?"

"మన కిద్దరమ్మాయిలు చాలు. అబ్బాయి లేకపోతేనేం?"

"నా కబ్బాయి కావాలి. ఇప్పుడు ఎబార్షన్ చేయించుకోను. ఈసారి అబ్బాయి పుడితే, అప్పుడు ఆపరేషన్ చేయించుకుంటాను."

మంజూను ఏమనాలో కూడా అర్థం కాలేదు రవిచంద్రకు. చదువూ, సంస్కారంలేని మనిషి కూడా కాదు. డిగ్రీ చదివింది. ఆమే అలా మాట్లాడుతుంటే ఆశ్చర్యమనిపించింది రవిచంద్రకు.

నేటి సభ్య సమాజంలో, జాతీయ అంతర్జాతీయ రంగాల్లో సైతం, పురుషుల కేమాత్రం తీసిపోలేదు. అయినా ఆడపిల్ల పుట్టిందంటే, చాలా మంది తల్లితండ్రులు మానసిక క్షోభతో కృంగిపోతారు.

"అమ్మో! ఆడపిల్లా! అని భయంతో వణికిపోతారు. ఆడవాళ్ళకు, ఆడవాళ్ళే శత్రువులు. వాళ్ళకు వాళ్ళే సమస్యలను సృష్టించుకుని, అందుకు కారణం పురుషు లంటారు.

ఆడపిల్ల పుట్టిం తర్వాత, ఉయ్యాలలో వేయటం, నామకరణ మహోత్సవం జరపటం లాంటి వేడుకలప్పుడు పదిమంది ఆడవాళ్ళు ఒకచోట చేరతారు. ఆడపిల్ల తల్లిని చూస్తూ, "అమ్మాయి పుట్టిందిగా? మీ వారు నిజాయతీగా ఉంటే లాభం లేదు. అక్రమంగానయినా సంపాదించాలి. లేకపోతే ఆడపిల్ల పెళ్ళి ఎలా చేస్తారు?" అంటూ దీర్ఘం తీస్తుంది ఒకామె.

"మరొకామె, ఆడపిల్లను కన్నందుకు ఆమె ఎంతో బాధపడుతున్నట్టుగా, ఆ ఆడపిల్ల తల్లిని ఈమె ఓదార్చే ప్రయత్నంగా, "మొదటిసారేగా? ఈ సారి అబ్బాయి పుడతాడు లేమ్మా." అంటూ అనునయిస్తుంది.

నిజానికి ఇటువంటి విషయాలను గురించి మగవాళ్ళు మాట్లాడరు.

ఆడవాళ్ళే, ఆడ పిల్ల పట్ల పక్షపాతం చూపుతారు. ఒకస్త్రీ ప్రధాన మంత్రి పదవిని అలంకరించిన ఈ రోజుల్లో కూడా, ఆడపిల్ల పుట్టడం పట్ల సంతోషాన్ని చూపరు. అదే మగపిల్లవాడు పుడితే, ప్రపంచ విజేతల్లా గర్వపడేది ఆడవాళ్ళే.

"వాడంటే మగాడు. వాడితో నువ్వు సమానమా?" అంటూ అమ్మాయిల మనస్సును గాయపరిచేది తల్లే.

తను కన్న ఇద్దరు బిడ్డల పట్ల కన్నతల్లే పక్షపాతం చూపుతుంది. ఒక విషయంలోనే కాదు. ఎన్నో విషయాలలో ఆర్థికపరమయిన ఇబ్బందుల మూలంగా ఇద్దర్నీ పెద్ద చదువులు చదివించలేకపోతే, చదువు మానిపించేది ఆడపిల్లనే.

"మాట్లాడరేం?"

"ఏం మాట్లాడ మంటావు?"

"నేను అబార్షన్ చేయించుకుంటాను."

"నాకిష్టం లేదు."

"ఒక పాపుంది కదా?"

"ఉంటే, రెండో పాప ఎక్కువవుతుందా?"

"మనకున్న ఆస్తులకు, ఇద్దరాడ పిల్లలా?"

"మంజూ! నేను పేదవాడినే కావచ్చు. కానీ, నా భార్యా బిడ్డలను పోషించుకోలేని అసమర్థుణ్ణి కాదు." కోపంతో రవిచంద్ర ముఖం కందిపోయింది.

"నేనలా అనలేదు." అంది మంజుల అతనికి కోపం వచ్చిందని గ్రహించి.

"ఆశావాది విమానాన్ని తయారు చేస్తే, నిరాశావాది విమాన ప్రమాదం జరిగితే చావు తప్పదన్న భయంతో ప్యారాచుట్‌ను కనిపెట్టాడు. నీ దృష్టిలో విమానాన్ని కనిపెట్టిన ఆశావాది గొప్పవాడే కావచ్చు. నా దృష్టిలో మాత్రం నిరాశావాదే గొప్పవాడు. మనమ్మాయిలు పెళ్ళి కొచ్చేసరికి, వరకట్న సమస్యే ఉండక పోవచ్చు. లేదా వాళ్ళు కట్నకానుకల సమస్య లేకుండా వాళ్ళకు నచ్చిన వాళ్ళను ప్రేమించి పెళ్ళి చేసుకోవచ్చు. ఇప్పుడు శిశువు గర్భంలో ఉండగానే ఆడో, మగో తెల్సుకుంటున్నారుగా? అమ్మాయిలు వద్దనుకున్న నీలాంటి ఆడవాళ్ళు, ఎబార్షన్ చేయించుకుంటుంటే, కొంత కాలానికి, మన దేశంలో ఆడవాళ్ళ కొరత ఏర్పడవచ్చు. అప్పుడు, మగాళ్ళు ఆడవాళ్ళకే కట్నాలిచ్చి పెళ్ళిళ్ళు చేసుకుంటారేమో. భవిష్యత్‌లో ఎప్పుడు ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు?"

కళ్ళు విప్పార్చుకుని చూస్తూ కూర్చుంది మంజుల.

"మంజూ! ఆడపిల్లంటే, నీ కిష్టం లేకపోవటానికి కారణం వాళ్ళకు కట్నాలిచ్చి పెళ్ళిళ్ళు చెయ్యలేమనా? ఇంకేమయినా కారణముందా?" అన్నాడు అనునయంగా.

"అదొక భయమయితే, సరైన భర్త లభించక పోతే వాళ్ళ భవిష్యత్ ఏమవుతుందో అన్న ఆందోళన, నాకు పుట్టబోయేది ఆడపిల్ల అని తెల్సింది

[illegible] నాకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నాయండీ" అంది ఏడుస్తూ.

"నీ భయం అర్థంలేనిది మంజూ!" అన్నాడు అనునయంగా.

"కాదండీ! రోజూ, పేపరు వార్తలు చూస్తున్నారుగా? కట్నం తేలేదన్న కోపంతో, కోడలిమీద కిరసనాయిలు పోసి నిప్పంటించారనో, కట్నం కానుకలు పూర్తిగా తేలేదని అత్తింటి వారి సాధింపులు భరించలేకా, తన పెళ్ళి చేసి అప్పుల పాలయిన పుట్టింటి వారిని ఇంకా డబ్బు ఇవ్వమని అడగలేక ఆత్మహత్య చేసుకున్న యువతి. ఇలాంటి వార్తలు చదివినప్పుడల్లా, నాకూ ఆడపిల్ల ఉందికదా? దాని భవిష్యత్తు ఎలా ఉంటుందో అని వణికి పోతానండీ. ఇప్పుడు రెండో పాపకూడా పుడితే, వాళ్ళకు కట్నాలు, కానుకలు, లాంఛనాలు అన్నీ ఘనంగా ఇచ్చి పెళ్ళిళ్ళు చెయ్యగలమా? వాళ్ళు సుఖపడ గలరా అన్న ఆలోచనలు పాము పిల్లల్లా మెలికలు తిరుగుతూ, నన్నెంత కలవరపెడతాయో మీకు తెలియదండీ."



"గర్భం ధరించగానే, మాతృత్వాన్ని పొంద బోతున్నానని ఆడది ఎంత గర్వపడుతుంది? పశువులూ, పక్షులూ కూడా మాతృత్వాన్ని పొందాలనుకుంటాయే. అటువంటిది మాతృ మమకారాన్ని చంపుకుని, నేను ఎబార్షన్ చేయించుకుందామన్న నిర్ణయానికి వచ్చేముందు నాలో నేను ఎంత కుమిలి పోయానో మీకు తెలియదు." అంది కన్నీటితో.

"మంజూ! చిన్న చిన్న విషయాలను, భూతద్దంలో నుంచి చూస్తూ, ఏమేమో ఊహించుకుని, నీ ఊహలకు నువ్వే భయపడుతున్నావు."

"నేను చెప్పింది నిజం కాదంటారా?"

"ఇవన్నీ మీ ఆడవాళ్ళు సృష్టించుకున్న సమస్యలు. వాటితో వ్యాపారాన్ని పెంచుకుంటున్నాయి కొన్ని పత్రికలు. ఆడవాళ్ళంతా చెడ్డవాళ్ళు. మగాళ్ళంతా మంచివాళ్ళు అనికాదు నా ఉద్దేశ్యం. మన విషయం తీసుకో. నిన్ను నేను గానీ, మా అమ్మా నాన్నగారుగానీ బాధపెడుతున్నారా. నీ పరిధిలో వాళ్ళను చూడు. మీ చెల్లెలు, మీ మరిది, మా అక్కా, బావగారు, మీ అమ్మా, నాన్నగారు, మా అమ్మా నాన్నగారు ఎంతన్యోన్యంగా కాపురాలు చేసుకుంటున్నారు? ఎక్కడో ఒకచోట, ఎవరో ఆత్మహత్య చేసుకున్నారని, ప్రతి ఆడపిల్లకూ అలాంటి సమస్యే ఎదురవుతుందనీ, అలాగే ఆత్మహత్య చేసుకుంటుందని, ఎందుకనుకోవాలి?"

ప్రతిరోజూ, ఇలాంటి చావుల గురించి పేపర్లలో చూస్తూనే ఉంటాం."

"మంజూ! నాకు అబ్బాయి కావాలని లేదు" అన్నాడు రవిచంద్ర హాస్యంగా నవ్వుతూ.

"అబద్ధం. ఎవరయినా అబ్బాయి కావాలనే కోరుకుంటారు. నేను బాధపడుతున్నానని అలా అంటున్నారు."

"లేదు మంజూ! నిజంగా నాకు అబ్బాయి కావాలని లేదు. అబ్బాయి అయితే, వాడూ నాలాగే శ్రమపడాలి. నా పిల్లలు శ్రమ లేకుండా హాయిగా, సుఖంగా బ్రతకాలని కోరుకుంటున్నాను. అందుకే నాకబ్బాయొద్దు."

"ఏమిటి? మీరు శ్రమపడుతున్నారా? ఉదయం పది గంటల కెళతారు ఆఫీసుకు. సాయంత్రం అయిదున్నరకల్లా ఇంట్లో ఉంటారు. నెలకు పదిహేను వందలు జీతం తీసుకుంటున్నారు. అది కూడా శ్రమేనా?"

"కాదా? అబ్బాయి పుట్టాడనుకో. వాడు కష్టపడి ఏదో ఒకపని చెయ్యాలి. భార్యా బిడ్డల్ని పోషించాలి.

## అపరంజి

పుట్టకముందు
భువిలో బంధీ
జన్మనెత్తాక
చీకటి కొట్లో బంధి

-టి. వీరాస్వామి

## "నాకూ ఆడదానిగా పుట్టాలనుంది"

అమ్మాయి పుట్టిందనుకో. దానికి నచ్చిన అబ్బాయిని పెళ్ళి చేసుకుంటుంది. అతనిరక్షణలో, అతని పోషణలో, రేపు ఎలా? అన్న సమస్య, బాధా లేకుండా దాని జీవితం హాయిగా గడిచిపోతుంది."

"మంజూ! నువ్వున్నావు. ఏడు గంటలకు నిద్ర లేస్తావు. నేను నువ్వు పెట్టిన ఉడికీ, ఉడకని అన్నం తిని రెండు సిటీబస్సులు మారి ఆఫీసుకు చేరాలి. నేను ఆఫీసుకు వెళ్ళిం తర్వాత, టి.వీ చూస్తూనో, రేడియో వింటూనో, నవలలు చదువుతూనో, సమయాన్ని, నీ జీవితాన్ని కూడా నీ ఇష్టమొచ్చిన రీతిగా గడుపుతావు. నేను అయిదున్నరకు ఇంటికి రాకపోతే నీకు కోపం వస్తుందేమో అని భయం. నెలాఖరులో డబ్బు చాలకపోతే, అప్పు చెయ్యాలేమో అన్న భయం, ధరలు ఆకాశాన్నంటుతున్న ఈ రోజుల్లో, ఎవరయినా బంధువులొస్తే, బడ్జెట్టు పెరుగుతుందేమోనన్న భయం. ఇలా కుటుంబాన్ని పోషించే మగాడికి ఎన్ని సమస్యలు?"

"ఏమండీ! ఆఫీసు నుంచి వస్తూ కూరగాయలు తీసుకురండి. సరుకులు అయిపోయాయి. తీసుకురండి. దసరాకు వెంకటగిరి జరీ చీర తీసుకురండి. అని గోముగా చెబుతావు. బాధ్యతలు, సమస్యలు లేకుండా నువ్వెంత హాయిగా గడుపుతున్నావు?"

"ఒకోక్క రోజు "ఈ పూట వంట చెయ్యలేనండీ. క్యారియర్ తెచ్చుకుందాం" అంటావు. అలాగే అంటాను నేను. మంజూ! శారీరకంగా బలంగా, మగాడిని సృష్టించాడే తప్ప, ఆ భగవంతుడు ప్రత్యేకతలన్ని మీకే ఇచ్చాడు. మాతృత్వపు మమకారాన్ని పొందేది మీరు. పసిబిడ్డకు పాలిస్తూ మాతృత్వపు మమకారాన్ని పొందేది మీరు. రంగుల చీరలు, రకరకాల పూలతో ముస్తాబయ్యేది మీరు. ఖరీదయిన నగలు, బాధ్యతలేని జీవితం. అన్నీ పొందేది మీ ఆడవారే."

"నా దేముంది? నువ్వు పెట్టిన భోజనం తినటం, నువ్వు చెప్పిన వస్తువులు తేవటం, కుటుంబ భారాన్ని మోయటం. నాకు కావలసిం దేముంది? సంవత్సరానికి నాలుగు జతల బట్టలు తప్ప. నేనే కాదు. ఏ మగాడి బ్రతుకయినా అంతే. అనుభూతులు, పులకరింతలు, అలంకరణలు, అన్నీ మీవే . మంజూ! ఒక్కోసారి నిన్ను చూస్తుంటే నాకేమనిపిస్తుందో చెప్పనా?" అన్నాడు నవ్వుతూ.

భర్త మాటలు విన్న తర్వాత, ఉదయం నుంచి మనస్సులో గూడుకట్టుకున్న దిగులు మాయమయి, నూతనోత్సాహం చోటు చేసుకుంది. తేలికపడిన మనస్సుతో, "ఏమనిపిస్తుంది?" అంది నవ్వుతూ.

"మరో జన్మంటూ ఉంటే, మగాడిగా కాకుండా నాకూ ఆడదానిగా పుట్టాలనుంది" అన్నాడు నవ్వుతూ.

"నాకూ అంతే అనిపిస్తుందండీ" అంది గారంగా.

"ఎబార్షన్ చేయించుకుంటావా?"

"ఊహు. పాప పుట్టింతర్వాత కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకుంటాను. అబ్బాయి పుట్టకపోయినా ఫరవాలేదు. ఇద్దరమ్మాయిలు చాలు." అంది నవ్వుతూ.

సమ్మోహనకరమయిన ఆమె చిరునవ్వుకు, పరవశించి పోయిన రవిచంద్ర ప్రేమగా ఆమెను కౌగిలిలో ఇముడ్చుకుని ఆమె తలమీద గాఢంగా చుంబించాడు. □






పాఠకుల శీర్షిక

# గర్భస్థ శిశువు చెప్పిన కథలు

## "కనువిప్పు"

"ఏమండీ మీకు పాప కావాలా? బాబు కావాలా?'

పడగ్గదిలో – డబుల్‌కాట్‌పై, ఫోం బెడ్ మీద పడుకున్న భార్య అనూరాధ పొట్టపై చెవి ఆనించి, తన్మయత్వంతో ఏవో శబ్దాలు వింటూ, పుట్టబోయే శిశువుని గురించి మధురంగా ఊహించుకుంటున్న శరత్ భార్య వంక వింతగా చూశాడు.

'ఏం నాకిష్టమైన వాళ్ళనే కంటావా?' అన్నాడు శరత్ నవ్వుతూ.

'అబ్బ చెప్పండి. మీ కెప్పుడూ వేళాకోళమే' అంది చిరు కోపంతో మూతి సున్నాలా చుట్టి.

శరత్‌కి ఆ ఫోజులో భార్య ఎంతో అందంగా కనుపించింది. ఆమె తల్లోని మల్లెలు వింత పరిమళాన్ని వెదజల్లుతున్నాయి.

'ఏమిటి అలా చూస్తారు? మాట్లాడరేం??'

భార్య రెట్టించి అడగటంతో ఈలోకంలో కొచ్చాడు శరత్. 'నా కిద్దరూ ఇష్టమే! పెళ్ళయిం తర్వాత – అమ్మాయి అత్తారింటికి వెళ్తుంది. అబ్బాయి వేరు కాపురం పెడతాడు. అభిమానం వుండాలి గానీ ఎవ రయితేనేం? అంచేత నా కిద్దరూ సమానమే'. తేల్చి చెప్పాడు శరత్.

'ఏమోనండీ! నాకు భయంగా



ఉంది. అత్తయ్యగారేమో మొదటి కాన్పు మగపిల్లాడైతే బాగుంటుం దన్నారు. మా పుట్టింటి వాళ్ళు కూడా మగపిల్లాడు పుట్టాలని దేవుడికి మొక్కుకున్నారట. ఆడ పిల్ల పుడితే వాళ్ళంతా నిరుత్సాహ పడతారు. పోనీ, పరీక్ష చేయించుకొని మగపిల్లాడు కాకపోతే, ఎబార్షన్ చేయించు కుంటే ఎలా ఉంటుంది?' భయంగా భర్త వంక చూస్తూ అడిగింది రాధ.

'రాధా! నీకేమయినా మతి పోయిందా?' అంటూ అరిచాడు శరత్. 'వాళ్ళేదో తెలియక అలా అన్నారను కుందాం. మరి చదువుకున్న దానివి. నీకేమయింది? లేనిపోని అను మానాలు పెట్టుకోకు. కాలం మారింది. మనుషులూ మారు తున్నారు. ఇప్పుడు స్త్రీ పురుష లిరువురూ చదువుకొని, ఉద్యోగాలు చేస్తున్నారు. ఎవరి కాళ్ళ మీద వాళ్ళు నిలబడుతున్నారు. మన కిద్దరు పిల్లలు చాలు. వారు పాపలైనా, బాబులైనా సరే!' అన్నాడు శరత్ స్థిరంగా.

భర్త లెక్చర్‌కు అబ్బురపడింది రాధ. వెంటనే అతని మొహాన్ని చేతుల్లోకి తీసుకొని, బుగ్గపై ముద్దు పెట్టుకుంది. 'మీరెంత మంచి వారండీ' అంది మెచ్చుకోలుగా, శరత్ కోపం మటుమాయమయింది.

మరో కొంత కాలానికి రాధ పండంటి పాపను కన్నది. బంగారు బొమ్మలాంటి ముద్దు లొలికే పాపను చూచి మురిసి పోయాడు శరత్. శరత్ అమ్మ పార్వతమ్మ, రాధ పుట్టింటి వాళ్ళు మాత్రం అయిష్టంగా మొహం పెట్టి, ఆ ఛాయలకు కూడా రాలేదు.

రాధకి రెండో సారి బాబు పుట్టాడు. పార్వతమ్మ ఆనందానికి పట్ట పగ్గాల్లేకుండా పోయింది. విక్రమ్ అని పేరు పెట్టింది. తనే అల్లారు ముద్దుగా పెంచి పెద్ద చేసింది.

కాలగమనంలో పిల్లలిద్దరూ పెరిగి పెద్దవాళ్ళయ్యారు. జ్యోతి డాక్టరు గానూ, విక్రమ్ ఇంజనీరుగానూ ఉద్యోగాల్లో చేరారు. వాళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళు కూడా అయిపోయాయి.

పార్వతమ్మకు అనుకోకుండా జబ్బు చేసింది. హాస్పటల్లో చేర్పించారు. పార్వతమ్మ పిల్లలిద్దర్నీ పిలిపించ మంది కొడుకుని. శరత్ పిల్లలిద్దరికీ ఉత్తరాలు వ్రాశాడు.

జ్యోతి నాయనమ్మను చూడాలని రెక్కలు కట్టుకొని వాలింది. పార్వ తమ్మకు ఊపిరితిత్తుల్లో నీరు పట్టింది. జ్యోతి డాక్టరయినా గర్వం లేకుండా, తగ్గిందాకా బెడ్ దగ్గరే వుండి పార్వతమ్మకు అన్ని సపర్యలూ చేసింది.

విక్రమ్ శెలవు లేదంటూ రాలేదు



పార్వతమ్మ ఎంతో బాధపడింది. ఆమెకి గతం కళ్ళ ముందు మెదిలింది.

"మొదటి కానుపు మగపిల్లాడు కావాలనుకుంది. ఆడపిల్ల పుట్టిందని తెలిసి చూట్టానికి కూడా వెళ్ళలేదు. విక్రమ్‌ని ఎంతో గారాబంగా పెంచింది. మగపిల్లాడు వంశోద్ధారకుడనీ, పెద్దల్ని కనిపెట్టుకుని వుంటాడనీ ఆశించింది. తను ఆనాడు నిర్లక్ష్యం చేసిన జ్యోతి ఇప్పుడు తనను ఆదుకుంది. అల్లారు ముద్దుగా చూచుకున్న విక్రమ్ చూట్టాని క్కూడా రాలేదు.' ఆమె మనసంతా పశ్చాత్తాపంతో నిండి పోయింది.

ఆమె భ్రమలు తొలగి పొయ్యాయి. కనువిప్పు కలిగింది. 'అమ్మా జ్యోతీ, నా బంగారు తల్లీ' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

'ఊరుకో నాయనమ్మా తగ్గిపోతుం దిలే' అంటూ ధైర్యం చెప్పింది జ్యోతి.

సూర్యదేవర జోగేశ్వరరావు,
ఇబ్రహీంపట్నం.

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన వారి పేరు : ______________________

______________________

పూర్తి చిరునామా ______________________

పిన్ కోడ్ : ______________________

# సమదృష్టితో స్వీకరించాలి

తమకు పుట్టిన బిడ్డ ఆడదయినా, మగదయినా, ఆ బిడ్డని పెంచి, పెద్ద చేసే బాధ్యత ఆ తల్లి దండ్రుల మీద వుంటుంది. కాని పుట్టబోయే బిడ్డ ఆడదని ముందుగా తెలుసుకుని అబార్షను చేయించు కోవడం, మనం సంపాదించుకున్న విజ్ఞానాన్ని మన నాశనం కోసమే వుపయోగించు కొన్నట్టవుతుంది.

మన ప్రకృతిలో ఎన్నో సహజమైన ప్రక్రియలూ, నియమాలూ వున్నాయి. వాటిలో ఏది లోపించినా, మానవ జీవితంలో ఎన్నో వెలితిలు అగుపిస్తాయి. అలాగే ఈ ప్రకృతిలో స్త్రీ – పురుషుల భేదం. సహజంగా జన్మించే శిశువు ఆడదయినా, మగదయినా బ్రతికే హక్కును ఆబిడ్డకి కల్గించాలని ప్రతీ తల్లి – తండ్రులూ తెలుసుకోవాలి. ఆడ బిడ్డపైన చిన్న చూపు చూడటం ఒక విధంగా నైతిక నేరం అవుతుంది. ఎందుకంటే, స్త్రీ లేక పోతే సంతానమిలా వర్ధిల్లుతుంది? ( అలాగే పురుషుడు లేక పోయినా




వర్ధిల్లదు అందువలన ఇద్దరూ సమానులు కదా!) ప్రతీ పురుషుడికి ఏదో విధంగా స్త్రీ అలాగే స్త్రీకి పురుషుడూ అవసరం. వారిలో ఏ ఒక్కరు లేక పోయినా మానవ జీవితం కుంటుపడినట్టే. అందువలన జన్మించే శిశువు ఆడదయినా, మగదయినా సమదృష్టితో స్వీకరించాలి.

నేటి సమాజంలో స్త్రీలు ఎంతగానో అభివృద్ధిని సాధించారు. ఎన్నో రంగాలలో ముందున్నారు. జాతి గౌరవాన్ని కాపాడిన మన మహిళా అథ్లెటిక్స్ దానికి మంచి వుదాహరణ. ఆడదానికి జరుగుతూన్న అన్యాయాన్ని కళ్ళారా చూస్తూ, ఆడవాళ్ళని కనడం మానేస్తామని అనే తల్లులు కాస్తంత విశాల దృష్టితో ఆలోచించాలి. వారు సహజంగా పొందే బిడ్డ మగబిడ్డే ఎందుకవ్వాలి. పుట్టిన బిడ్డని మంచి మార్గంలో నడిపిస్తే, ఉత్తమ



వ్యక్తిగా తీర్చి దిద్దితేచాలు. వారిబిడ్డ ఆడదయినా, మగబిడ్డని మరి పిస్తుంది.


ఎన్. కృపావర్మ,
చళ్ళూరు క్యాంప్ (కర్నాటక)


* * *

# స్వాగతం – సుస్వాగతం

నిర్మల మైన ఆకాశంలో చూస్తూ, ఆలోచనలో పడింది మానస. డాక్టర్ తనకు కవలలు పుట్టవచ్చునని పరీక్ష చేసి చెప్పడంతో మరింత దిగులు పడింది. ఇదే తనకు తొలి కాన్పు. మొదటి సారికదా అబ్బాయి కావాలనుకుంది. మానస పోస్టు గ్రాడ్యుయేట్ అయినా, అతి సాధారణమైన స్త్రీ లాగే కోరుకుంది. కాని "ఇప్పుడు 'కవలలు' కలిగితే? ఇద్దరు అబ్బాయిలే అవుతారా లేక ఇద్దరు అమ్మాయిలే అవుతారా. అనే తీవ్రమైన సమస్య ఎదురైంది. ఆలోచనతో సతమత మవుతుంది. డాక్టర్, ఆమెకు ప్రశాంతంగా, నిర్మలంగా వుండాలంటుంది. కాని సమస్య పరిష్కారం కావడం లేదు. ఇద్దరు అమ్మాయిలైతే ఎలా?

"ఏయ్ మానసా, ఏమిటోయ్ పరధ్యానం " అన్నాడు లోనికి వస్తూ ప్రభూ

'అబ్బే ఏమిలేదండి'. అని తడబడింది.

"చూడు మానూ, నీ సమస్య తెలుసోయ్. ఇద్దరు అమ్మాయి లైతే ఏలా?వాళ్ళకు చదువు, పెండ్లి ఎలా చెయ్యాలి?ముఖ్యంగా వాళ్ళను జాగ్రత్తగా పెంచడం ఏలా అనికదూ. ఏం చక్కా అబ్బాయి లైతే కట్నం అడగవచ్చు. ఏ బాధ లేక పెంచవచ్చు అని కదూ నీ ఆలోచన?"

మౌనంగా తలవంచుకుంది మానస. "మానూ నే చెప్పేది విను. అమ్మాయిలనైనా, అబ్బాయిలనైనా మనం సంతోషంగా ఈ లోకం లోకి ఆహ్వానించాలి. అబ్బాయిలు ఎక్కువ. అమ్మాయి లయితే కష్టం. అనే ఆలోచన నీలాంటి 'చదువుకున్న అమ్మాయి'కి కూడా రావడం నిజంగా విచారించ తగ్గ విషయం, చూడు పుట్టేది ఏ బిడ్డ అయినా చక్కగా చదువు– సంస్కారం కలవాళ్ళుగా మనం తీర్చి దిద్దాలి. ముఖ్యంగా మానవత్వం, విశాల హృదయం కలవాళ్ళుగా పెంచాలి. అంతే కాని తేడాలు చూడకూడదు. అప్పుడే తేడా లేకుండా సమంగా పెరుగు తారు." అన్నాడు సన్నగా మందలిస్తూ.

"అబ్బే ! అదికాదండి అని ఏదో చెప్పాలనుకుంది మానస. "చూడు నీకడుపున 'ఇందిరా గాంధి' లాంటి ధీశాలి అయిన అమ్మాయిలో లేదా సరోజినిదేవి లాంటి కవయిత్రో పుట్టవచ్చు కదా. లేదా నీలాంటి మంచి మనసున్న చిన్ని మానసలు పుట్టవచ్చు. సరేనా ఇంతటితో ఈ సమస్యను ఒదిలిపెట్టు" అన్నాడు ప్రభూ.



తనకు 'యూనివర్శిటీకి' టైమ్ అయిందంటూ త్వర త్వరగా రెడి అయి వెళ్ళిపోయాడు. ప్రభూ వెళ్ళిన తర్వాత కూడ మానస ఆలోచనలు వీడలేదు. అంతలో 'అమ్మా , అమ్మా' అంటూ చిన్న చిన్న మాటలు విన వచ్చాయి. ఎక్కడా అని పరిశీలనగా చూస్తూన్న మానస, అది తన కడుపులోనించే అని తెలిసి ఆందోళన పడింది.

'అమ్మా, భయపడకమ్మా, నాన్న లాగ నీవు కూడ విశాలమైన భావాలతో ఆలోచించమ్మా. అందరూ అబ్బాయిలే కావాలని కోరుకోవడం, వారిని హెచ్చుగా వుంచుతారు. ఏం అమ్మ! అమ్మాయిలు పుట్టడం తప్పా, అలా అని వారిని కించ పరచవద్దు. నీకు పుట్టే ఏ బిడ్డనైనా చక్కగాపెంచి, గొప్ప పౌరులుగా తీర్చిదిద్దమ్మా.



మేము బాగా చదువుకొని విజ్ఞానాన్ని సంపాదించి, నీకు, నాన్నకి మంచి కీర్తిని, గౌరవాన్ని తెస్తామని మాట ఇస్తున్నాము" అన్నాయి జంటగా.

సంతోషంగా లేచింది మానస. పుట్టబోయే శిశువులకు అన్నీ అమర్చి ఆనందంగా స్వాగతం చెప్పాలని.


–కుమారి 'మీరా';
కొంగరెడ్డి పల్లి (చిత్తూరు) □

## సీరియల్

# ఒకటి ఒకటి మూడు

### తేజోవతి



(గత సంచిక తరువాయి)

లక్ష్మి తన గదికి వెళ్ళి చీర మార్చుకుని జడ వేసుకుని వచ్చింది. డాక్టరుగారు పొద్దున వేసుకున్న పైజమా లాల్చీతో నే వున్నారు.

లక్ష్మి వెళ్ళి ఆయన గది వాకిట్లో నిలబడగానే లేచి వచ్చారు.

"కాఫీ టిఫిను తీసుకుని వెళితే గుడి దగ్గర్నుండే వెళ్ళిపోవచ్చు."

తూర్పున బంగాళాఖాతం, పడమటి అరేబియా మహా సముద్రం, దక్షిణాన హిందూ మహా సముద్రం యీ మూడూ ఒక్కచోట కలిసే అగ్రమే కన్యాకుమారి అగ్రం..... ఒకానొకచోట నిలబడి చూస్తే మూడు సముద్రాల నీళ్ళు వేర్వేరు రంగుల్లో కనబడతాయి కూడా.... ఆ అగ్రంలో వున్న దేవత కన్యాకుమారి....

కన్యాకుమారి అమ్మవార్ని చూస్తుంటే యింకా యింకా చూడాలని పిస్తుంది.... అంతటి ఆకర్షణ వుంది ఆ దేవి మొఖంలో. ముక్కుకున్న ముక్కెర కాంతి వెనక నావికులకు దోవ చూపించేదని ప్రతీతి.

ఆ దేవి స్వరూపాన్ని ఎంత చూసినా తనివి తీరలేదు లక్ష్మికి.

"వెళదాం.... మళ్ళీ బోటు దొరకదు."

వెనకనుండి విన్పించిన స్వరానికి చిన్నగా నిట్టూర్చి బయలు దేరింది లక్ష్మి. పొద్దున సముద్ర స్నానానికి బయల్దేరేటప్పుడున్న చిరునవ్వు, సరదా, ఆ చనువూ యిప్పుడు లేవు శ్యామసుందర్‌గారిలో.

ఎవరో పరాయివాడి భార్యను తీసుకొచ్చి డ్యూటీగా చూపిస్తున్నట్లు దూరంగా, నిర్లిప్తంగా, గంభీరంగా, మౌనంగా....

లక్ష్మి కూడా మౌనంగానే వెంట నడిచింది.... శ్యామసుందర్‌గారు టిక్కెట్లు తెచ్చారు....

తీరం నుండి వివేకానందా రాక్ దాకా పడవ ప్రయాణం చాలా సరదాగా వుంటుంది నిజానికి.... ఎగిసిపడే అలల మధ్య వుయ్యాల లూగుతున్న పడవ..... ఆ నీటి తుంపరలు పక్కన కూర్చున్న వాళ్ళమీద పడి సరదాగా కేరింతలు కొడుతుంటే....

డాక్టరుగారు అంత గంభీరంగా లేకపోతే లక్ష్మి నిజంగా చాలా ఆనందించి వుండేది.... తను కూడా చిన్న పిల్లల్లా ఎగిరి గంతు లెయ్యాలని ఎన్నోసార్లు అనిపించింది కూడా....

వివేకానందుడు మూడు రోజులపాటు సముద్రంలోని ఆ చిన్న కొండమీద కూర్చుని దేశ సమస్యలను గురించి ఆలోచించాడని, తపసు చేశాడని అంటారు.

అక్కడి వాతావరణం ఎంతో ప్రశాంతంగా వుంటుంది. అక్కడ ధ్యాన మందిరంలో మనం ఎంతసేపు కూర్చోవాలనుకుంటే అంతసేపు కూర్చుని ధ్యానం చేసుకోవచ్చు.....

అనంత జలరాశి మధ్యలో ఆధునికంగా వున్న ఆ వివేకానందుని స్మారక భవనాన్ని చుట్టూ తిరిగి చూసి కాసేపు ధ్యాన మందిరంలో కూర్చుని తిరుగు పడవలో వచ్చేశారు....

కన్యాకుమారి నుండి తిరుగు ప్రయాణం చాలా మౌనంగా గడిచింది. ఆయన బాక్ డోరు తెరిచి పట్టుకున్నారు. మాట్లాడకుండా ఎక్కింది లక్ష్మి..... పరస్త్రీని చూసినా, గాలి తగిలినా పాపమన్నంత దూరంలో వున్నారు శ్యామసుందర్‌గారు.

ఆయన ఆ మౌనం ఆ గాంభీర్యత లక్ష్మి మనసును కోత పెడుతున్నట్లున్నయి లక్ష్మి రోజులు లెక్క పెట్టుకున్నది. యింక నాలుగు రోజుల్లో తన రెండు నెలల గడువు తీరిపోతుంది......

డాక్టరమ్మగారి దగ్గరకు వెళ్ళాక మళ్ళీ ఎలాంటి పరిస్థితుల్లోనూ యిలాంటి యిబ్బందికరమైన స్థితిలో యిరుక్కోకూడదు తను....

ఆ రోజనే వొప్పుకోకుండా వూరుకుంటే బాగుండిపొయ్యేది. ఏ అజ్ఞాత శక్తి తన నోరు నొక్కి వాళ్ళు చెప్పినట్లల్లా చెయ్యడానికి వొప్పించిందో తెలియదు.

కానీ రామనాధంగారన్నట్లు ఆయన డాక్టరమ్మగారిని పెళ్ళి చేసుకుంటారా?....

అలా చేసుకుంటే తను మళ్ళీ ఆ నీడ కూడా వదిలిపెట్టి పోవలసి వుంటుందా... లేక అక్కడే వుండి కాలం గడపడం సాధ్యపడుతుందా...

ఒకవేళ డాక్టరమ్మగారికి పిల్లలు పుడితే ఆ పిల్లల్ని తను పెంచాల్సి వుంటుందా?....

తెగని ఆలోచనలతో పెద్దగా నిట్టూర్చి తలనొప్పిగా వుంటే వెనక్కువాలి పడుకుంది లక్ష్మి..... ఒకసారి వెనక్కి తిరిగి చూసి మళ్ళీ డ్రైవ్ చేయడంలో నిమగ్న మయ్యారు శ్యామసుందర్‌గారు....

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

కోవళం బీచి కేరళలో చాలా ప్రసిద్ధి చెందిన బీచి. చాలా అందమైన బీచి.

**జరిగిన కథ –12 :** అత్త ఆరళ్ళ కారణంగా సీత ఇంట్లోంచి వెళ్ళి పోతుంది. ఐదు సంవత్సరాల తర్వాత సీత పోలికలతో కనిపించిన లక్ష్మిని శ్యామ సుందర్ తోటి డాక్టర్ సుధ దగ్గరి నుంచి రెండు నెలల కోసం తన దగ్గరికి నర్సుగా తెచ్చుకుంటాడు. లక్ష్మితో శ్యామసుందర్ చాల ప్రేమగా ప్రవర్తిస్తుంటాడు. ఇతరులతో ఆమె సన్నిహితంగా ఉంటే సహించలేడు. లక్ష్మిని జ్వాలా మూర్తి వేధిస్తుండడం చూసి అకస్మాత్తుగా ప్రయాణం చేయిస్తాడు. సుధ దగ్గరికి తీసుకు వెళ్తున్నాడనుకున్న లక్ష్మితో కొచ్చిన్ వెళ్తున్నామని చెప్పి తన జీవితంలోని విషాదాన్ని వినిపిస్తాడు. కొచ్చిన్‌లో రామనాథన్ గారికి పరిచర్యలు చేసే క్రమంలో, కేరళలో చూడవలసిన ప్రదేశాలు చూసే క్రమంలో శ్యామసుందర్, లక్ష్మి సన్నిహితమవుతారు. కన్యాకుమారిలో సముద్ర స్నానం సమయంలో లక్ష్మి మెడలో మంగళ సూత్రం గమనించి శ్యామసుందర్‌లో ఆగ్రహం కలుగుతుంది.

ప్రకృతి రామణీయత అద్దం పట్టే స్థలం....

కొబ్బరిచెట్లు, తాటిచెట్లు చుట్టూతా వున్న కొండలమీద కట్టిన కాటేజెస్.... వీటిమధ్య అందమైన కొబ్బరి చెట్లతో, తెల్లటి యిసుకతో ఆడుకుంటున్నట్టున్న సముద్రం....

కేరళ వెళితే తప్పకుండా చూడాలని ముచ్చటపడే బీచి..... రామనాధంగారు ఆరోజు వెళ్ళమన్నప్పుడు లక్ష్మి యిష్టత చూపించలేదు.

కానీ రామనాధంగారు అందు కొప్పుకోలేదు. బయల్దేరేదాకా నిలవ నివ్వలేదు. ఇష్టం లేదు కనుకనే ఆ రోజు ఆయన ఎంత చెప్పినా వాళ్ళమ్మాయి చీర కట్టుకోలేదు...

డాక్టరుగారు కొనిపెట్టిన వాయిలు తెల్ల దానిమీద చిన్న ఎర్ర పూలు బార్డరున్న చీర కట్టుకుంది....

త్రోవలో ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. రాగానే శ్యామసుందర్‌గారు సముద్రంలో యీత కొట్టడానికి వెళ్ళిపోయ్యారు.

లక్ష్మి వొడ్డున కూర్చుంది యిసుకతో ఆడుకుంటూ. సముద్రంలో యీతకొడ్తూ ఆయన వైపు చూస్తే ఆ విశాలమైన వక్షస్థలం వైపు మళ్ళీ చూడాలనిపిస్తోంది.

అందుకే తల వంచుకుని యిసుకలో పిచ్చి గీతలు గీస్తూ కూర్చుంది. ఎప్పుడు వచ్చారో శ్యామసుందర్‌గారు వెనకనుండి వచ్చి, "ఎంతసేపలా కూర్చుంటావు వూరికినే.... నీటిలోకి రారాదూ...." అన్నారు.

"ఊహుఁ.... వద్దు లెండి.... వద్దు" అన్నది మరింత ముడుచుకుపోయి కూర్చుంటూ....

తడిసిన తల, తడిసిన ఒళ్ళు.... తడితో మెరుస్తున్న ఛాతీమీద ఒత్తుగా పరుచుకున్న వెంట్రుకలు.... లక్ష్మి ఒకసారి చూసి కళ్ళు వాల్చేసింది.

అలా తల వాల్చుకున్న లక్ష్మిని చూసి నవ్వుతూ,

"లే.... యీసారి నీళ్ళల్లోకి తీసుకు పోను.... వొడ్డున కాసేపు అలలతో ఆడుకుందాం రా" అంటూ యించుమించు చెయ్యి పట్టి లాక్కెళ్ళిపొయ్యారు.

ఈసారి తన చేయి పట్టుకుని సముద్రం అలలతో ఆడుకుంటూ పాదాలు తడుపుకుంటూ..... ఇదుగో యీ అల చూడు..... కాళ్ళు పెడదాం.... ఎంతదాకా పోతుందో నురుగు....

లక్ష్మికి యిది సరదాగానే అనిపించింది.... తన చేతిని పట్టుకున్న ఆ చెయ్యి కొండంత ధైర్యం యిస్తుంటే అన్ని భయాలూ మర్చిపోయి పసిపిల్లలు కేరింతలు కొట్టినట్టు పరుగులు పెట్టింది.

చీర కుచ్చెళ్ళు మోకాళ్ళదాకా తడిసి పోయినయి.... జుట్టు చెదిరి ముఖమంతా వ్యాపించింది..... అలిసిపోయి యిసుకలో చతికిలబడ్డ లక్ష్మి పక్కగా వచ్చి పడుకుంటూ ఒక చేతిమీద తల ఆన్చి శేషశాయిలా పడుకుని,



# ఒకటి ఒకటి మూడు

"లక్ష్మీ బాగా ఆకలిగా వుంది.... ఆ టిఫిను పాకెట్స్ పట్టుకురా." అన్నారు.

లక్ష్మి లేచి వెళ్ళి పక్కగా పెట్టిన పిక్‌నిక్ బాస్కెట్ తెచ్చి పళ్ళాల్లో టిఫిను సర్దింది....

అలా పడుకునే టిఫిను తింటూ,

"యిలాంటి ప్రదేశాల్లో.... యిలాంటి సమయాల్లో ఎవరన్నా టిఫిను తీసి నోట్లో పెట్టే వాళ్ళుండాలి" అన్నారు ఓర కంటితో లక్ష్మిని చూస్తూ....

విన్పించినా పట్టించుకోకుండా చిరునవ్వుతో టిఫిను తింటోంది లక్ష్మి....

"అసలు కోవళం బీచికి నా భార్య సీతతో రావాలని ప్లాను వేసుకున్నాను.... మనసులో ప్లాను మనసులోనే వుండిపోయింది. మనిషి మాయమైపోయింది.

ఇంతకూ ప్రాప్తమనేది యిద్దరి నొసటా రాసి పెట్టి వుండాలిగా" అన్నారు.

లక్ష్మి అప్పటికీ మాట్లాడలేదు.

కాస్సేపుండి అడిగారాయన.

"లక్ష్మీ నువ్వు టెన్త్ క్లాసా... యింటరు మీడియెట్ చదివావా?"

"మెట్రిక్ పాసయ్యాను."

"నువ్వు యింగ్లీషు మాటలు కొన్ని చాలా ఫ్లూయెంట్‌గా మాట్లాడతావు.... అందుకని యింటరు చదివావేమోననుకున్నాను."

"లేదు.... డాక్టరుగారి దగ్గర యింగ్లీషు పుస్తకాలుండేవి. అప్పుడప్పుడూ అవి చదివించేవారు. పైగా తప్పు పలికితే వెంటనే సరిదిద్దేవారు."

"మెట్రిక్ ఎక్కడ చదివేవు?"

"ప్రయివేటుగా.... యింతకూ యిదివరకు మీ రీ బీచికి వచ్చారా?"

"ఏం! ఎందుకలా అడుగుతున్నావ్?"

"ఏం లేదు. యీ ప్రదేశమంతా మీకు బాగా తెలిసినట్టుంటేను."

లక్ష్మి అలా ఆయన ఏవి ప్రదేశాలు చూశారో వాటి విశేషాలు అడుగుతుంటే కాలం ఎలా గడిచిపోయిందో యిద్దరికీ తెలియలేదు.... సడన్‌గా చూసి-

"చీకటి పడింది. యిక వెళ్ళొద్దా?" అన్నది.

ఇద్దరూ లేచారు... యిసుకలో నడుస్తూ మధ్య మధ్యలో చెయ్యి అందిస్తూ పక్క పక్కగా కబుర్లు చెప్పుకుంటూ నడుస్తుండగా అప్పుడే గవ్వలతో చేసిన రకరకాల బొమ్మలను అమ్ముతున్న అతడు కన్పించాడు.... అప్పుడే బొమ్మలు తీసెయ్యబోతున్నాడు.

"బొమ్మలు కొందాం" అన్నది లక్ష్మి చిన్న పిల్లలా సంబర పడిపోతూ.

"ఎవరికిట ఆ బొమ్మలు?" నవ్వుతూ అడిగారాయన.

"డాక్టరమ్మగారికి, యింకా మిగతా నర్సులకు.... కోవళం బీచి జ్ఞాపకంగా." బొమ్మలు బేరం చేస్తూ అన్నది.




"డాక్టరమ్మగారికేనా? కోవళం బీచి జ్ఞాపకంగా డాక్టరుగారికేం లేవా?"

"మీకా!.... మీకు నేనేమి యివ్వగలను."

లక్ష్మి రక రకాల బొమ్మలు కొన్నది. గవ్వలతో చేసిన తాబేళ్ళు.... వినాయకుడు, చిన్న సీతా రాముల విగ్రహాలు కొని అన్నీ పేక్ చేయించి,

"ఇదుగోండి.... యీ సీతా రాములు మీకు" అన్నది ఆ పాకెట్ అందిస్తూ.

"సీతను ప్రెజెంట్ చేస్తున్నావా?" అతి మృదువుగా అడిగా రాయన.

"కాదు.... సీతా రాములు యిద్దరూ మీరే. యీ వినాయకుడి విగ్రహం....మా సుధగారికి.... యీ తాబేళ్ళు.... మా వాళ్ళకు...."

లక్ష్మి యిచ్చిన పాకెట్ అందుకోకుండానే,

"నీ దగ్గరే వుండనీ.... తర్వాత తీసుకుంటాను" అన్నారు.

లక్ష్మి అన్ని పాకెట్స్ సర్ది బుట్టలో పెట్టి, "బాగా చీకటి పడ్తున్నది. పోగలమా?" అన్నది.

"ఆ.... పోగలం.... కొంచెం తొందరగా నడిస్తే కాటేజిదాకా."

"కాటేజా!.... కాటేజి ఏమిటి?" లక్ష్మి మొఖంలో రంగులు మారిపొయ్యాయి గబగబా....

"కొంచెం పొద్దు వాలిందంటే యీ దోవ మంచిదికాదు. యీ రాత్రికి యిక్కడే వుండిపొమ్మని..... వాళ్ళకు తెల్సిన వాళ్ళ కాటేజి కీస్ యిచ్చారు రామనాథంగారు."

లక్ష్మి కాళ్ళు సంకెళ్ళు పడ్డట్టు ఆగిపొయ్యాయి.

"ఏం యీ వేళప్పుడు.... యీ నిర్జన ప్రదేశంలో యిక్కడే వుండిపోతావా?.... నీ యిష్టం.... నీ ధైర్యం... నేను మాత్రం హాయిగా కాటేజికి వెళ్ళి వెచ్చగా పడుకుంటాను."

లక్ష్మి దిగులుగా ప్రాధేయపడుతున్నట్టు చూసింది.

ఆయన గమనించనట్లే ముందుకు సాగుతున్నారు.

ఒక్క అడుగు వెనక్కు వేసింది లక్ష్మి.

కొంచెం దూరం వెళ్ళి వెనక్కి తిరిగి, "రా" అన్నారు.

మౌనంగా వెంట నడిచింది లక్ష్మి. చిన్న కొండలు మెట్లు ఎక్కుతూ లక్ష్మి చెయ్యి పట్టుకుని నడిపిస్తూ, "యిదే అనుకుంటాను కాటేజి." అని వెళ్ళి చూశారు.

తాళం తీసి, "ఆగి పొయ్యావేం. లోపలకురా" అన్నారు.

లక్ష్మి సందేహిస్తూనే లోపలకు అడుగుపెట్టి, "ఒక్కటే గదిలా వుందిగా." అన్నది ఆయన మొఖంలోకి చూస్తూ....

ఆ మాట విన్పించుకోనట్లే అక్కడున్న మంచంమీద కూర్చుని బూట్లు విప్పుతుంటూ, "బాస్కెట్‌లో తినేవేమన్నా మిగిలున్నాయ్యేమో చూడు" అన్నారు.

లక్ష్మి పాకెట్స్ తీసుకొచ్చి పెట్టింది. ఫలహారం చేశాక అన్నది....

"ఇంకెక్కడయినా కాటేజి దొరుకుతుందేమో...."

"ఇక్కడ చాలామటుకు అన్నీ ట్రాన్సెన్ డెంటల్ మెడిటేషనుకు కట్టినవే. యిదయినా.... విడిగా వుంది కనుక దొరికింది."

అక్కడున్న మంచంమీద హాయిగా మేనువాల్చుతూ అన్నారాయన.

లక్ష్మి మాట్లాడకుండా బయటికి వచ్చింది.

ఆరుబయట అప్పుడప్పుడే పరుచుకుంటున్న వెన్నెల. దూరంగా సముద్రం.... ఎదురుగా పచ్చని చెట్లు..

గదిముందున్న చిన్న పంచలో కూర్చుంది లక్ష్మి బయటకు చూస్తూ.

చల్లటి గాలి.... ముడుచుకు కూర్చున్న లక్ష్మికి సముద్రపు ఒడ్డున యిసుకలో పట్టిన పరుగులతో అలసటగా వున్న ఆ అమ్మాయికి మాగన్నుగా నిద్రపట్టింది...

నిద్రలో ఒక కలలాంటి అనుభవం.

తన కనురెప్పల మీద ఎవరో ముద్దు పెట్టుకుంటున్నట్టు, సుతారంగా చెక్కిళ్ళు తాకినట్టు, తన పెదవుల మీద పెదవులు అద్దినట్టు.

ఆ పెదవులు తన మెడ మీద, గుండెల మీద.... ఒళ్ళంతా పరుగులు పెడుతున్నట్టు....

చలికి ముడుచుకు పోతున్న తనకు ఆ వెచ్చదనం హాయిగా అనిపించి మరింత దగ్గరగా జరిగినట్టు.

వెచ్చని చేతులు తనను ఒక్కసారిగా ఎత్తుకుని గుండెల కదుము

కున్నట్టు... గాలిలో తేలి పోతున్నట్టు....

రెండు బలమైన చేతులు మంచం మీద సుతారంగా పడుకోబెట్టగానే కళ్ళు తెరిచీ తెరవకుండా తెరిచింది లక్ష్మి...

ఇంకా కలా వాస్తవమూ కానీ ఒకానొక స్థితిలో ఆ స్పర్శ, ఆ వెచ్చదనం.... మరిచి పోయిన అనుభూతులను రేకెత్తిస్తుంటే, యిన్నాళ్ళూ అణగ ద్రొక్కి వుంచిన కోర్కెలు వరద గోదావరిలా పొంగి మనిషిని నిలవనివ్వని స్థితిలో, తన మీదకి వంగి పెదవులందుకో బోతున్న డాక్టరు గార్ని పూర్తిగా మెలుకువ రానిస్థితిలో తన రెండు చేతులతో గుండెల కదుముకుంది లక్ష్మి...

యిన్నాళ్ళూ దాచుకున్న కోర్కెలు గుర్రాలయి.... యిద్దరినీ స్వర్గలోకపు టంచుల్లో విసిరేస్తే.... మధురంగా మధురాతి మధురంగా.... ఆ స్వర్గంలో తనివి తీరా సంచరించి ఆ ఆనందపు లోకాలలో నుంచి క్రమంగా నేలకు దిగుతున్న వేళ...

నిజానికీ అబద్ధానికి తేడా తెలియని ఒకానొక ఆనందమయ... అలౌకికమైన స్థితిలో వున్న ఆ అమ్మాయికి ఎక్కడో ఎవరో పిల్చినట్టు.....

"సీతా...."

"ఊఁ...."

"సీ....తా..." పారవశ్యంతో అర్ధ నిమీలితంగా వున్న కనురెప్పలమీద ముద్దు పెట్టుకుంటూ అన్నారు శ్యామసుందర్‌గారు....

ఊఁ.....! పరిసరాలను మర్చిపోయిన అంతరాత్మ కొట్టిన ఊఁ.... అది.

"సీతా ... చెప్పు... సీతా... నీపేరు మార్చుకుని, నీ అయిడెంటిటీని నీ భర్తకు కూడా తెలియకుండా దాచుకోవలసిన పరిస్థితి ఏమి వచ్చింది సీతా".

లక్ష్మి మత్తు పూర్తిగా విడిపోయి కళ్ళు తెరిచింది.

చుట్టూ చూసింది కలలో నుండి అప్పుడే మేల్కొన్నట్టు.... తన మీదకు వంగి వున్న డాక్టరు గారు.....

అర్ధనగ్నంగా వున్న శరీరాలు....

ఏమిజరిగిందో ఎవరూ చెప్పకుండానే తెలిసి పోయే స్థితిలో అప్పుడే స్పృహ వచ్చినట్టు, జ్ఞానోదయం అయినట్టు ఛప్పున లేచి కూర్చుంది.

పక్కనున్న దుప్పటి కొసను గుండెల మీదకు లాక్కోడానికి ప్రయత్నిస్తూ, బిత్తర చూపులతో

"నేను.... నేను...." అంటూంటే, ఆయన అడ్డం వచ్చి,

"నువ్వెవరో చెప్పమని అడగటంలేదు సీతా. ఎందుకు దాచావో చెప్పమంటున్నాను. అంతే." కప్పుకుంటున్న దుప్పటి కొసను చేత్తో తొలగిస్తూ అన్నారాయన–...

"సీతా... తెల్ల చీరకట్టుకుని, జుట్టు బిగదీసి చుట్టచుట్టగానే నీ భర్త నిన్ను గుర్తు పట్ట లేడనుకున్నావు కదూ..." చూపుడు వేలుతో పెదవుల మీద సుతారంగా రాస్తూ,

"నేను సీతను కాదు... లక్ష్మిని అంటే నమ్మేస్తాడను కున్నావ్‌కదూ...

సుధా వాళ్ళ యింట్లో నేను నా భార్య లేచి పోయిందని బ్లంట్‌గా చెప్పినప్పుడు నువ్వు బాధపడి పులుసుగిన్నె వదిలేసి కాలు కాల్చుకుంటే నేను గమనించ లేదను కున్నావా....

ఆ రోజు రాత్రి నువ్వు పాల గ్లాసు పట్టుకుని నేను పడుకున్న గదిలోకి వచ్చినప్పుడు నీనడకను నేను గుర్తు పట్టలేదనుకున్నావా

పాలగ్లాసు అక్కడ పెట్టేసి నువ్వు తిరిగి వెళ్ళిపోతున్నప్పుడు నిన్ను నా గుండెలకు హత్తుకోవాలన్న కోర్కెను ఎంత బలవంతాన నిగ్రహించు కున్నానో తెలుసా....

బహుశా ఆనెల రోజులు నువ్వు నాదగ్గరకు రాకుండా వుండుంటే నిన్ను గుర్తు పట్ట గలిగి వుండే వాడిని కానేమో....

సీతా నువ్వు నా భార్యవన్న విషయం తెలియకుండానే సుధను అంత బలవంతం చేసి నిన్ను నాదగ్గరకు పిల్చుకొచ్చు కున్నాననుకున్నావా....

భార్యవని తెలియక పోతే ఒక నర్సును చెంప మీద కొట్టేంత చనువు తీసుకుండే వాడి నను కున్నావా...

ఆ అమ్మాయి ప్రతి కదలికనూ వెయ్యి కన్నులతో కని బెడుతూ కన్సల్టింగ్ రూమ్‌లో అర్ధరాత్రి దాకాగడిపేవాడి ననుకున్నావా....

నన్నేమనుకున్నావ్ సీతా నువ్వు..."

ఆయన పెదవులతో ముక్కు చివర మృదువుగా ముద్దు పెట్టుకుంటూ, 'చెప్పు... ఏమనుకున్నావ్... వుత్త మూర్ఖుడి ననుకున్నావా?...

పోనీ నాకళ్ళు నన్ను మోసం చేసినా...

నా చెవులు నన్ను దగా చేసినా.....

నీస్పర్శ దగా చెయ్యలేదు సీతా. నన్ను మోసం చెయ్యలేదు...

నాస్పర్శను నువ్వెప్పుడూ అపురూపంగా భావిస్తావు... ఆరాధిస్తావు. పరవశించి నిన్ను నీవు అర్పణ చేసుకుంటావు... ఆస్పర్శను... పరవశించే ఆ స్పర్శను ఆరాధనా పూర్వకమైన ఆస్పర్శను ఏ పురుషుడూ ఎప్పుడూ మర్చిపోడు సీతా...

ఇంత దూరమూ వూరికే తీసుకొచ్చాననుకున్నావా....

పిచ్చి పిల్లా... పోనీ యీ గుర్తు చెబితే నన్నా బుకాయించకుండా వుంటావా....

నీరెండు రొమ్ముల మధ్య యీ మచ్చకూడా కాకతాళీయమేనా...." ఆయన తన చూపుడు వేలుతో గుండెల మీద వున్న ఆమచ్చను తాకుతూ, "మన పెళ్ళయిన కొత్తల్లో యీ మచ్చను చూసి ఏమయిందని అడిగాను గుర్తుందా...."

సీత మాట్లాడలేదు....




"సీతా యిలా చూడు నాకళ్ళల్లోకి ..... చిన్నప్పుడు ఫ్లై టింపరేచరు వచ్చి స్పృహ లేకుండా పడిపోతే ఎవరో దారిన పొయ్యే వాళ్ళు బీడి వెలిగించి పెట్టారని చెప్పావ్... అప్పుడు నేనేమన్నానో గుర్తుందా...

ఇలాంటి చోట తాకి నీకు మచ్చ కలిగించిన వాడు కనబడితే చంపేస్తానన్నాను నేను...

నువ్వేమన్నావ్.... అప్పుడు నాకు రెండేళ్ళండీ అనలేదా...

రెండేళ్ళయితే మాత్రం .... నేను తప్ప యితరులు చూడ్డానికి వీల్లేదు... అతడు కనబడితే చంపేస్తానన్నాను... గుర్తుందా...

ఈ గుర్తు చాలా ... యింక బుకాయించ కుండా వుంటావా?...

పోనీ ఆ సంఘటన మర్చిపోయినా... యీ మంగళసూత్రం చూడు... అమ్మ ఏమి చేసినా చెయ్యక పోయినా మంగళసూత్రం మాత్రం యింటి ఆనవాయితీ ప్రకారం ఆ ఎర్రరాయి పైన వేయించి గుంట మంగళ సూత్రం చేయించింది.

ఈ మంగళ సూత్రం నేను కట్టింది కాదంటావా...

చెప్పు సీతా చెప్పు...." శ్యామసుందర్ గారు లేచి కూర్చున్నారు....

సీత పక్కనున్న దుప్పటి చుట్ట బెట్టుకుని పైకి జరిగి కూర్చుంది.... కంటి వెంట ధారా పాతంగా కన్నీళ్ళు కారి పోతున్నాయి.....

రెండు చేతుల్లో మొహం దాచుకుని ఏడుస్తూ కూర్చుంది కానీ జవాబు చెప్పలేదు....

# ఒకటి ఒకటి మూడు

"సీతా... యీ రోజు నువ్వు జవాబు చెప్పకుండా తప్పించుకోలేవు... నా కౌగిలి దాటి... యీ గది దాటి... ఎక్కడికీ వెళ్ళ లేవు నా ప్రశ్నకు జవాబు చెప్పకుండా....

యింతదూరం నిన్ను తీసుకు వచ్చింది నీ చేత జవాబు చెప్పించాలనే.

పదిహేనురోజులు ఆపరేషన్లన్నీ మానుకుని వచ్చింది నీ నోట నిజం పలికించాలనే....

రామనాథం గారికి నేను ఫమిలీ ఫిజీషియన్ కావచ్చు. ఇక్కడ ఆపరేట్ చేసే డాక్టరుకు నేను ఫోను చేసి ఆయనకు ఎడ్వైస్ యివ్వలేనా....

మరెందుకు వచ్చానంటావ్ యిక్కడికి...

నిన్ను లాలించి మైమరిపించి నా కౌగిట్లోకి తీసుకుని 'సీతా' అని నేను పిలిస్తే.... నీ చుట్టూ కట్టుకున్న గోడలను పగుల కొట్టుకుని నీ అంతట నువ్వే 'వూ' అని పలికేలా చెయ్యాలనే....

యిప్పుడు చెప్పు సీతా.... చెప్పక తప్పదు నీకు... రాత్రి అర్ధరాత్రి కానీ, తెల్లవారి పోనీ.... ఎంతయినా సరే.... యీ విషయం తెలుసుకున్న తర్వాతనే మనిద్దరం కదిలేది...."

సీత మొహానికి కప్పుకున్న చేతులు తీసేసి,

"ఏం చెప్పమంటారు నన్ను?" అన్నది బొంగురు పోయిన గొంతుతో .....

"ఇంట్లోనుండి ఎందు కెళ్ళి పొయ్యావ్?... లే.... లేచి యీ చీరకట్టుకుని కళ్ళు తుడుచుకుని కూర్చుని చెప్పు."

సీత లేచి ఆయన చెప్పినట్లే చేసింది... కళ్ళు తుడుచుకుంటూ అన్నది....

"ఇంట్లో నుండి వెళ్ళిపోక ఏం చెయ్యమంటారు! ... ఆరోజు నేను ఎంత మొత్తుకున్నా వినకుండా .. పెత్తనం చెయ్యమని తాళం చెవి తెచ్చి యిచ్చారు.... ఎవరికో డబ్బులిమ్మని హుకుం జారీ చేసి వెళ్ళి పొయ్యారు.....

క్రిందికి వస్తే అత్తయ్యగారున్నారు....

నేనే మిమ్మల్ని వలలో వేసుకుని యింటి పెత్తనం కాజెయ్యాలని తాళం చెవులు తెప్పించానని అన్నారు....

నా అంతం చూస్తానని పంతం కూడా పట్టారు....

శారద అక్కయ్యగారు ఎందుకు ఆత్మహత్య చేసుకున్నారో కొండమ్మ చెప్పింది నాకు...

అలాంటప్పుడు ఆవిడ అంతం చూస్తానంటే అక్కయ్య గారి పరిస్థితే వస్తే.... ఆవిడకు చావడానికైనా ధైర్యం వుంది....




నాకాధైర్యం లేదు.....

లేక ఆమె మాటలు మీరు నమ్మి నన్ను యింట్లో నుండి వెళ్ళగొడితే ఆ పరిస్థితిలో మా అన్నయ్య కూడా నన్ను గుమ్మంలో కడుగు పెట్టనివ్వడు... అప్పుడు నాగతేం కావాలి..."

"అంటే – శారద లాగా నువ్వు కూడా నన్ను నమ్మ లేక పొయ్యావా సీతా?!" బాధ మిళితమై వుంది ఆప్రశ్నలో...

"హుఁ.. రెండేళ్ళు కాపురం చేసిన ఆవిడలోనే ఆ నమ్మకం కలిగించ లేక పొయ్యారు మీరు.

యిక ఒక్క నెల మీతో కాపురం చేసిన నేనెలా నమ్మగలను.... అయినా... మీ మీద నమ్మకం ఎలా కలుగుతుంది నాకు?....

రాత్రి మీ దగ్గరకు వచ్చినప్పుడు తప్పించి ఒక్కరోజు పగలుపూట నన్ను గురించి పట్టించుకున్నారా....

నేను ఏం తింటున్నానో... ఎలా వుంటున్నానో ఒక్కనాడు అడిగారా....

ఆరోజయినా కోపం వచ్చి అంతరభస చేశారు.... యింట్లో నేను ఒక్కదాన్ని ఆ పరిస్థితిని ఎలా నిభాయించు కోగలనను కున్నారు?" యీసారి సూటిగా కళ్ళల్లోకి చూస్తూ సీత నిలదీసి నట్టు అడిగింది......

శ్యామసుందర్ గారు జవాబు చెప్పలేదు. తొలిసారిగా తనతప్పు గుర్తించినట్లు బాధగా కళ్ళు మూసుకున్నారు. తర్వాత యిలా అన్నారు-

"సరే యిది చెప్పు. వెళ్ళిందానివి పేరెందుకు మార్చుకున్నావ్?"

"పేరు మార్చుకోలేదు... నా పేరు సీతాలక్ష్మి.... మా నాయనమ్మ, అమ్మమ్మ యిద్దరి పేర్లూ కలిపి సీతాలక్ష్మి అని పెట్టారు. మా నాన్న గారు వాళ్ళమ్మ పేరుతో 'సీతమ్మా' అని పిల్చేవారు...

మా తాతయ్య గారి వూరు వెళితే వాళ్ళంతా 'లక్ష్మి' అనే పిల్చేవాళ్ళు... బళ్ళో మా మేనమామలు చేర్పించారు కనుక ఎస్. లక్ష్మి అనే చేర్పించారు".

"అయితే నేను గుర్తు పట్టి సీతా అని పిలిస్తే కాదని ఎందుకు బుకాయించావ్... యింటికి తీసుకు వెళ్ళి యింట్లో అమ్మలేదని నేను సూచించినా ఎందుకా నాటకం అలా కొనసాగించావ్?–

చివరికి నిన్న కన్యాకుమారిలో మంగళ సూత్రం నా చేతికి తగిలినప్పుడు కూడా ఎందుకు నిజం వొప్పేసుకో లేక పొయ్యావ్?"

సీత మళ్ళీ మాట్లాడలేదు...

జవాబుగా రెండు చేతుల్లో మొహం దాచుకుని ఏడవడం మొదలు పెట్టింది...

ఆయన దగ్గరగా వచ్చారు.... రెండు కళ్ళ మీదా చేతులు తీసేసి, "యీ నిజం తెలుసుకునే దాకా .... యీగది యిద్దరం వదలం.... యీ సారి నన్ను తప్పించుకుని పోలేవు." అన్నారు....

సీత పెద్దగా ఏడ్చేసింది....

"నేను... దురదృష్ట వంతు రాలనండీ.... సీతా అన్నపేరుతో నన్ను పిలవద్దు... ఆ పేరుగల పిల్ల చచ్చిపోయింది...."

"సీతా... ఏం జరిగిందో చెప్పు సీతా." ఆత్రుతగా భుజాలు పట్టుకుని కుదుపుతూ అన్నారు....

"ఏమని చెప్పను... ఇప్పుడు యిప్పుడు నేను మీ భార్యగా చెప్పుకోడాని క్కూడా అర్హత లేని స్థితిలో వున్నాను."

"సీతా?..." వులిక్కి పడ్డారాయన...

"లేదండీ ... నేను ఏ తప్పూ చెయ్యలేదు... అంది మాత్రం నమ్మండి" –సీత వెక్కుతూ అన్నది...

"సీతా... త్వరగా చెప్పు సీతా ... ఏం జరిగిందో చెప్పు..

నేను నీ భర్తను సీతా .. నువ్వు ఎలాంటి ఆపదలో వున్నా రక్షించు కోవలసిన వాడ్ని... నీ మెళ్ళో తాళికట్టిన వాడిని.... నీ బాగోగులు పట్టించుకో వలసిన వాడిని ఆకళ్ళ నీళ్ళు తుడుస్తూ అన్నారాయన....

తన కథ ఆయన వింటే తనను అసహ్యించు కోకుండా వుంటారా?... యినుమడించిన కోపంతో తనను గొంతు పిసికి చంపేస్తారా? .. మొహం చూపకు.. పొమ్మని చీదరించుకుంటే తను భరించ గలదా?... భయంతో ఆందోళనతో కళ్ళు మూసుకుంది సీతాలక్ష్మి. (ఇంకావుంది)

# ట్రంకుపెట్టె



## వి.వి.సుబ్బారావు

కామాక్షమ్మ గారు కాపురానికి వచ్చిన నాడు తనతో కూడా తెచ్చుకున్న ట్రంకు పెట్టె అది! అంటే దాని వయసు ఎంత లేదన్నా ముప్ఫై ఏళ్ళు వేసుకోవచ్చు! ఆవిడ ముప్ఫై ఏళ్ళ వైవాహిక జీవితంలో అది కూడా ఒక ప్రధాన పాత్ర వహించింది. ఆవిడతో బాటే సమానంగా కష్టసుఖాల్లో పాలు పంచుకొంది. అంచేతే కాబోలు అది యీనాడు తుప్పుపట్టి, రంగు పోయి, సొట్టలు పడి జీర్ణావస్థలో ఉన్నాకానీ. అదంటే ఆవిడ దృష్టిలో ఒక అపురూప మయిన వస్తువు!

★ ★ ★ ★ ★

"పెళ్ళయి ఐదేళ్ళయింది. ఇంకా మన కామాక్షికి పిల్లా -పీచు లేరు, చూసావా శాంతమ్మ పిన్నీ"- అంటూ అనసూయమ్మ ఆసక్తిని కనబరుస్తుండే-

"ఆ- ఆఁ- ఇంకేం పిల్లలే నాతల్లీ! అప్పుడే కామాక్షికి తల ముగ్గుబుట్ట అయిపోయింది సగానికి పైగా- ఇంక, ఆ జీవితం అలా తెల్లవార వలసిందే" భారంగా నిట్టూర్చింది శాంతమ్మ తీర్పు యిచ్చి అలసి పోతూ.

"అంతేనంటావా పిన్నీ? ఇక అయితే ఓ పురుడూ - పుణ్యాల మాటే లేదన్నమాట." వాపోయింది అనసూయ.

'ఆఁ - పోనీ, పోతే, తలకొరివి పెట్టడాని కయినా మగవాడంటూ ఒకడుండాలికదా. ఏ ఆశ్రమం నుంచో, అనాథ శరణాలయం నుంచో ఓ దానయ్యని తెచ్చుకుంటే సరి" అంది శాంతమ్మ పరిష్కారాన్ని సూచిస్తూ.

మంచినీళ్ళ బావిదగ్గర - బిందె ఎత్తుకొని తిరిగి వస్తూన్న కామాక్షికి ఆ మాటలు ఈటిల్లా గుండెల్లో గుచ్చుకున్నాయి. 'ఇక తనకీ జన్మకి సంతానయోగం లేనట్టేనా?- ఇలా గొడ్రాలిలా తన జీవితం వెళ్ళి పోవలసినదేనా? ఏ శుభ కార్యం జరిగినా - ఏ పేరంటం జరిగినా తనని బొట్టు పెట్టి పిలిచే వాళ్ళెవరూ లేరు! తన జీవితానికిక అర్థం ఏమిటి? తనని భగవంతుడు ఎందుకు సృష్టించి నట్టు??-

ఆ రాత్రి ప్రొద్దు పోయాకా భర్తతో -

"ఏమండీ! ఏజన్మలో మనం ఏం పాపం చేసామో గానీ యీ జన్మలో మనకి భగవంతుడు పిల్లలు లేకుండా చేసాడండీ! అంది కామాక్షమ్మ ఏడుస్తూ.

శేషయ్య భార్యని ఓదారుస్తూ-

"ఊరుకో - పిచ్చిదానా! ఎవళ్ళో ఏదో అన్నారని మనం ప్రతీదీ పట్టించుకుంటే యిక మనుగడ సాగించనేలేం!" అన్నాడు.

"అదికాదండీ. వాళ్ళకేం అపకారం చేసామని , ఆ శాంతమ్మ, అనసూయమ్మ, - అలా ఈటిల్లాంటి మాటల్తో నన్ను చిత్రవధ చేస్తున్నారు?"

"అదేనే నేనూ చెప్పేది. లోకులు పలుగాకులన్నారు వినలేదూ? పేర్లు మాత్రం శాంతమ్మ, అనసూయాను- మరిగుణాలో! అయినా మనకి ఎల్లకాలం యిలానే ఉండదు. తొందర్లోనే మంచి రోజు వస్తుందే! ఎటొచ్చీ అంతవరకూ కాస్త మనం ఓపిక పట్టాలి. తప్పదు మరి" అంటూ బుజ్జగించారు.

★ ★ ★ ★ ★

నోచిన నోములకీ, చేసిన పూజలకీ, సేవించిన తీర్థయాత్రలకి ఫలితంగా కడుపు పండి ఓ శుభముహూర్తాన కామాక్షమ్మ పండంటి మగపిల్లవాణ్ణి ప్రసవించింది. వాడికి తమ ఇలవేలుపు శ్రీరామచంద్రమూర్తి పేరు పెట్టుకొని సంక్షిప్తంగా రామం అని పిలుచుకునే వారు -కన్న తల్లి ప్రేమ ఓ చల్లని నీడ, ఆ నీడలో పెరిగి పెద్దయిన రామం కష్టపడి చదువుకొని, తెలివి తేటలతో స్కాలర్‌షిప్ సంపాదించుకున్నాడు ఇంజనీరింగ్ పాసవడంతో, ఆ వెంటనే హైదరాబాద్ 'హెచ్ యమ్‌టీ' లో యింజనీరుగా ఉద్యోగం వచ్చింది. మంచి ముహూర్తం చూసి కొడుక్కి వైభవంగా పెళ్ళి జరిపించారు కామాక్షి, శేషయ్య దంపతులు. కోడలు శాంత అయిన వారింటి పిల్లే అయినా, పేరుకు తగ్గట్టు చాలా అణకువ కలిగిన పిల్ల. ఎమ్మే పాసయి ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తోంది. శేషయ్య గారు మేస్టరీ చేసి రిటయిరయి ఏడాది దాటింది. రామానికి హైద్రాబాద్‌లో కంపెనీ వాళ్ళు విశాలమైన క్వార్టర్స్ యిచ్చారు. అక్కడే కాపురం పెట్టాడు. పెద్ద దిక్కుగా కూడా అమ్మా, నాన్న ఉండనే ఉన్నారు.

"నాన్నా! ఎప్పట్నుంచో మీరూ, అమ్మా తీర్థ యాత్రలకి వెళ్ళాలను కొంటున్నారు గదా! ఇక్కడ వేంకటేశ్వరా ట్రావెల్స్ సంపూర్ణ ఉత్తర దేశ యాత్రలు- కండక్టెడ్ టూర్‌గా ఏర్పాటు చేస్తున్నార్ట! వచ్చే నెల 10న యిక్కణ్ణుంచి బయల్దేరి- నలభై ఐదు రోజుల పాటు ఉత్తరదేశమంతా- కాశీ, ప్రయాగ, ఢిల్లీ,

హరిద్వారం, గయ, ఋషీకేశ్, నేపాల్ – యింకా ఎన్నో క్షేత్రాలని చూపిస్తార్ట! మీ యిద్దరికీ రెండు సీట్లు బుక్ చేసి ఈ రోజే చివరి రోజు అంటే ఎడ్వాన్సు కూడా కట్టేసాను" అనిరామం అంటూంటే–

"అవునత్తయ్యా! మీరూ, మామగారూ కాశీ, ప్రయాగలు చూడాలని మా పెళ్ళయిన నాటి నుంచీ అంటున్నారు కదా! హాయిగా వెళ్ళిరావడానికి యిదే మంచి అవకాశం! మొన్నోరోజు ఆయన నాతో ఈ విషయాన్ని చెబితే, నాకూ ఆయన సూచన బాగానే ఉందనిపించింది. కాస్త ప్రశాంతంగా ఉంటుంది మనస్సు ఓ సారి అలా తిరిగి అన్నీ చూసొస్తే", అంది శాంత అత్త, మామల ఆమోదం కోసం ఎదురుచూస్తూ–

కొడుకూ – కోడలు సంయుక్తంగా చేసిన ప్రతిపాదనలని వెంటనే ఆనందంగా ఆమోదించారు శేషయ్య దంపతులు– కామాక్షమ్మ ప్రయాణపు ఏర్పాట్లని ఆరంభించింది, వెను వెంటనే.

ఎక్కడో మూల పడివున్న తన పాత ట్రంకు పెట్టెని బయటికి తీసి తల్లి దులుపు తూంటే చూసినరామం.

"అదేంటమ్మా నీ చాదస్తం! అయినా– ఆ పాతకాలం నాటి పెట్టెతోనా ప్రయాణం– ఎవరయినా చూస్తే నవ్వి పోరూ?– సాయంత్రాని కల్లా రెండు మంచి వి. ఐ. పి. సూట్ కేసులు తెప్పిస్తాను. చక్కగా దాంట్లో సర్దుకోవచ్చు" అన్నాడు. కోడలు అందుకు వత్తాసు పలికింది. కామాక్షమ్మ గారేదో అడ్డు చెప్ప బోతూంటే శేషయ్య గారు కలగజేసుకొని–

"చూడు కామాక్షీ! అబ్బాయి చెప్పిందే సబబుగా ఉంది. అలాగే చేద్దాం? ఎందుకంటే చేసేది దూరప్రయాణమా! ఈ పెట్టెకి మూత గట్టిగా లేదు. తాళాలు పడవు సరిగ్గా" అన్నారు. కామాక్షమ్మ గారికిక మాటలు పెదవి దాటలేదు. కాని ఆవిడకి మాత్రం ఆ ట్రంకు పెట్టెతోనే తీర్థ యాత్రలకి వెళ్ళాలని మనసులో గట్టి కోరిక ఉంది.

# ట్రంకు పెట్టె

అనడమేమిటి! ఆ సాయంత్రానికల్లా రెండు పెద్ద వి. ఐ. పి. సూట్‌కేసుల్ని – కేవలం అమ్మా, నాన్నల సుఖప్రయాణం కోసమని ప్రత్యేకంగా తెప్పించాడు రామం. సామాన్లన్ని సర్దడం పూర్తయింది. చూస్తుండగానే పదవతేది వచ్చేసింది గిర్రున తిరిగి.

"అసలే కొత్త సంసారం కూడాను. అందులో యిద్దరూ ఉద్యోగస్తులాయె! జాగ్రత్తగా కాలక్షేపం చెయ్యండి" అని అమ్మా, నాన్నా అంటూంటే –

"ముందు మీ యిద్దరి ఆరోగ్యం జాగ్రత్త సుమా! ఎప్పటికప్పుడు ఉత్తరాలు రాస్తూండండి. ఉత్తరం రాకపోతే మాకిక్కడ కంగారుగా ఉంటుంది" అన్నారు భార్యాభర్తలిద్దరూ.

బస్సు బయల్దేరబోతూండగా, స్వయంగా దగ్గరుండి వీడ్కోలు చెప్పడానికి వచ్చిన కొడుకూ – కోడల్ని – యిద్దర్నీ దగ్గరగా పిలిచి శేషయ్యగారికి వినపడకుండా మెల్లిగా రహస్యం చెబుతూన్నట్టు "ఆ ట్రంకుపెట్టె జాగ్రత్తరోయ్" అన్నారు కామాక్షమ్మగారు మరోసారి హెచ్చరిస్తూ.

"దాన్నేం యినపసామాన్లవాడికి అమ్మేయంలే, నువ్వొచ్చేలోపున అయినా, నీ ప్రాణాలన్నీ దానిమీదే ఉంటాయని నాకు తెలీదుటే అమ్మా" అని రామం నవ్వుతూ అంటూంటే–

"ఏం ఫర్వాలేదత్తయ్యా! దాని గురించి మీరేం బెంగపెట్టుకోకండి" భరోసా యిచ్చింది శాంత.

'ఏమిటి?!– వీళ్ళవాటం చూస్తుంటే, తను తిరిగి వచ్చేలోపున నిజంగా 'దా'న్ని వదికో కట్టబెట్టేలాగే ఉంది!' అనుకుంది కామాక్షమ్మ తనలో తాను.

* * *

నెలాపదిహేను రోజుల యాత్ర నీ క్షేమంగా ముగించుకొని ఆ సాయంత్రమే తిరిగి హైదరాబాద్ తిరిగి వచ్చారు, కామాక్షి, శేషయ్య. టూరిస్ట్ బస్ ఆఫీసు దగ్గరికి బస్సువచ్చేవేళకి కాస్త ముందుగానే శాంత, రామం చేరుకున్నారు. వచ్చిన వాళ్ళని రిసీవ్ చేసుకోవడానికి యాత్రికులకు సంబంధించిన బంధుమిత్రులెందరో ముందుగానే వచ్చి వెయిట్ చేస్తున్నారక్కడ, అప్పటికే!

"ఏం నాన్నా! ప్రయాణం బాగా జరిగిందా?" రామం కుశలప్రశ్న వేసాడు తండ్రిని

"అత్తయ్యా! కులాసానా! యాత్ర ఎలా జరిగింది" అంటూ ఆప్యాయంగా పలకరించింది శాంత ఇరువైపులా యోగక్షేమాలకి సంబంధించిన కుశల ప్రశ్నలయాయి.

కామాక్షి, శేషయ్య సరిగ్గా నలభైఐదు రోజులకి మళ్ళీ ఆ యింట్లో అడుగుపెట్టారు. ఇల్లంతా ఏదో కొత్త రూపుతో, కొత్త పెళ్ళికూతుర్లా ముస్తాబయి దర్శన మిచ్చింది. అన్నీ పొందికగా సర్ది ఉన్నాయి యింట్లో. రంగు రంగుల తోరణాలు, బెలూన్లు, విద్యుద్దీపాలతో యిల్లంతా మెరిసిపోతోంది.

"ఏమిట్రా అబ్బాయ్! ఈ హడావిడి" అంటూ కుతూహలంగా అడిగారు కొడుకుని శేషయ్యగారు.

"అవునొరేయ్! ఆ రంగు రంగుల దీపాలేమిటీ?– ఈ బుడగలేమిటీ? నాకేం అంతుబట్టడం లేదు యిదంతా!" ఆశ్చర్యం ప్రకటించడం యీసారి కామాక్షమ్మగారి వంతు అయింది.

"ఏం లేదమ్మా! నాన్నా మీరేమీ కంగారు పడకుండా ముందు నేను చెప్పేది వినండి. రేపు పెద్ద పండగ రోజు! అందుకనే ఈ సంభారాలన్నీ" అని రామం అంటూంటే వెంటనే శాంత అందుకొని.

"అది కాదండి అత్తయ్యా. అసలు విషయమేమి టంటే... ముందుగా మీ యిద్దరికీ చెబితే మీరు కాదంటారేమోనని యిలా..."

"అసలు సంగతి చెప్పకుండా యిలా నీళ్ళు నములుతున్నారేమిట్రా యిద్దరూనూ?"

"కాదమ్మా! రేపు మీ యిద్దరికీ షష్టి పూర్తి మహోత్సవం జరగబోతుంది. అంటే... మీరిద్దరూ పెళ్ళి వేడుకల్ని జరుపుకోబోతున్నారన్నమాట, ఈ శుభ సందర్భంలో"...

"ఆఁ– ఏమిటీ! ఇది మీర్దిరూ కలిసి ఆడిన నాటకమా!" అంటూ భళ్ళున నవ్వేసారు శేషయ్య గారు. కామాక్షమ్మ మాత్రం ఎందుకోగానీ ముభావంగా ఉండిపోయింది.

ఆ రాత్రి – ఉండబట్టలేక – అటు ఇటు ఎవరూ తనని గమనించడంలేదని నిర్ధారణ అయాక యిల్లంతా చుట్టబెట్టి, ప్రతీ గదీ గాలించింది తన ట్రంకుపెట్టె కోసమని! ఎక్కడయినా కనిపిస్తేగా అది! ఇంకెక్కడి పెట్టే! తమిద్దరినీ అలా యాత్రలకి పంపినట్లే పంపి, ఆ ట్రంకుపెట్టెని ఏ ఇనప సామానుల వాడికో వేసేసి ఉంటారు, కొడుకూ – కోడలు యిద్దరూ కూడబలుక్కొని. మరీను! 'వెళ్ళబోయే' ముందు తను దాని విషయం ప్రస్తావించానని మరింత పంతం! అవును – తనకు గుర్తొచ్చింది అప్పుడు కొడుకు తనతో పరిహాసంగా అన్నదంతాను! చేసిందంతా చేసేసి, యిక యిప్పుడీ షష్టి పూర్తి సంబడం కూడా ఎందుకో! అక్కడికేదో మేమంటే పెద్ద ప్రేమ మండిపోతోందని ఊరివాళ్ళను కోవద్దూ! ఛి ఛీ" తలచుకొంటేనే






డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**ఎ. సి. - పొందూరు**

నాకు ఇద్దరు ఆడపిల్లలు. మగ సంతానం కావాలనే కోరిక ఉన్నది.నాది దగ్గర కానుపు. కొన్నాళ్ళు పిల్లలు కలుగకుండా మాత్రలు కలవని తెలిసింది. ఆ మాత్రలు ఏమిటి? ఎలా వాడాలి?

ఓవ్యులెన్, లేక ఓవ్రాల్, నోర్గాస్టెక్సిన్ - మొదలైనవి మందుల షాపులో దొరుకుతాయి. రోజుకి ఒక మాత్ర చొప్పున వాడాలి. ఈ మాత్రలు ఉచితంగా కుటుంబనియంత్రణ కేంద్రాలలోనూ, ప్రైమరీ హెల్త్ సెంటర్లలోను, ఆస్పత్రులలోని కుటుంబనియంత్రణ డిపార్టుమెంట్లలోను లభిస్తాయి.

**జి. వి. ఎ.- కుప్పం**

నా వయస్సు 30 సం.లు. పది సంవత్సరముల క్రితం నా శరీరంలో ఎడమ భాగంలో భరించలేని నెప్పి వచ్చినది. రెండు నెలల తదుపరి మైనర్ ఆపరేషన్ చేసి హిప్ జాయింట్ నుండి ఎడమచేతి గూడ వెనుక ప్రక్క నుండి చీము తీశారు. మరలరెండు సంవత్సరముల క్రితం అదేమాదిరి నెప్పి వచ్చినది. మరల హిప్ జాయింటు నుండి చీము తీశారు. ఈ జబ్బుని ఏమంటారో తెలియలేదు. ఇప్పుడు ఏ బాధాలేదు. ఇలాంటి జబ్బు మరలా రాకుండా ఏ మందు ఎ... రోజులు వాడాలో, తీసుకోవలసిన జాగ్రత్తలు తెలుప ప్రార్థన.

దీనిని"సెప్టిక్ ఆర్ థ్రైటిస్" అని అంటారు. కొన్ని సందర్భాలలో కీళ్ళకి "ట్యూబర్కులోసిస్" రోగం రావడంవల్ల ఇలా జరిగే అవకాశం ఉన్నది. ఈ రోగానికి చికిత్స వైద్యులు ప్రత్యక్షంగా పరిశీలించిగాని నిర్ణయించడానికి వీలుపడదు. అయితే వైద్యులు నిర్ణయించిన మందులను క్రమబద్ధంగా, వారు చెప్పినంత కాలపరిమితి వరకు తప్పకుండా వాడాలి.

**పి. ఎన్. డి. – విజయవాడ**

నా వయస్సు 26 సంవత్సరములు. నేను 16వ ఏట నుండి కళ్ళజోడు వాడుతున్నాను. ప్రస్తుతం ఇరువైపులా – 4.5 వుంది. క్రమేణా పెరుగుతూ వచ్చింది. దీన్ని ఇక పెరగకుండా అవటం సాధ్యమా? నేను దేన్నయినా చూచేటప్పుడు సన్నని తీగలు అక్కడక్కడా ముడులు పడి ఉండి నేను ఎటు చూస్తే అటు వస్తూ వుంటాయి.

★ చాలా త్వరగా పవర్ పెరుగుతూ వస్తే నేత్ర వైద్యుల దగ్గర వెంటనే పరీక్షింప చేసుకో వలసి వుంటుంది. పవర్ పెరగ కుండా చేయటం అనేది మూలకారణం మీద ఆధార పడి ఉంటుంది. కెరటో కోనస్ అనే కార్నియా రోగం ఉన్నప్పుడు ఆపరేషన్ ద్వారా సరిచేయ వచ్చును. కళ్ళలోన లెన్సుల ప్రాబల్యం వల్ల పవర్ వల్ల వస్తే కళ్ళజోడు వాడటమో, కాన్టాక్ట్ లెన్స్ వాడటమో అవసరం. మయోపియా (మైనస్ పవర్) ఉన్న వారికి కళ్ళ ముందు తీగలు కనబడటం సహజం వీటిని మస్కి వాలిటాంటిసే అని అంటారు. ఇవి దృష్టి మళ్ళించినపుడు కదులుతూ వుంటాయి. □

ఒళ్ళంతా తెళ్ళు జర్రెలా పాకుతూన్నట్టుంది"– పోనీ – నోరు తెరిచి' అమ్మాయీ! ఆ ట్రంకుపెట్టి ఎక్కడ నిప్పెట్టావే' అని అడిగేస్తేనో! – ఛీ.... తను ముందుగా బయటపడిపోయినట్టు వుండదూ! ఆ చెప్పేదేదో కోడలు చెప్తే అదో అందం" – కామాక్షమ్మగారి ఆలోచనలు కల్లుతాగి, నిప్పుతొక్కిన కోతుల్లా గంతులు వేస్తున్నాయి. 'జరిగే అనర్థమేదో జరిగిపోయిందెలాగానూ – యిక యిప్పుడు బుర్ర బద్దలు కొట్టుకుంటే ఏం లాభం! పోనీ ఇదేదో ఆయన చెవినవేస్తేనో!... ఆయనా! ఆయనో వెర్రి బాగులవాడు. ఎప్పుడూ కొడుకూ – కోడల్ని వెనకేసుకు రావడానికే ఆయనకి టైం చాలదు!"– రాత్రంతా ఒక్క క్షణం కంటిమీద కునుకులేదు కామాక్షమ్మకి.

మర్నాడు! ఇల్లంతా మిత్రులతోను, శ్రేయోభిలాషులతోనూ ఒకటే సందడిగా ఉంది – కామాక్షి, శేషయ్య దంపతుల షష్టిపూర్తి వేడుకల్ని అత్యంత వైభవంగా, ఖర్చుకి ఏమాత్రం వెనుదీయకుండా, చూసే వాళ్ళంతా 'అసూయ' పడేలా భారీ ఎత్తున జరిపిస్తున్నాడు రామం. శాంతకూడా భర్తకి కావలసిన సహకారాన్నంతా అందిస్తూనే ఉంది అడుగడుగునా!

శాస్త్రీయ పద్ధతిలో జరిగిన తంతు అంతా ముగింపు కొచ్చినట్లే యిక! ఎవరో యిద్దరు కుర్రాళ్ళు రామం దగ్గరకి వచ్చి అడుగడుగునా చెవిలో గుసగుసలాడుతూండడం గమనించక పోలేదు కామాక్షమ్మ, శేషయ్యాను.

"ఈ శుభ సందర్భంగా – షష్టి పూర్తి దంపతులయిన మీ యిద్దరికీ ఆ పార్వతీ పరమేశ్వరులు ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించాలని మనసారా ప్రార్థిస్తూ – మీ ఆశీస్సులను సదా కోరుకొంటున్నాము" అని తల్లిదండ్రుల పాదాలకి సమస్కరించారు శాంత. రామం జంటగా.

"మరొక్క విషయం! ఈనాటి యీ వేడుకలలో మాతోబాటు మా ఆనందాన్ని పంచుకోవడానికి అంగీకరించి విచ్చేసారు, మా కంపెనీ డైరక్టరు శ్రీనివాసరావుగారు వారికి మా ఆహ్వానాన్ని మన్నించి వచ్చినందుకు ధన్యవాదాలు తెలుపుకొంటూ – ఈ సందర్భంలో – వారి చేతుల మీదుగా – మా యీ చిన్న కానుకను" షష్టిపూర్తి వధూవరుల కందజేయ వలసిందిగా కోరుకొంటున్నాము అంటూ రామం శ్రీనివాసరావుగారిని కళ్యాణ మంటపం దగ్గరికి ఆహ్వానించి తోడ్కొని వచ్చాడు.

కుర్రాళ్ళిద్దరూ జాగ్రత్తగా పట్టుకుని తీసుకు వచ్చిన ఆ "గిఫ్ట్‌పేక్"ని కామాక్షమ్మ, శేషయ్య దంపతులకు రావుగారు అందజేస్తుంటే, అక్కడ చేరిన వాళ్ళంతా ఆనందంగా హర్షధ్వానాలు చేసారు. ఆహ్వానితులందరూ, రామం దంపతుల ఆతిధ్యాన్ని స్వీకరించి కృతజ్ఞతలు చెప్పి ఒక్కొరొక్కరే శెలవు తీసుకొని వెళ్ళిపోయారు. అనుకున్న దానికంటే మరింత కన్నులపండువగా వేడుక జరగడం – ముఖ్యంగా రామం దంపతుల కెంతో ఆనందాన్ని, సంతృప్తిని యిచ్చింది.

ఆ రాత్రి సద్దుమణిగాకా–

శేషయ్యగారు, కామాక్షమ్మ సమక్షంలో గిఫ్ట్‌పేక్ రేపర్ తొలగించారు.

'కళ్ళు జిగేల్మనేట్టు కొత్తగా గచ్చకాయ రంగుతో పెయింట్ చేయబడి రంగులో లతలూ, నగిషీలు వేయబడ్డ ఆట్రంకుపెట్టి తనలాగే 'కొత్తపెళ్ళి కూతుర్లా' మెరుస్తూ కనబడింది" కామాక్షమ్మగారి కళ్ళకి.

శేషయ్య నవ్వుతూ–

"చూసావా కామాక్షీ! మన రామం – శాంత – నీకు ఎంత చక్కటి కానుక నిచ్చారో! ఇప్పటికయినా గ్రహించావా వాళ్ళ మనసులు నవనీతమని" అని అంటూంటే–

"రామం, శాంతల విషయం మీరీనాడు చెప్పాల్సిండీ ప్రత్యేకంగా!" అంటూన్న కామాక్షమ్మగారు గతరాత్రి తన మెదడుని దొలిచిన, కుమ్మరి పురుగు" ని గుర్తుకు తెచ్చుకొని సిగ్గుపడి" వాళ్ళిద్దరూ ఎవరో కాదండీ! నా కనుపాపలు అన్నారు సజలనయనాలతో.

దూరంగా చాటుగా ఉండి అంతా గమనిస్తూన్నే ఉన్నారు రామం, శాంత, రామం శాంతకేసి చూస్తూ కన్నుగీటాడా? శాంత రామంకేసి చూసి నవ్విందా?– ఈ రెండింటిలో ఏది ముందూ అని అడిగితే– అడిగినంత సుళువేం కాదు చెప్పడం!– □

# హైదరాబాద్ నోట్‌బుక్



## జానపద కళలలో డిగ్రీ కోర్సులు:–

తెలుగు విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య డాక్టర్ తూమాటి దొణప్ప జనవరి 13న పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, వచ్చే విద్యా సంవత్సరం నుంచి సంగీతనృత్య చిత్రలేఖనాది లలిత కళలలోను, జానపద కళలలోను డిగ్రీ కోర్సులు, జానపద సాహిత్యంలో మాస్టర్ డిగ్రీ కోర్సులు ప్రారంభిస్తామని తెలిపారు. ఈ కోర్సులకు హైదరాబాద్, శ్రీకాకుళం కేంద్రాలుగా వుంటాయి. వాటికి అవసరమైన అధ్యాపక వర్గం, బోధన పద్ధతులు త్వరలో నిర్ణయించడం జరుగుతుంది. ఇవి దీర్ఘకాలిక పథకాలు. ఇంతవరకు రాష్ట్ర వ్యాప్తంగా 50 జానపద కళా స్వరూపాలను గుర్తించాము. తప్పెట (గజపతి నగరం), కత్తి, కర్రసాము (విజయ నగరం), దాసరికం (గర్భార), చక్కభజన (పులివెందల), చిందు భాగవతం (నిజామాబాద్), తోలుబొమ్మలాట (అనంతపురం), తరంగ భజన (ఒంగోలు), గొరవయ్యలు (కర్నూలు), మున్నగు జానపద రూపాలలో అధ్యయనం పూర్తయింది. బుర్రకథ, బొమ్మలాట, వీరనాట్యం, గరగ నృత్యం, కోలాటం మున్నగు జానపద నృత్య రూపాలను అధ్యయనం చేయవలసి ఉంది. ఈ జానపద కళా స్వరూపాలలో విద్యార్థులను ఎంపిక చేసి, శిక్షణ ఇచ్చే కార్యక్రమం సాగుతున్నది. మాచెర్లలో ఆరువారాలపాటు పౌరాణిక, చారిత్రక, జానపద ఏకపాత్రాభినయాల శిక్షణ పూర్తయింది. ఇలాటి ఆరువారాల శిక్షణ శిబిరాలకు చెరి పదివేల రూపాయల చొప్పున వ్యయమవుతున్నది– అని ఆచార్య దొణప్ప అన్నారు. ఈ కోర్సులు, డిగ్రీలతోపాటు కళాకారులలో ఆత్మ విశ్వాసం కలిగించడానికి విశ్వవిద్యాలయం ప్రయత్నించాలి. ఈ కళాకారులు చాలమందిలో న్యూనతా భావం ఉంది. దీనికి కారణం వారికి జనరల్ ఎకడమిక్ క్వాలిఫికేషన్ లేకపోవడమే. కళాకారులకు తమ కళలు వివరించే చదువు కూడా వుండాలి. అప్పుడు వారు ఆత్మ విశ్వాసంతో ముందుకు వెళ్ళగలరు. ముప్ఫై సంవత్సరాల క్రింద తొలిసారిగా సోవియట్ రష్యా, చైనా జానపద కళాకారుల బృందాలు భారత దేశానికి వచ్చినప్పుడు, ఆ కళాకారులతో మన జానపద కళాకారులు ఏ మాత్రం తీసిపోరని అనిపించింది. కాని, అక్కడి తప్పెటవంటి వాద్యం వాయించేవారు తమ కళానైపుణ్యాన్ని వివరించే వాగ్ధాటితో పత్రికా రచయితల సమావేశంలో ముచ్చటించినప్పుడు, ఇక్కడి వారంతా ఆశ్చర్య పడ్డారు, వారి జనరల్ క్వాలిఫికేషన్‌లకు. కనుక ఎంతటి గొప్ప కళాకారునికైనా, తన కళను వివరింప గల తగుపాటి సాహిత్య పరిచయం వుండాలి. అప్పుడుగాని, అతనికి ఆత్మ విశ్వాసం కలుగదు. ఈ విషయాన్ని విశ్వవిద్యాలయం గుర్తించాలని కోరుతున్నాను.

## హస్త కళల అభివృద్ధి :

రాష్ట్ర హస్తకళల అభివృద్ధి సంస్థ అధ్యక్షులు శ్రీ టి. వి. ఆర్. శాస్త్రి జనవరి 12న పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, ఈ సంవత్సరం అర్ధకోటి రూపాయల ఖర్చుతో వివిధ అభివృద్ధి కార్యక్రమాలు కొనసాగిస్తామన్నారు. శతాబ్దాల సాంస్కృతిక సంప్రదాయాలను సుకుమారంగా ప్రతిబింబించే హస్తకళలు రూపుమాసిపోకుండా భద్రపరచడమేకాక, శాశ్వతంగా మహోజ్వలంగా వుండేట్టు చూడడమే తమ సంస్థ లక్ష్యమని శ్రీ శాస్త్రి తెలిపారు. ఈ సంవత్సరం మా కార్యక్రమం ఇది. ముప్ఫై లక్షల వ్యయంతో హైదరాబాదులో సంస్థ భవనాలు నిర్మిస్తున్నాము. కలకత్తాలో విక్రయ శాలను స్థాపిస్తాము. వచ్చే నెల జాతీయస్థాయి హస్తకళల ప్రదర్శనం నగరంలో నిర్వహిస్తాము. అంతర్జాతీయ బొమ్మల ప్రదర్శనం, అంతర్జాతీయ ఆభరణాల ప్రదర్శనం, నిర్వహించాలనుకుంటు న్నాము. ఏప్రెల్‌లో బొంబాయిలో రాష్ట్ర హస్తకళల ప్రదర్శనం నిర్వహిస్తాము. పర్యటన కేంద్రాలలో హస్తకళల విక్రయశాలలను నెలకొల్పదలచాము. వివిధ హస్తకళల విధానంపై ఉత్పత్తి కేంద్రాలలో వీడియో క్యాసెట్లను నిర్మించి సంస్థ నిర్వహించే శిక్షణ శిబిరాల్లో ప్రదర్శిస్తాము. ఐదవ తరగతి వరకు పాఠ్యాంశాలతో సంబంధం వుండే వ్యక్తుల బొమ్మలను తయారు చేయించి, ఆయా పాఠ్యాంశాల బోధన సమయంలో ఉపయోగించేట్టు చూస్తాము. ప్రతిఏటా 67 మందికి హస్తకళలలో శిక్షణ ఇస్తున్నాము. గృహవసతిలేని తోలుబొమ్మల వారికి ఇళ్ళు కట్టిస్తున్నాము– అని ఆయన అన్నారు. హస్తకళలు మనజాతి వారసత్వపు ఆస్తి. మనవారికి సహజంగానే ప్రాచీనత్వంపై ఆసక్తి తక్కువ. ఇతర దేశాల వారితో పోల్చితే, వాటికి మనవారు ఇస్తున్న ప్రోత్సహమూ తక్కువే. ప్రాచీన సంస్కృతి పునాది లేనిదే ఏ కళాసాహిత్యాలూ నిలువవు. కనుక ప్రతి ప్రాచీన కళా స్వరూపాన్ని మనం రక్షించుకొని, దానిపై మెరుగులు దిద్దుకోవాలి. ఈ విషయంలో రాగ ద్వేషాలు మాని తమ ప్రాచీన కళలను, హస్తకళలను రక్షించుకొని, నూతన కల్పనలతో అభివృద్ధి పరచుకొంటున్న ఇండోనీసియా ప్రజలను మనం ఒరవడిగా పెట్టుకోవాలి.

## పేదలకు ఇళ్ళు

మన గ్రామాలస్థితేకాదు, నగరాలలోని మురికివాడల స్థితి చూచినా కడుపు తరుక్కుపోతుంది. రెండువేల ఏళ్ళనాటి గాథా సప్తశతిలో వర్ణించిన పూరిగుడిసెలూ, గూబలుకూసే శిధిల దేవాలయాలు, వాటిముందు చలికాలంలో గడ్డి నెగళ్ళు వేసి చలి కాచుకుంటున్న పేదలు కనిపిస్తారు. ఈ దుర్గతి పోవడానికి "పేదలకు శాశ్వత గృహ నిర్మాణ పథకం" కింద ఏడవ పంచవర్ష ప్రణాళిక ముగిసేలోగా, పదిలక్షల ఇళ్ళను కట్టించి ఇవ్వాలని రాష్ట్ర గృహ నిర్మాణ సంస్థ నిర్ణయించడం చాల ప్రశంసనీయం. ఈ పథకానికి 175 కోట్లు అప్పుగాను, నాలుగుకోట్లు కానున్న గృహయజమాని నుంచి వాటా ధనంగాను సేకరిస్తామని, గ్రామీణ ప్రాంతంలో ఇల్లు ఎనిమిదివేల రూపాయల వ్యయంతోను, పట్టణ ప్రాంతాలలో 12 వేల రూపాయల వ్యయంతోను నిర్మిస్తారని, ఇవి శాశ్వత గృహాలని, ఇవిగాక చెరి నాలుగువేల రూపాయల వ్యయంతో సెమీ పర్మనెంటు గృహాలు కూడ నిర్మిస్తామని గృహ నిర్మాణ సంస్థ ప్రతినిధి తెలిపారు.

## రాష్ట్ర రాజధానిలో డిస్నీ ల్యాండ్ :

డిస్నీల్యాండ్ అనగానే ఎవరికైనా మనస్సు అద్భుత లోకాలకు పయనిస్తుంది. అలాటి అద్భుత వినోద కేంద్రాన్ని రాష్ట్ర రాజధానిలో హుసేన్‌సాగర్‌కు అనుకొని వున్న దాదాపు వంద ఎకరాల ప్రాంతంలో నిర్మించడానికి రాష్ట్ర ప్రభుత్వం ఆలోచిస్తున్నట్టు, దీనికి కేంద్ర ప్రభుత్వం సుముఖంగా వున్నట్టు తెలుస్తున్నది. దీనికి దాదాపు 82 కోట్లు వ్యయమవుతుందట. దీనికి దాదాపు 21 కోట్ల రూపాయల విదేశీ మారకం అవసరం గనుక, దానిని విదేశాలలోని భారతీయుల నుంచి ఈ మారక ద్రవ్యం సంపాదించడానికి ప్రయత్నాలు జరుగుతాయట. ఈ పథకం స్థలానికి 45 కోట్ల రూపాయలు, కట్టడాల నిర్మాణానికి 16 కోట్ల రూపాయలు అవసర మవుతుందట. ఈ పథకానికి అవసరమయ్యే విదేశీ మారకద్రవ్యం ఒనగూర్చే విదేశ భారతీయులకు, వారి సహాయానికి మారు హైదరాబాద్‌లోగాని, రాష్ట్రంలోని ఇతర ప్రదేశాలలోగాని నివేశన స్థలాలుగాని, నిర్మించిన ఇళ్ళుగాని ఇవ్వాలని రాష్ట్ర ముఖ్యమంత్రి నిర్ణయించారట. డిస్నీల్యాండ్ వంటి వినోద పర్యాటక కేంద్రం నెలకొల్పడం సంతోషకరమైన విషయమే. కాని ఒకవైపు అలాటి గొప్ప కేంద్రం మరోవైపు మురుగు కాలువలు పారుతున్న గతుకుల వీధులు, పెంటపోగుల పార్కులు వుండడం బాగుండదు గనుక, ఆ కేంద్రం నిర్మాణంతో పాటు వీటినీ బాగుపరచడం అవసరం.

## ఉపశ్రుతి :

ప్రొద్దుటూరు వీధులలో రిక్షాలో పోతున్నాను. గతుకులతో ఒళ్ళు విరిగిపోయేట్టుగావుంది. ఏమిటయ్యా ఈ రోడ్లు? ఊరంతా కోటీశ్వరులు. వీధులు ఇలా వున్నాయేమి?– అన్నాను రిక్షా వాలాతో. ప్రొద్దుటూరులో వున్నన్ని మంచి వీధులు రాష్ట్రంలో మరెక్కడా లేవని మీ పత్రికల వారు ఇటీవల పత్రికలలో వ్రాశారు సార్?– అని జవాబు చెప్పాడు వెంటనే రిక్షావాలా.

–తిరుమల రామచంద్ర

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667

# 1986లో క్రీడా రంగం... ఒక సమీక్ష

**1986** ప్రపంచ క్రీడారంగములో ఎన్నో అద్భుతము నూతన రికార్డులు నెలకొల్పగా మనకు 'దురదృష్ట'కరమైన సంవత్సరము. ప్రపంచములో అతిచిన్న దేశములు సహితము క్రీడారంగ అభివృద్ధి పథకములు రూపొందించుకొని అంతర్జాతీయ క్రీడారంగములో పతకములు, ఖ్యాతి పొందు చుండగా మనము అవమానములు, నిరాశ, నిస్పృహలు పొందుచున్నాము. ఎప్పటి లాగే ప్రతి ఏట జరిగే అంతర్జాతీయ పోటీలు గాక ప్రపంచ కప్ ఫుట్‌బాల్, హాకీ, బాస్కెట్ బాల్ పోటీలు గత ఏడాది ప్రత్యేక ఆకర్షణలు. అన్నిటిలో మెక్సికో నగరములో జరిగిన ప్రపంచ ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్ పోటీలు విశేష ఆకర్షణ పొందగా, మన మహిళా క్రీడాకారిణి 'బంగారు పతక పరుగుల రాణి'గా ఖ్యాతి పొందిన పి. టి. ఉష దేశ ప్రజల అభిమానము పొందిన మేటి క్రీడాకారిణి.

## అంతర్జాతీయ క్రీడారంగం

గత సంవత్సరము మెక్సికోలో జరిగిన వరల్డ్ కప్ ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్‌లో విజయం సాధించిన అర్జెంటీనా జట్టు సారధి అద్భుతముగా ఆడి జట్టు విజయానికి కారకుడు కొన్ని లక్షల క్రీడాభిమానుల ప్రియతమ ఆటగాడు డగో మరొడోనా, అయిదుసార్లు మహిళల వింబుల్డన్ టైటిల్ వరుసగా సాధించిన, యు. ఎస్. ఎ. ఓపన్ టెన్నిసు టైటిల్ తిరిగి గెల్చిన అమెరికన్ టెన్నిస్ క్రీడాకారిణి మార్టినా నవ్రతిలోవా ఉత్తమ క్రీడాకారుడు, క్రీడాకారిణిగా స్పోర్ట్సు క్రిటిక్స్ (క్రీడా రచయిత ల) సంయుక్త ప్రెస్ 1986 నకు ఎంపిక చేసినది. పురుషుల విభాగంలో ద్వితీయ స్థానం అమెరికా బాక్సింగ్ విజేత మైక్ టైసన్, తృతీయ స్థానం టెన్నిసు ఆటగాడు చెకోస్లోవేకియాకు చెందిన ఇవాన్ లెండల్‌కు లభించగా, మహిళల విభాగములో జర్మనీకి చెందిన లాంగ్‌జంప్ క్రీడాకారిణి హైకో డ్రెష్లర్‌కు మూడవ స్థానం నార్వేకు చెందిన పరుగుల రాణి ఇన్‌గ్రిడ్ క్రిస్టియాన్‌సెన్ పొందినది.

వీరుగాక ప్రపంచ అగ్రగామి క్రీడాకారులుగా ఖ్యాతి పొందిన వారు చెస్ ఆట ప్రవీణులు, విజేతలు సోవియట్ రష్యాకు చెందిన కాస్పరోవ్, కార్పోవ్‌లు, టెన్నిసు ఆటలో పశ్చిమజర్మనీ వాసి బోరిస్ బెకర్, ఆస్ట్రేలియాకు చెందిన పాట్‌కాష్, మన రమేష్ కృష్ణన్, విజయ్ అమృతరాజ్, జీషన్ అలీ (జూనియర్), బాక్సింగ్‌లో అమెరికాకు చెందిన హాగ్లర్, ఈతలో బియూండి, క్రికెట్‌లో వెస్టిండీస్ వాసి రిచర్డ్స్, ఆస్ట్రేలియాకు చెందిన బోర్డర్, పాకిస్తాన్‌కు చెందిన జావేద్, ఇమ్రాన్‌ఖాన్, ఇంగ్లాండు వాసి క్రిస్‌బ్రాడ్ బోథమ్ మన గవాస్కర్, వెంగ్‌సర్కార్, కపిల్‌దేవ్, ఎథలెటిక్స్‌లో సోవియట్ రష్యాకు చెందిన సెర్గి బూబ్కా (పోల్‌వాల్ట్) ఇంగ్లాండు చెందిన స్టీవ్‌క్రామ్ అమెరికాకు చెందిన ఎడ్విన్ మోసస్, స్క్వాష్‌లో పాకిస్తాన్ వాసి జహంగీర్‌ఖాన్, బ్యాడ్మింటన్‌లో చైనాకు చెందిన యెలింగ్స్, డెన్మార్క్ వాసి మోర్టన్ ఫ్రాస్ట్, చైనా వాసి హాన్ జియాన్ ఫుట్‌బాల్ ఆటలో ఇంగ్లాండు వాసి గారీలినేకర్, యున్నారు.

వరల్డ్ కప్ హాకీ, బాస్కెట్ బాల్ పోటీలు అంతగా ఆసక్తి కలిగించలేదు. పాకిస్తాన్, భారత్‌లు ఆఖరి రెండు స్థానములు వరల్డ్ కప్ హాకీలో పొందుట క్రీడారంగ పండితుల అంచనాలు తారుమారు అయాయి. అమెరికా ట్రాక్ అండ్ ఫీల్డులో తన ఆధిక్యత ఎప్పటి లాగే నిలబెట్టుకొనగా సోవియట్ రష్యా చదరంగములో ప్రథమ స్థానములో యున్నది. అంతర్జాతీయ క్రీడారంగములో పునః ప్రవేశించిన చైనా కొన్ని ఆశ్చర్యకరమైన విజయాలు సాధించుచున్నది. ఆసియా ఖండములో జరిగిన ఒకే ఒక పెద్ద క్రీడోత్సవము 'సియోల్ ఆసియా క్రీడలు' యందు అనేక నూతన రికార్డులు నెలకొల్పబడుటయే గాక క్రొత్త ధృవతారలు ఉద్భవించాయి. దక్షిణ కొరియా అఖండ విజయాలు సాధించినది.

## మనదేశంలో

జరిగిన సంవత్సరములో మనము ఏమి సాధించాం అని సమీక్షించుకొనే కంటె ఏమి కోల్పోయాము అని ఆలోచించుకోవలసిన పరిస్థితి ఏర్పడినది. మనము విశ్వ క్రీడారంగములో క్రికెట్, హాకీ ఆటలో అగ్రగామి అనుకొనే పరిస్థితి గత ఏట తారుమారు అయినది. మన క్రికెట్ టీములు స్వదేశములో, విదేశ పర్యటనలలో విఫలమయారు. హాకీ ఆటలో ఆఖరి స్థానమునకు దిగజారాము. ఆసియా క్రీడోత్సవాలలో ఆశించిన ఫలితాలు లభించలేదు. స్వదేశములో క్రీడాభివృద్ధి పథకములు కాగితముల మీదే కాని ఆచరణలో కనిపించలేదు.

సియోలు ఆసియా క్రీడోత్సవాలలో మన బంగారు పరుగుల రాణి పి. టి. ఉష, కుస్తీలో కర్తార్‌సింగ్ స్వర్ణ పతకములు గెల్చి మనదేశ పరువు కాపాడారు అనవచ్చును. ఈతలో ఖజన్‌సింగ్ రజత పతకము.

డగో మరొడోనా

1986లో ఉత్తమ క్రీడాకారుడు



పి.టి. ఉషా, షైనీ అబ్రహాం



వాలీబాల్ పురుషుల జట్టు కాంస్య పతకము. జయరామ్ బాక్సింగ్‌లో రజత పతకము సాధించారు. 800 మీ. పరుగులో షైనీ అబ్రహం బంగారు పతకము 'టెక్నికల్ ఫాల్ట్' వలన కోల్పోయినది. క్రికెట్ ఆటలు ఆస్ట్రేలియా పర్యటన, బెన్సన్ – హెడ్జెస్ ట్రాఫి పోటీలలో, షార్జా నాలుగు దేశముల ఛాంపియన్స్ ట్రాఫీ పోటీలలో, స్వదేశములో ఆస్ట్రేలియా శ్రీలంకలతో పోటీలలో అసంతృప్తి మిగిలినది. శ్రీలంకతో కాన్పూరు ఒకరోజు పోటీలో 78 పరుగులకే ఆలౌట్ దక్కినది. మద్రాసులో ఆస్ట్రేలియాతో జరిగిన పోటీలో ఆట 'టై'గా ముగిసి ఎంత రికార్డు నెలకొల్పబడినది. గవాస్కర్ ఎప్పటి లాగే 'రికార్డు' లు సృష్టించారు.

'హాకీ'లో దుబాయిలో జరిగిన ఎమిరేట్స్ హాకీ టోర్నమెంటులో విజయం లభించగా శుభ సూచకము అని భావించబడినది కాని ఆ తర్వాత కువైట్‌లో, ఇండియా – పాకిస్తాన్ టెస్టు సిరీస్ (3–2 గెలుపు) ఆసియా క్రీడోత్సవాలలో (కాంస్య పతకము) లండన్‌లో జరిగిన ప్రపంచ కప్ పోటీలలో (12 వ స్థానము) నిరాశ కలిగించారు. టెన్నీసులో రమేష్ కృష్ణన్, జాషన్ అలీలు విజయాలు పొందారు. విజయ్ అమృతరాజ్ వ్యాపార సరళి ఆటలో గెల్పులు సాధించాడు. డేవిస్ కప్ పోటీలలో 'వరల్డ్ గ్రూపు'లో ప్రవేశించగలిగారు మన ఆటగాళ్ళు. పటిల్



సియోల్‌లో భారత వాలీబాల్ జట్టు
(కాంస్య పతక విజేతలు)

బాడ్మింటన్, ఫుట్‌బాల్, టీ. టీ.లలో నిరాశ మిగిలినది. గత ఏడు క్రీడారంగములో మనము విఫలమయాము:

## మన రాష్ట్రములో

మన రాష్ట్ర క్రీడామండలి క్రొత్త అధ్యక్షునిగా శ్రీ రామానందరావు నియమించబడ్డారు. తెలుగు యువకులు జయరామ్ (బాక్సింగ్) వాలీబాల్‌లో ముగ్గురు ఆసియా క్రీడలలో పతకములు సాధించారు. రాష్ట్ర క్రీడామండలి, వివిధ రాష్ట్ర క్రీడా సమాఖ్యలు తమ తమ క్రీడా క్యాలెండరు పూర్తి చేయుటలో చూపిన ఆసక్తి క్రీడాభివృద్ధిలో చూపలేదు. జాతీయ క్రీడలలో, గ్రామీణ క్రీడలు, మహిళా క్రీడలలో మనము సాధించిన విజయాలు అంతగా లేవు.

## రాష్ట్ర ఒలింపిక్ సమాఖ్య

ఆంధ్రప్రదేశ్ ఒలింపిక్ సమాఖ్య 'ఒకే వ్యక్తి' రాజ్యముగా కార్యదర్శి తిరుగులేని 'నవాబు' గా యుండి రాష్ట్రములో క్రీడాభివృద్ధికై ఏ విధమైన కృషి చేయుట లేదు. రాష్ట్రములో రాష్ట్ర ఒలింపిక్ సమాఖ్య పని తీరు అసంతృప్తి కలిగించినది.

— ముకరమ్